—అభయ ధామం వాళ్ళముందు ఏడ్చి మొత్తుకుని, తన కష్టాలు మొరబెట్టుకుని, వాళ్ళ పాదాలమీద పడి తనకు ఆశ్రయ మివ్వమని వేడుకోవాలి కాబో లనుకుంది; కానీ ఇక్కడ అన్ని విషయాలు అనుకున్నదానికి వ్యతిరేకంగా ఉన్నాయి!

'నిరంజన': కె. శివరావు. జననం: 1923, కుళకుంద (మైసూరు)లో. మాతృభాష—కన్నడం, పరిచితభాష—ఇంగ్లీషు. ప్రకటించిన రచనలు: 'బనశంకరి', 'రంగమ్మనవతార', 'చిరస్మరణె' (మొ॥ 25 నవలలు); 'సంధికాల', 'కోనయగిరాకి' (మొ 8 కథా సంపుటాలు); 'పుష్పహార' (కావ్యం); 'సాధన' (మొ॥ 8 వ్యాస సంపుటులు) మొత్తం ఏభైకి పైబడి ఉంటాయి. వీటిలో అనువాదాలు: 'ముదువణగిత్తి' (చెకోవ్ రచనకు); 'తాయి' (గోర్కీ 'మదర్'కి), 'అధఃపతన' (గోర్కీ రచనకు) మొదలైనవి. వీరి మొదటినవల 'విమోచనె' రష్యను భాషలో లక్షప్రతుల ముద్రణ పొందింది.

'శర్వాణి': నీలారంభం శారదమ్మ. జననం: 1928, కోలారు (మైసూరు)లో. విద్యాభ్యాసం కోలారు హైస్కూలులో. పదహారవ యేటనే రచన కుపక్రమించి 'వెండిమబ్బు', 'తామరకొలను', 'అపస్వరం', 'అపజయం', 'వసంతగానం' మున్నగు అనువాదగ్రంథాలు ప్రచురించారు. ప్రముఖ తెలుగు పత్రికలలో అనువాదాలు, సొంత కథలు ప్రకటిస్తున్నారు. 'త్రివేణీ'గారి కన్నడ నవలకు 'శర్వాణి'గారి తెలుగు అనువాదమైన 'పాప పరిహారం' EPB 186 గా వెనక వచ్చింది.

ABHAYA DHAAMAM

TELUGU VERSION OF
KANNADA NOVEL
ABAAYA

*By*
NIRANJANA

*Translation by:*
SARVANI

*Publishers:*
M. SESHACHALAM & Co.
EMESCO POCKET BOOKS

*Frist Edition:*
October, 1973

*Cover Design:*
BAPU

*Printers:*
FREEDOM PRESS, MADRAS-21

*Distributors:*
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
RASHTRAPATHI ROAD, SECUNDERABAD.

Rs. 2-50






224

తుంగమ్మ వెనుదిరిగి చూడలేదు.

నాలుగురోజులపాటు మనసులో తర్జన భర్జన చేసిన తరువాత ఈ నిర్ధారణ కొచ్చిందామె. మందు తీసుకురావటానికని మావళ్ళి పరిసరాలనుండి బయటపడిన ఆమె మరోదారివెంట నడవసాగింది. "ఇంకా వెలుగుంది. తొందరగా చీకటిపడితే బావుండును" అనుకుంటూ క్రుంబీగల్ రోడ్డులో నడుస్తోంది. ఒక్కసారికూడా వెనుదిరిగి చూడలేదు తుంగమ్మ.

అలా నడుస్తూ ఐదు దారులు కలిసే చోటుకి వచ్చిం దామె. అక్కడ ఉంది లాల్ బాగ్ ఉద్యానపు దక్షిణ గేటు.

తుంగమ్మ దృష్టి ఉద్యానపు ఆవరణను దాటి లోపలికి ప్రసరించింది. పచ్చిగడ్డిమీద కూర్చుని వేరుసెనక్కాయలు తింటూ కబుర్లు చెప్పుకుంటున్నవారూ, కాలిబాటలోనూ, చెరువుగట్టుమీదా నడుస్తున్న యువతీయువకులూ, అమ్మాయిలూ, అబ్బాయిలూ, విశ్రాంతికోసం వచ్చిన వృద్ధ దంపతులూ; అందంగా కత్తిరించిన పచ్చటి చెట్లూ, అలంకారంగా శాస్త్రరీత్యా పెంచబడిన రంగులపూలూ......

అన్నీ ఎప్పటిలాగే, వెనకటిలాగే ఉన్నాయి.

మావళ్ళిలోని ఆ యింట్లో ఉన్న ఈ ఐదునెలల అజ్ఞాతవాసపు అవధిలో, తుంగమ్మ మూడుమార్లు సాయంకాలాలు ఆ గృహిణితో కలపి లాల్ బాగ్ కి వచ్చింది. చిన్నపిల్లలా ఆడుకోవాలని ఆమెకు బలమైన కోర్కె కలిగిందపుడు. కాని అది ఒక్క క్షణం మాత్రమే తనగర్భంలో కదలకుండా ఉన్న పసిపాప ఆర్తనాదాన్ని విన్నదానిలా భ్రమించి తుంగమ్మ తనే ఏడుస్తూంది-ప్రతిమారూనూ.

తెల్లనివి పాలు, అని ఒప్పుకుంది తుంగమ్మ. కాని, ఆ పాలు చూస్తూ ఉండగానే విరిగిపోయాయి. ఆమె కట్టుకున్న గాలిమేడ కూలి పోయింది.

ఆ జ్ఞాపకాలన్నీ చేదుమాత్రలే....

లాల్‌బాగ్ గేటునూ, ఐదు దారుల కూడలినీ దాటి నడుస్తూంది తుంగమ్మ.

నిండు చూలాలు! అలా నడుస్తూంటే ఆసక్తిగా చూడని వారెవరు? కొన్నిజతల కళ్ళు తనను తాకుతున్నట్లనిపించిం దామెకు. అలా అనుకోగానే అధీరురాలయింది. ఒళ్ళంతా కాలిపోతున్నట్లని పించింది. అడుగులు తడబడ్డాయి.

అలాటి పరిస్థితిలోనూ చైతన్యం తెచ్చుకుని ముందుకు నడు స్తూంది. అది ఈస్ట్-ఎండ్ రోడ్డు. ఎడంవేపుకు వెడితే లాల్‌బాగ్ చెరువుగట్టు వస్తుంది. అక్కడే కుడివేపున ఉదయిస్తూంది కొత్త ఎక్స్టెంషన్ జయనగరం.

అటువేపే నడుస్తూంది తుంగమ్మ.

అక్కడే రెండుక్షణాలు నుంచుందామె. చీకటిపడుతూందప్పుడే. చల్లగాలివల్లనో, మనసులోని బాధవల్లనో దేహాద్యంతం వణుకు తూంది తుంగమ్మ.

ఇపుడేం చేయ్యాలి?....

ఆమెకు వివరంగా తెలిసినచోటు ఇంతదాకానే. ఇంతమాత్ర మైనా తనకు ఇన్నిరోజులూ అన్నం పెట్టిన గృహిణి వల్లనే తెలుసు కుంది. ఏదో సందర్భంలో ఆమెకు అనుమానం కలక్కుండా ఈ వివరాలు సేకరించింది.

ఆరునెలలక్రిందట తుమకూరులోనే ఈ మాట వచ్చింది. తల్లి తండ్రులు గుసగుసలాడుతూంటే తను రహస్యంగా విన్నది. కాని అక్కడా ఇక్కడా ఎవరూ తనముందు నోటితో మాత్రం ఆ ప్రస్తావన తేలేదు.

కానీ తుంగమ్మకెలాగో ఈ సంగతి తెలిసిపోయింది. అందుకే

ఎంతో శ్రమతో కొన్నికొన్ని వివరాలు సేకరించింది. వాటి ఆధారం తోనే ఇపుడు___

తుంగమ్మ అడుగులు తడబడ్డాయి.

తను ముందుకు వెళ్ళాలా వద్దా? తను చేస్తున్నపని సరైనదేనా?

ఆమె నుంచున్నచోట్లోనే కాస్త వంగి చేతిలోని మందుసీసాను నేలమీద పెట్టింది. తనకు అవసరంలేని ఆ సీసాను విసిరివెయ్యటానికి మనసు ఒప్పలేదామెకు. గాజు పగిలి ముక్కలవటాన్నిచూసి భరించ టానికామె సిద్ధంగా లేదు.

దేనికీ నొప్పికలిగించకూడదు, దేన్నీ ముక్కలు చెయ్యకూడ దన్నది ఆమె బాల్యంనుండీ పెంచుకున్న అభిప్రాయం.

కానీ ఇపుడామె తానే స్వతహా వాటికి లోనయింది. ఆమె మనసు బాధతో మూలుగుతూంది. హృదయం విరిగి ముక్కలయింది.

రెండు జీవాలను మోస్తున్న కాళ్లు ముందుకు నడిచాయి. ఎత్తు పల్లాలుగా ఉన్నదారిలో తుంగమ్మ నడవసాగింది.

దూరంగా పైన విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. అవి ఎత్తు పల్లాలుగా ఉన్న దారిపొడుగునా నక్షత్రతోరణంలా కనిపిస్తున్నాయి. కానీ, ఆ అందాన్ని చూసి మెచ్చుకునే స్థితిలో లేదు తుంగమ్మ. సాయంత్రం ఇల్లు వదిలినపుడు చీకటిపడితే చాలుననుకుందామె. కానీ ఇప్పుడు చీకట్లో ఎవరైనా దుర్మార్గుల పాలబడితే, అన్న భయం పట్టు కుంది.

భయంతో త్వరత్వరగా అడుగులువెయ్యసాగింది తుంగమ్మ. అడుగడుక్కీ అయాసం ఎక్కువవుతూంది.

త్రోవలో చాలమంది ఎదురయ్యారు. కొంతమంది తలమీద తట్ట, చేతిలో పారా ఉన్నాయి. పగలంతా కష్టపడి పనిచేసి ఇళ్ళకి పోతున్న శ్రమజీవులు వారు.

కొంతమంది ఆమె వెనుకనుండివచ్చి ఆమెను దాటిపోయేవారు. ఇంచుమించు అందరూ ఆమెవేపు చూసేవారు. మసకవెల్తురులోనూ వారి చూపులను తుంగమ్మ చదవగలుగుతూంది. ఏ భావమూ లేని అల సిన దృష్టి! కుతూహలం! ఇదా సంగతి! వీటితోబాటు తినేసేలా ఆక

లితో చూసే చూపులు! తను బాధల్లో ఉన్న తల్లి కాబోతున్న ఆడదన్న జ్ఞానంకూడా లేదు - ఆ పశువులకు.

దారి సాగుతూంది. చాలాదూరం నడిచాక కుడివేపు తిరిగింది. సుమారు అరవై ఇళ్లు అక్కడక్కడా విసిరేసినట్టున్న ప్రదేశం కని పించింది. విద్యుద్దీపాలు మెరుస్తున్నాయి. నగరంమధ్యలోనుండి బయల్దేరి పల్లెటూళ్ళవేపువెళ్లే రోడ్డొకటి ఆ ప్రదేశపు ఒక భాగాన్ని ఆవరించింది.

ఆ రోడ్డుకు దగ్గరగా ఒక ఇంటి అరుగుమీదినుండి భయం కరంగా మొరుగుతూంది - ఓ కుక్క. భౌ....భౌ....

నడచి నడచి అలసిపోయిన తుంగమ్మకు కళ్ళు తిరుగు తున్నాయి. దగ్గరగా ఎవరూ లేరు. అక్కడే ఉన్న ఓ రాతిమీద కూర్చుందామె....

మెల్లిగా ఊపిరిపీల్చుకుంది. ఎంత దూరంగా వచ్చేసిం దామె! ఎప్పుడూ తనను అంటిపెట్టుకునే ఉంటున్న తమ్ముడూ, ప్రియమైన తండ్రి, నాలుగేళ్ళక్రిందట పెళ్ళిచేసుకుని ఇద్దరు పిల్లల తల్లయ్యి అత్త వారింట్లో ఉంటున్న అక్కయ్య - ఓహ్! మధురమయిన ఆ కుటుంబ వాతావరణానికి తాను దూరమయి ఎంతకాలమయిపోయింది! ఆ తరు వాత తనకు ఆశ్రయమిచ్చిన కుటుంబం. ఎప్పుడో తన తండ్రికి శిష్యు డట ఆ యువక యజమాని. ఆ గురుశిష్యుల బాంధవ్యం స్కూలుబయట ఆత్మీయతగా, గాఢస్నేహంగా మారి, కష్టకాలంలో తన తండ్రిని ఆదుకుంది.

ఆ దంపతులిద్దరూ ధైర్యశాలులే!

తను భయంతో వణికిపోతూ తలుపువెనక నక్కి వారి సంభా షణను వింటూంది.

''ఎవరో చుట్టాలు వచ్చినట్టున్నారే?'' పక్కింటాయన ప్రశ్న.

''మా బాబాయి కొడుకు ఉత్తరప్రదేశ్‌లో ఉంటున్నాడని చెప్పలేదూ....వారి....''

''అలాగా! ఉత్తరప్రదేశ్‌లో ఉన్నారా ఆయన?''

"అంత మరుపా? మీ జ్ఞాపక శక్తిని మెచ్చుకోవాల్సిందే సుమండీ"

"మీ హాస్యాలకేంగాని, ఎప్పుడొస్తా రాయన?"

"అతనా? ఇప్పుడెక్కడొస్తాడు?....ఉద్యోగం దొరకడమే ఈమధ్యన కదా! అత్తవారింట్లో ఎవరూ లేరని పురిటికి ఇక్కడికి పంపాడు."

"అలాగా...."

అన్నీ అబద్ధాల పుట్టలే. తనకూ ఓ మొగుడున్నాడని నమ్మించ టానికి కల్పిస్తున్న అబద్ధాలు.

ఇంటావిడకూడా ఇందులో తీసిపోలేదు.

"మీ చుట్టాలా?"

"అవునండి. పురిటికి బెంగుళూరైతే అన్నిటికీ వీలుగా ఉంటుందని పిలిపించుకున్నాం."

"నిజమే సుమండి. మొన్న మా సుందరి పురిటికొచ్చినపుడు ఏంజరిగిందో తెలుసా? ఆ నర్సులు పీల్చేశారు మమ్మల్ని...."

"ఆ సంగతేం చెబుతార్లెండి. ఆస్పత్రిలో పైనుండి క్రింది దాకా ఒకటే కదా....వాళ్ళుమాత్రం ఏం చేస్తారు లెండి. ఇచ్చే జీతాలు చాలక...."

"అదీ నిజమే...."

కబుర్లు తుంగమ్మను వదిలి మరోవేపు సాగిపోయేవి. చాలీ చాలని జీతంతో కటకటలాడే తమ గుమాస్తా మొగుళ్ళచేతిలోనూ అప్పుడప్పుడూ కాస్త డబ్బు ఆడుతూ ఉండటాన్ని తల్చుకుని లోలో పలే నవ్వుకునేవారు. తుంగమ్మను గురించి చర్చించేవారుకాదు.

అలా గడిచాయి ఐదునెలలు.

తుంగమ్మకు తెలుసు- ఆ దంపతుల దృష్టిలో తాను నేరస్థురా లని. తన విషయంలో వారు చూపుతున్నది జాలి కాదు. తను సంతో షంగా ఉండాలని వాళ్లు చేస్తున్న ప్రయత్నం తనకోసం కాదు-ఇరుగు పొరుగులకు అనుమానం రాకుండా ఉండాలని.

మెడలోని నల్లపూసలు తనే కట్టుకున్నది.

ఈ నాటకపు బ్రతుకు అసహ్యమనిపించిందామెకు. దుర్భరంగా గడుస్తున్నాయి రోజులు.

అలాటి నిస్సహాయమైన సందర్భంకోసమే ఎదురుచూస్తున్న చావు, పడగవిప్పి నేనున్నానుగా అనేది వయ్యారంగా. కాని చావు వేపు మనసు పోనివ్వలేదు తుంగమ్మ. అతను వస్తాడన్న నమ్మకం బలంగా ఉండేదామెలో. రోజులు గడుస్తున్నకొద్దీ ఆ ఆశకూడా క్షీణిస్తూ వస్తూంది. కానీ తుంగమ్మ ఊపిరి బిగబట్టి ఎదురుచూస్తూనే ఉంది.

కానీ ఆఖరికి అతను రానేలేదు.

ఓ రాత్రి తనున్న ఇంట్లోని దంపతుల మాటలు విని వణికి పోయింది తుంగమ్మ. ఏదో కారణంవల్ల ఆ దంపతుల మధ్య చెలరేగిన విరసం తుంగమ్మ వేపు తిరిగింది.

''వెళ్ళండి. ఒక్కర్తేనా ఏమిటి మీకు మాస్టారు. ఇంకా పది మంది అమ్మాయిల్ని తీసుకురండి. ఈ ఇంటినో పురిటి ఆస్పత్రిగా మార్చేయండి.''

''ఇష్.... నెమ్మదిగా మాట్లాడు. ఇప్పుడే పడుకున్నట్లుంది.''

''అవునవును. బుల్లిపాపాయి. నా మాట వింటే నొచ్చుకుని గొల్లుమని ఏడ్చేస్తుంది కాదూ,''

''ఏమిటే నీ గొడవ?''

''నాది గొడవగానే ఉంటుంది మీకు. పొద్దస్తమానం ఓ మూలలో కూర్చుంటుందా.... మన పాపాయి ఏడ్చి గోల చేస్తున్నా సరే దగ్గరకి తీయదు.''

''పాపం, తన బాధలో తనుంటుంది.''

''కాదూ మరి. నేను మా పుట్టింటికి వెళ్ళిపోతాను.''

''భలె. బాగానే ఉంది. నేనుమాత్రం ఏం చెయ్యగలను? మొహమాటానికి ఒప్పుకోక తప్పలేదు మరి. ఇంక కొద్దిరోజులే....''

''అలాగే అంటారు''

''వాళ్ళ నాన్న క్రిందటి నెల వచ్చినప్పుడే చెప్పలేదూ. తొమ్మిదో నెల అనుకుంటాను ఇంకోసారి డాక్టర్‌కి చూపించి ఆస్పత్రిలో చేర్చేద్దాం.''

"చేర్చండి. మళ్ళీ అక్కడికి వెళ్లి సేవలు చేస్తాను."

"అఖర్లేదే! రోజుకో సారి వెళ్లి చూచిరావటమే!"

"తరువాత బిడ్డ - తల్లి ఇక్కడికేగా రావటం!"

"ఉహూ! అదేంలేదు. ఆయనకు రాసేస్తాను. మీర్దేమైనా చేసుకోండి-ఈమాత్రం చెయ్యటమే మా కెక్కువా అని."

—బాధ, వ్యంగ్యం, జాలి కలిసిన పలుకులు.

ఆ రాత్రి నిద్రపట్టలేదు తుంగమ్మకు.

మరునటిరోజు వాళ్ళదగ్గర్నుండి ఆమె ఎదురుచూసిన ప్రతిక్రియ ఏమీ రాలేదు. మామూలుగానే పలకరించారు. "కాస్త సుఖవుగా ఉందా?" లాటి మాటలు.

అంతా కృత్రిమం, నటన!

తుంగమ్మకు వాళ్ళను ద్వేషించా లనిపించింది ఓ క్షణం. కాని అలా చెయ్యటానికి ఆమెకిగల హక్కేమిటి? ఇన్నిరోజులు ఆశ్రయ మిచ్చినందుకు కృతజ్ఞత చూపే విధానమా ఇది? తుంగమ్మకి తనమీద తనకే కోపం వచ్చింది. కాని ఆ తరువాత ఆమె ఓ నిశ్చయానికి రావటానికి ఎక్కువ రోజులు పట్టలేదు.

తన నిశ్చయానికి ఓ రూపం ఇస్తూ ఇంత దూరం నడిచి వచ్చింది తుంగమ్మ.

తుంగమ్మ లేచి మళ్ళీ నడవ సాగింది. రోడ్డుదాటి పక్కవీధి వేపు అడుగులు వేసింది. అక్కడే ఎక్కడో ఉండాలి ఆమె గమ్యం. దాని పేరు తెలు సామెకు.

కానీ తను ఆ స్థలాన్ని చేరుకోలేకపోతే! వెనక్కి వెళ్ళాల్సి వస్తే?

ఉహుఁ. ఇక వెనక్కివెళ్ళే ప్రసక్తి లేదు.

అయితే ఎవరినయినా అడిగి చూడాలి. ఇందులో అవమానం ఏం ఉంది?

అది జన సంచారం ఎక్కువగాలేని వీధి. అక్కడోటి ఇక్కడోటి - కలవారి ఇళ్ళలా ఉన్నాయి. వాళ్ళని అడిగితే!

అడగచ్చో, అడగరాదో?

ఆ వీధి తరువాత మరొకటి. అదీ అలాగే ఉంది. మగవాళ్ళు ఇళ్ళలోపలికి వెడుతున్నారు. అడుక్కుంటున్న కుర్రాళ్ళిద్దరు కనిపించారు. వాళ్ళ నడిగితే! వాళ్ళకు తెలిసుంటుందో లేదో!

ఆ వీధి ఆఖర్లో పెద్ద ఇంటిగేటుముందు విద్యార్థినుల్లా కనిపించే ఇద్దరు అమ్మాయిలు నుంచుని మాట్లాడుకుంటున్నారు. తన వయస్సో ఇంకాస్త తక్కువో ఉంటుంది వాళ్ళకి. వాళ్ళకే సమస్యలూ ఉండవు. చదువుకుంటూ రంగురంగుల కలలు కంటూ రోజులు గడిపేస్తారు.

తుంగమ్మ వాళ్ళని సమీపించింది.

"ఇక వెడతానే, ఆలస్యమయితే అమ్మ కోప్పడుతుంది." అంటూ ఓ అమ్మాయి బయల్దేరింది. ఇంకో అమ్మాయి గేటులోపలికి తప్పుకుని గేటువేస్తూ—

"జాగ్రత్త. సందు మొగలో కారు నిల్చి ఉంటుందేమో జాగ్రత్త" అంటూంది.

"నాకా భయం ఏమీలేదులేవే."

ఆ మాటలకర్థం ఏమిటో తుంగమ్మకు తెలియలేదు. ప్రపంచంలో భయపడాల్సింది తనొక్కతే. ఈ అమాయకపు అమ్మాయిల కెందుకూ భయం? ఆ అమ్మాయిలకు తెలిసుంటుందేమో. అడిగిచూస్తే!

ఒక అమ్మాయి లోపలికి వెళ్ళిపోయింది. రెండో అమ్మాయి ముందుకు నడుస్తూంది. తుంగమ్మ పిలిచింది.

"అమ్మా!"

ఆ అమ్మాయి వెనుదిరిగి చూడలేదు.

"అమ్మా!"

తన్నెవరు పిలుస్తారన్న సందేహంతో తిరిగిచూసిన అమ్మాయి అడిగింది- "నన్ను పిలిచారా?"

"ఊఁ-నాకో సాయం చేస్తారా?"

"చెప్పండి."

నాకు తెలియదన్న జవాబు రాకుండా ఉండాలని తుంగమ్మ దేవుడికి మొక్కుకుంటూ అడిగింది-

"అభయ ధామం ఎక్కడుందో చెబుతారా?"

"ఏమిటి?"

"అభయ ధామం...."

"ఓ...."

తెలివిగల అమ్మాయి గ్రహించిందేమో! నవ్వినట్టనిపించిందా! పరిహాసంగా నవ్విందా? ఏమో!

ఆ చీకట్లో తుంగమ్మ కేమీ కనిపించటం లేదు. ఓ క్షణం ఆపిల్ల తుంగమ్మను పైనుండి క్రిందిదాకా చూసినమాటమాత్రం వాస్తవం. తన పరిస్థితి అర్థమయి ఉంటుంది. "నాతోరండి. అటువేపే వెళ్ళాలి మా యింటికి. చూపిస్తాను...."

తుంగమ్మ కళ్ళు నీళ్ళతో నిండాయి. కంఠం గద్గదమయింది. దేనివల్ల ఆ కన్నీరు? దుఃఖాశ్రువులా? ఆనంద బాష్పాలా? కృతజ్ఞత కన్నీరా?

ఏ ఆలోచనాలేక పసిపిల్లలా ఆ అమ్మాయిని వెంబడించింది. కొంతదూరం వెళ్ళాక ఆ అమ్మాయి ఎడంవేపు చూపించి చెప్పింది—

"అదిగో! అదే అభయ ధామం."

ఆ అమ్మాయి ఇక తనను వదిలిపెట్టి వెళ్ళిపోతుంది. తనిక ఒంటరి దాన్నవుతానని దిగులుపడుతూంది తుంగమ్మ. అయినా అమ్మాయి చూపించినవేపు చూసింది. ఎత్తుగా ఉన్న గోడ ఎదురుగా ఓ విద్యుద్దీపం ఉంది. దానిక్రింద నల్లటి పెద్ద తలుపు. ఆ గోడ చుట్టూరా ఖాళీస్థలం. దానిచుట్టూ ప్రహరీగోడ.

"అదిగో, ఆ లైటుక్రింద బోర్డు ఉంది. 'అభయ ధామం' అని రాశారు-చూడండి."

ఆ అమ్మాయి చెప్పింది - తుంగమ్మతో మళ్ళీ.

"ఆ, చూశాను. వెడతాను" అంది తుంగమ్మ.

"నేను వెళ్ళనా ఇక...."

"ఊఁ...."

ఏమిటి, ఎందుకు అని తనను శల్యపరీక్ష చెయ్యలేదా అమ్మాయి. ఎంత మంచి అమ్మాయి! చీకటిలో కలిసిపోతూ వెడుతున్న ఆమెవేపు చూస్తూంది తుంగమ్మ.

ఆ తరువాత మళ్ళీ ఆ భవనంవేపు చూసింది.

నిశ్చలంగా, నీరవంగా నుంచుంది అభయ ధామం.

ఆఖరికి తుంగమ్మ వెళ్ళాలనుకున్న చోటుకి వచ్చింది.

నెమ్మదిగా నడచివెళ్ళి ఇంటిముందున్న చిన్నగేటు తెరిచింది. అది చప్పుడు చేస్తూ తుంగమ్మను లోనికి రానిచ్చి మళ్ళీ మూసుకుంది.

ఇంటి తలుపును సమీపించింది తుంగమ్మ.

ఒక్కక్షణం ఆమె మనసు ఊగిసలాడింది.

మరుక్షణం తలుపుమీద కొట్టింది.

''అమ్మా, అమ్మా....''

మళ్ళీ తలుపుమీద చప్పుడు.

''అమ్మా, అమ్మా....''

చీకటివాతావరణంలో ఆమె కంఠం ప్రతిధ్వనించింది.

''అమ్మా, అమ్మా....''

గట్టిగా మూసుకున్న ఆ తలుపుమీద తన పిడికిలితో బలంగా తడుతూ పిలిచింది తుంగమ్మ.

''అమ్మా, అమ్మా....''

బదులు రాలేదు. ఆమె పిడికిలి పట్టు సడలింది తన ఒంట్లో సత్తువంతా పోతున్నట్లనిపించిం దామెకు. కళ్ళు మసగ్గా అయ్యాయి.

''అమ్మా'' అంది తుంగమ్మ. కానీ ఆ పిలుపు ఆమెకే విని పించనంత క్షీణంగా ఉంది.

* * *

లోపల పిల్లలంతా భోజనానికి కూర్చున్నారు. ఒకటే గోలగా ఉంది. ఆ సమయంలో జరగని గొడవంటూ ఉండదు.

ఆ చప్పుళ్ళమధ్య బయటినుంచి వచ్చిన పిలుపు సరసమ్మకు వినిపించలేదు.

తమ గదిలోనే కూర్చున్నారు సరసమ్మ. కళ్ళజోడు పెట్టుకుని వెనుకటిరోజు చదివి మధ్యలో ఆపిన పుస్తకాన్ని ముందుకు చదవ టానికి ప్రయత్నిస్తున్నారు.

ఆమె మంచానికి దగ్గరే క్రింద పడకమీద పడుకునుంది.

పద్దెనిమిదేళ్ళ జలజ. అభయ ధామంలో నాలుగేళ్ళు గడిపి పాతబడిన ఆ అమ్మాయి రెండు రోజులుగా జలుబు జ్వరాలతో బాధపడుతోంది. నిద్రపట్టక దిండుమీద తల ఆన్చి కళ్ళు తెరుచుకునే పడుకుంది....ఆమె మనసు కిటికీలోనుండి బయటికివెళ్ళి ఆ వాతావరణంలోని హాయిని అనుభవిస్తోంది.

అమ్మా అన్న పిలుపు, తలుపు చప్పుడు, దబ్ అని క్రిందపడిన చప్పుడు....

"దొడ్డమ్మా...."

"ఏమిటి జలజా !...."

"బయట చప్పుడు వినిపించలా ?"

చదువుతున్న వాక్యంమీద వేలుంచి సరసమ్మ శ్రద్ధగా విన్నారు.

"ఏమీ లేదే !"

"బయట దొడ్డమ్మా, ఎవరో వచ్చినట్టుంది."

కానీ చప్పుడేమీ వినిపించడం లేదు. జ్వరతీవ్రతలో ఆ అమ్మాయి కలవరిస్తోందేమో అనుకున్నారు సరసమ్మ. మృదువుగా—

"చప్పుడేమీ వినిపించటం లేదే.....కలగన్నావేమో.....పడుకోమ్మా...." అన్నారు.

"లేదు దొడ్డమ్మా....నా కసలు నిద్ర పట్టనే లేదు. నిజంగా విన్నాను. వెళ్ళి చూడండి కావాలంటె...."

పట్టు పట్టిందంటే ఇక వదలదు జలజ. తలుపు తీసి చూడక పోతే ఇక రాత్రంతా నిద్రపోదు కూడా. ఆ సంగతి సరసమ్మకు బాగా తెలుసు.

అమ్మాయిలంతా భోజనం చేసి ఒక్కొక్కరుగా కంచాలు కడగటానికి నీళ్ళగదివేపు వెడుతున్నారు.

సరసమ్మ నవ్వుతూ, కళ్ళజోడు, పుస్తకం బల్లమీదపెట్టి లేచి తలుపువేపు వెళ్ళారు. ఆమె నడుమునుంచి వ్రేలాడుతున్న తాళం చెవుల గుత్తిలోని ఓ పెద్దతాళం చెవితో తాళం తీశారు. తలుపు తెరవగానే బయటినుంచి రివ్వున చల్లగాలి లోనికి ప్రవేశించింది.

సహజంగానే ఆమెదృష్టి మెట్లవేపు వెళ్ళింది. జలజ చెప్పింది నిజమే !

రాళ్ళమెట్లమీద ముడుచుకుని పడుందో స్త్రీ దేహం. కుడిచేయి తలుపువేపు చాచింది. మొహం మట్టిలో అతుక్కుపోయినట్టుంది.

జలజ క్షీణకంఠం వినిపించింది.

''దొడ్డమ్మా....ఎవరది ?''

సరసమ్మ జదులు చెప్పలేదు. వంగి క్రిందపడిన ఆ స్త్రీ మొహం పైకెత్తి ముక్కుదగ్గర వేలుపెట్టి చూశారు. స్పృహ కోల్పోయిందంతే. ఆమె క్రిందికిదిగి ఆమెను ఎత్తుకుని లోపలకు తీసుకెడదామని ప్రయత్నించారు. కానీ చేతకాలేదు.

''సావిత్రీ....లలితా....తొందరగా రండర్రా....కాపిని నీళ్లు పట్రండి.''

అక్కడున్న అమ్మాయిల్లో పెద్దవారయిన సావిత్రీ, లలితా పరిగెత్తుకుంటూ వచ్చారు. వారివెనుక అమ్మాయిల గుంపంతా అక్కడికి చేరుకుంది. ఇంకొకప్పుడయితే ఆ తెరచిన తలుపులనుండి బయటి ప్రపంచాన్ని చూసేవారంతా. పారిపోదామన్న ఆలోచనా వచ్చేదే. కాని ఇప్పుడు అందరిచూపూ తలుపుదగ్గర పడివున్న మనిషిమీదే ఉంది.

తమలాటి మరో అభాగ్యురాలు !

తుంగమ్మను లోపలకు తీసుకువచ్చారు. తలుపులు మళ్ళీ మూసుకున్నాయి. తాళం కాపలా కాయటానికి తన స్థానాన్నలంకరించింది.

అసహాయ పరిస్థితిలో అభయ ధామపు ఆసరా వెతుక్కుంటూ వచ్చిన విందు చూలాలు. నిస్సహాయురాలయిన ఆడదాని అనేక రూపాలను చూసిన అలవాటున్నా, సరసమ్మ హృదయం ఎప్పటిలాగే ఈసారి కూడా ఆర్ద్రతతో, జాలితో నిండిపోయింది. దయగా శైత్యోపచారాలు చెయ్యసాగా రామె.

తుంగమ్మ కళ్ళు తెరిచింది. ఆమె ముగ్ధదృష్టి అక్కడున్న వారిమీద పడి, ఏమీ అర్థంకానట్టు కళ్ళు మెల్లిగా మూసుకున్నాయి. దీర్ఘంగా నిట్టూర్చింది తుంగమ్మ. ఆమె దేహం కదిలింది.

సరసమ్మ లేచినుంచుని చుట్టూ నుంచున్నవారితో, "పొండ్రా. పొండి. పక్కలేసుకుని పడుకోండిహ" అన్నారు. 'దొడ్డమ్మ' మంచంమీదే పడుకోబెట్టారు తుంగమ్మని. మిగతా వాళ్ళంతా వెళ్ళిపోయాక సావిత్రి—

"ఈమె నెక్కడ పడుకోబెడదాం దొడ్డమ్మా?" అంది.

"ఈ గదిలోనే ఉండనీ దొడ్డమ్మా.... ఇక్కడే పడకవెయ్యనీ-" పడుకున్నచోటులోనుండే అంతా గమనిస్తున్న జలజ అంది.

"అలాగే" అన్నారు దొడ్డమ్మ. జ్వరపీడితురాలయిన జలజ మాటలతో ఆమె హృదయం మరింత కోమలమయింది.

"సావిత్రీ.... ఇంకో పరుపు తీసుకురామ్మా. అలాగే కాస్త పల్చగా గంజి చేసి పట్టుకురా."

తుంగమ్మకు స్పృహ లేనంతవరకూ అందరూ ఆసక్తి కనపరచారు తెలివివచ్చాక మిగతా పిల్లలకు కొత్తగా తెలుసుకోవాల్సిందేమీ లేదనిపించింది. తమలాగే మరొకర్తి—ముప్పయిపక్కన మరొహటి, ముప్పయ్యొకటి.

కాని సరసమ్మ దృష్టిలో అలా కాదు. తను బ్రతికించి మనిషిని చెయ్యాల్సిన మరోజీవి ఆమె. పడుకున్న ఆ స్త్రీవేపు చూశా రామె. దిష్టి తగులుతుందేమో అన్నంత అందమయిన రూపు కాదామెది. కానీ ఆకర్షణీయమైన మొహం. తొలి యౌవనంలోని అంగసౌష్ఠవం మోహకంగా వుంది. తల్లి కాబోతున్న స్త్రీ.... చెదిరినా అందంగా కనిపిస్తున్న పొడుగాటి జుత్తు దానిమీద మృదువుగా నిమరాలన్న కోర్కె కలిగిందామెకు. ఆమె మంచంమీదికి వంగి తన కుడిచేతితో తుంగమ్మ జుత్తు నిమిరింది.

ఆ స్పర్శకు తుంగమ్మ కళ్లు తెరిచింది. చిరునవ్వు నవ్వుతున్న నల్లటిమొహం కనిపించింది. నలుపు-తెలుపు మిశ్రితమైన జుత్తు. వెడల్పాటి మొహం. మమత- సానుభూతి మూర్తీభవించినట్టున్న ఆ మొహంలోకి చూస్తూ- తుంగమ్మ తానూ నిర్భయంగా చిరునవ్వు నవ్వింది.

"భయపడకమ్మాయ్. నీకేం భయంలేదు."

ఎంతోమందికి సరసమ్మ ఇవే మాటలు చెప్పారు. కానీ ఆ కంఠం భావమే లేని యంత్రధ్వనిలా లేదు. సంగీతవిద్వాంసురాలి నాగ స్వరంలా ఉంది.

తుంగమ్మ చూపులు గదినంతా పరికించి క్రింద పడుకుని కళ్ళు మిటకరిస్తూ తనవేపే చూస్తూన్న ఓ అందమయిన మొహంమీద విలి చాయి.

అది గమనించి సరసమ్మ అన్నారు—

"జలజ. రెండు రోజులుగా జ్వరం వస్తూంది."

జలజ చిరునవ్వు నవ్వింది—మరుగుతున్న తన హృదయపు కవాటాన్ని తెరచి చల్లటి గాలిని లోపలికి రానిచ్చిన ట్టనిపించింది తుంగమ్మకు. ఆకలిగొన్న ఆమెకు మధురమయిన స్నేహపు ముద్దను అందించినట్టయింది-జలజ చిరునవ్వు.

సరసమ్మ తామూ మంచం దగ్గరగా కూర్చుంటూ "పడినప్పు డేమయినా దెబ్బతగిలిందా?" అన్నారు.

తను పడిపోయింది కదూ. తను ఎప్పటినుండో మంచంమీదనే పడుకుని నిద్రపోవటం లేదన్నమాట....మళ్ళీ ఆమె మెదడు తనను గురించి ఆలోచించసాగింది. సాయంత్రం మావళ్ళి వదలివచ్చినప్పటి నుంచి ఇప్పటిదాకా. తలుపుకొడుతూ కళ్ళుతిరిగి పడిపోయింది తను.... తనను తెచ్చి ఇక్కడ పడుకోబెట్టి ఉంటారు.

తనకి అభయం దొరికినట్టేగా!

"దెబ్బ తగిలిందా పడినప్పుడు?"

మళ్ళీ అదే ప్రశ్న. తనకా? నొప్పా? అవును, ఒళ్ళంతా నొప్పిగా ఉన్నట్లుంది.

"ఆఁ.... ఊఁ...."

మూలుగుతూంది తుంగమ్మ. గర్భానికేమయినా దెబ్బ తగిలిం దేమో అన్న భయం సరసమ్మకు. కానీ ఓదార్పుగా అన్నారు—

"ఇవ్వాళంతా హాయిగా విశ్రాంతి తీసుకుంటే రేపటికి సుఖ వుగా ఉంటుందిలే!"

రేపు! తను?

బాధలన్నిటికి ఉపశమనంలాగా సరసమ్మ మృదుకంఠం మళ్ళీ పలికింది-

"ఆకలేస్తోందా?"

దిండు మృదువుగా ఉంది. పడక మెత్తగా ఉంది. బ్రతుకు సంగీతంలా పలుకూ మృదుమధురంగా ఉంది. నాలుకతో తన పెదవులను తడుపుకొంది తుంగమ్మ.

"కాస్త జావ త్రాగు...."

"ఊఁ... "

ఆమెలో విచారణశక్తి జాగృతమయింది. ఇక ప్రశ్న పరంపర తనను చుట్టుముడుతుంది— 'ఎవరు నువ్వు?' 'ఎక్కడి దానివి?' 'ఎందుకూ?' అంటూ.

తుంగమ్మ నిరీక్షిస్తోంది. కానీ ఎవరూ ఆమె నేమీ అడగనే లేదు.

సరసమ్మ గదిలోంచి బయటకు వెళ్ళారు ఆవిడ వెళ్ళిపోయారే అన్న బెంగతో అటూ ఇటూ చూసింది తుంగమ్మ. ఆమె కళ్ళు జలజ వేపు తిరిగాయి. ఆ పిల్ల మొహంలోని మందహాసం ఇంకా అలాగే ఉంది, అందులోనుండి మాట బయటపడింది-

"పిల్లల్ని పడుకోబెట్టటానికి వెళ్లారు దొడ్డమ్మ."

అయితే ఆమె ఈ పిల్లకు దొడ్డమ్మ అన్నమాట. కాని ఇంకా కొంతమంది అలాగే పిలిచారే....ఇంకా ఏవేవో ఆలోచనలు....వాటికి ఓ క్రమం లేనట్టుగా అలుక్కుపోయినట్టుగా అనిపించింది.

మళ్ళీ జలజ ప్రశ్నతో తుంగమ్మ ఈ ప్రపంచంలో పడింది.

"మీ పేరేమిటండీ?"

"ఆఁ...."

"మీ పేరు?"

"తుంగమ్మ."

"ఓ—" అంది జలజ. ఆ కంఠంలో నిరాశ ధ్వనించింది. తుంగమ్మ చిత్రంగా ఆ పిల్లవేపు చూసింది.

"ఏం? బాగా లేదా?" అన్న ప్రశ్న ఆమె మనసులోనుండి బయటపడలేదు.

అంతలో మరోపిల్ల లోపలికి వచ్చి "మీ పేరేమిటని అడుగుతున్నారు దొడ్డమ్మ" అంది.

ఆ మాటల్ని అర్థం చేసుకుంటూ ఈ పిల్లక్కూడా ఆమె దొడ్డమ్మేనా అనుకుంది తుంగమ్మ.

"ఆమె పేరు తుంగమ్మ."

జలజ బదులు చెప్పింది. వచ్చిన పిల్ల వెనుదిరుగుతూ "అప్పుడే పరిచయం చేసుకున్నావన్న మాట" అంది.

జలజ మంచంవేపు తిరిగి పడుకుంటూ ——

"మీ పేరు రిజిష్టర్‌లో రాసుకుంటారు అందుకు" అంది.

లావుపాటి పుస్తకంలోకి పేరు ఎక్కించుకోటం—అవును చిన్నప్పుడు బడికి వెళ్ళినపుడు అలా రాసుకోవటం గుర్తుంది తుంగమ్మకు.

ఆ దొడ్డమ్మ తన పేరుమాత్రమే అడిగింది, మిగతావన్నీ ఈ పిల్ల అడుగుతుందేమో!

జలజ వాగుడుకాయ. "ఇప్పుడొచ్చిన అమ్మాయిని చూశారుగా, గున్నేనుగు దాని పేరు సరస్వతి" అంది.

తుంగమ్మ నవ్వింది, ఏనుగుపిల్ల అన్నమాటకు.

"పేరు సరస్వతా.... చదువు ఉహూఁ.... ఓ ముక్కకూడా రాదు. మొద్దు బుర్ర...."

భలే తమాషాగా ఉందిక్కడ. తను చావు బ్రతుకులమధ్య పడి కొట్టుకుంటూ కడికి చేరుకుంది. వీళ్ళేమో చదువూ సంధ్యల గురించి మాట్లాడుతున్నారు.

జలజ మాటలకు బదులు చెప్పా లనిపించినా ఏం చెప్పాలో తోచలే దామెకు.

ఈసారి బదులు చెప్పితీరాల్సిన ప్రశ్న వేసింది జలజ.

"ఏమండీ, నిద్రొస్తుందా?"

"లేదు."

"అలసటగా ఉందా?"

"ఊఁ...."

"రేపు నేను లేచేస్తాగా-మీకు తలంటి పోస్తాను."

తుంగమ్మ చిరునవ్వు నవ్వింది. అలాటి మాట విని ఎంతకాలమయిందో!

అభయ ధామం వాళ్ళముందు ఏడ్చి మొత్తుకుని, తన కష్టాలు మొర పెట్టుకుని, వాళ్ళ పాదాల మీదపడి తనకు ఆశ్రయ మివ్వమని వేడుకోవాలి కాబోలనుకుంది తుంగమ్మ. కానీ ఇక్కడ అన్ని విషయాలు అనుకున్నదానికి వ్యతిరేకంగా ఉన్నాయి!

నిట్టూరుస్తూ తుంగమ్మ మెల్లగా లేచి కూర్చుంది.

"ఎందుకు లేస్తున్నారు?" అంది జలజ. ఆ కంఠంలో కాతరత తొంగి చూపింది.

"ఊరికేనే."

"లేవకండి ..." అంటూ సరసమ్మ లోపలికి ప్రవేశించారు. ఆమె వెనుక సావిత్రి పక్కచుట్ట తీసుకు వచ్చింది. జలజకు కాస్త దూరంగా గోడవారగా పక్క వేసింది.

సరసమ్మ ఒక్కక్షణం ఆలోచించారు. జ్వరపీడితురాలయిన జలజ సామీప్యం ఓ వేపు, ఎత్తుగా ఉన్న మంచం ఓ వేపు. ఆ గర్భిణీ ఎక్కడ పడుకోవాలి?

"ఎక్కడ పడుకుంటావ్ తుంగమ్మా?"

మళ్లీ ఆ పడకమీదనే పడుకోబోతున్న తుంగమ్మ—

"ఆఁ...." అంది.

"నా దగ్గర పడుకోనిండి దొడ్డమ్మా."

పట్టుపట్టి మాట్లాడే ధోరణి జలజది. సరసమ్మ నవ్వారు. తుంగమ్మ చిరునవ్వు నవ్వింది.

మెల్లిగా లేచి వెళ్ళి ఆ పడకమీద కూర్చుంది తుంగమ్మ. ఆమె కెదురుగా జలజ పక్కమీద చోటు చేసుకు కూర్చున్నారు సరసమ్మ.

ఆమె తీక్ష్ణదృష్టి తనను శల్యపరీక్ష చేస్తుందేమో నన్న బెదురుతో మెల్లిగా తలెత్తి ఆమెవేపు చూపింది తుంగమ్మ. కాని అక్కడ

తాను ఊహించినట్టుగా ఏమీ కనిపించలేదు. ఆమె దృష్టి ప్రశాంతంగా-తను మొదట చూసినప్పు డెలా ఉందో అలాగే ఉంది.

సరసమ్మ ఉద్దేశపూర్వకంగానే దృష్టి మరల్చి జలజవేపు చూశారు. చేత్తో జలజ నుదిటిని తాకిచూశారు. ఒళ్ళు వేడిగా లేదు.

"జ్వరం తగ్గినట్టుందే?"

"అవును దొడ్డమ్మా. మీరు పడుతున్నశ్రమ చూడలేక అయ్యో! పాపం! అనిపించుంటుంది—ఆ జ్వరానికి. త్వరగా పారి పోయింది."

"కాదూ మరి."

ఆమె దృష్టి మంచం క్రిందున్న మందుసీసామీద పడింది.... రాత్రి తీసుకోవాల్సిన ఆఖరి మోతాదు—ఎర్రమందు.

జలజ దొడ్డమ్మ చూపుల్లోని అర్థం గ్రహించి మారాం చెయ్య సాగింది.

"దొడ్డమ్మా. ఇక మందు తాగను నేను. మీరే అన్నారుగా జ్వరం లేదని వద్దు నాకు. ఊహుఁ "

కాని సరసమ్మ చిన్న గ్లాసులో మందు పోసి జలజ నోటికి అందించింది.

"దొడ్డమ్మా....వద్దు "

"నోరు తెరు. కొడతానంతే!"

జలజ నవ్వుతూ ప్రతిఘటిస్తూ మందు తాగేసింది.

"ఊఁ....పడుకో ఇంక. మెదలకుండా...."

"నాకు నిద్ర రావటంలా!"

"ఎందుకు రాదో చూస్తాను కళ్ళు మూసుకు పడుకో "

తుంగమ్మ దృష్టిలో ఇది తల్లీ బిడ్డల కలహం. అందులో సందేహమే లేదు. దొడ్డమ్మ ప్రేమకు పాత్రురాలయిన జలజ ఎంత సుఖి!

జావ కంచంలో పోసి తెచ్చింది సావిత్రి తుంగమ్మ ముందు ఉంచింది. జలజ చెయ్యి కడుక్కోవటానికి ఉంచిన పళ్ళెంలోనే తుంగమ్మ చెయ్యి కడుక్కుంది.

"అమ్మాయ్, జావ తాగమ్మా!"

జావ తాగాలి. వాళ్ల ఏ జాతివాళ్ళో! తుంగమ్మ జావవేపు చూసింది. తెల్లటి జావలో ఎర్రటి ముక్కపుడకలా కూర్చుంది వూరగాయ ముక్క. దాన్ని చూపుడువేలితో తాకింది తుంగమ్మ. జావలో మునుగుతోంది ఊరగాయ ముక్క.

ఏ జాతయితేనేం? ఇక అలాటి ప్రశ్నలకు చోటివ్వకూడదు.

"వేడిగా ఉందా అమ్మాయ్?"

"లేదు."

"నెమ్మదిగా తాగు. కంచం చేతిలోకి తీసుకో."

ఆ జావ తాగాక హాయి అనిపించింది తుంగమ్మకు.

ఆ దొడ్డమ్మ అప్పుడూ ఏమీ అడుగలేదు. ఆ సాయంత్రం దాకా శూన్యం ఆమెను వెక్కిరిస్తుంది. ఇప్పుడు ఆప్యాయం ఆ శూన్యాన్ని నింపుతూంది. ఇది సాధ్యమనీ, సంభవమనీ ఎప్పుడూ అనుకోలేదు తుంగమ్మ-కల్లోకూడా.

సరసమ్మ లేచి తన పక్క సర్దుకుంటూ, "ఇక పడుకో తుంగమ్మా. అలసిపోయావ్. దేవుడున్నాడు. నీకేం భయం లేదు. పడుకో" అన్నారు. పడుకున్న అమ్మాయిల్నోసారి చూసిరావటానికి వెళ్ళారు.

తనను నేరస్తురాలిలా చూడలేదామె. క్షమించే ప్రశ్నే రాలేదు.

పైకప్పుకేసి చూస్తూ దీర్ఘంగా నిట్టూర్చింది తుంగమ్మ. బిగుసుకున్న ఒంట్లోని నరాలు సడలినట్లయింది

నీళ్ళగదిలోకి వెళ్లొస్తే బాగుండును —

ఆమె మనసులోని మాట ఊహించినట్టుగా జలజ—

"బయటికెళ్ళాలా తుంగక్కా" అంది.

తుంగక్క! తాను అక్క!

తుంగమ్మ తల ఊపింది.

"దొడ్డమ్మ వస్తారిపుడే తీసుకెడతారు."

దొడ్డమ్మ సంగతి తెలుసుకోవా లనిపించింది తుంగమ్మకు. ఇక్కడ తన బాధ్యత వహించిన దెవరు?

"ఆవిడేనా ఇక్కడంతా చూసుకునేది?"

తన గొంతు విని తనకే ఆశ్చర్య మనిపించింది.

జలజ చిరునవ్వు నవ్వింది.

"ఊఁ....అవిడే. మంచివారు కదూ?"

తనలా అడగటం తప్పనిపించి సిగ్గుపడింది తుంగమ్మ.

రెండు నిమిషాల్లో సరసమ్మ వచ్చారు వస్తూ అన్నారు.

"మరచి వెళ్ళిపోయాను. రా తుంగమ్మా. నీళ్ళగదిలోకి వెళ్ళొద్దుగాని."

* * *

"చిక్....చిక్....చిక్....చిలి....చిలి....చిలి...."

మళ్ళీ మళ్ళీ అదే చప్పుడు.

ఎవరో 'తుంగా, తుంగా' అని పిలుస్తున్నట్లనిపించి తుంగమ్మ మెల్లిగా కళ్ళు తెరిచింది. గదిలోని కిటికీలో నుండి అరుణకాంతి లోపలికి ప్రవేశిస్తూంది. చీకటి గుహ లోపలికి వెళ్ళిన ఆమె మనసు మళ్ళీ బయటికి వచ్చి తన చుట్టూ ఉన్న వాతావరణాన్ని పరికించింది.

కొత్తచోటు....కొత్త వాతావరణం.

ఎవరు తనను పిలిచింది 'తుంగా' అని?

చాలా రోజులక్రితం తల్లి అలా పిలిచేది. కానీ ఆ కంఠం కోమలంగా ఉండేదికాదు. జీవితపు లయకు అనుగుణంగా లేక అది కర్కశంగా ఉండేది....తనను కౌగిలిలో బంధించినపుడు అతను 'తుంగా, తుంగా' అన్నాడు మృదువుగా. ఆ కంఠం ఎంత మధురంగా వినిపించిందపుడు! కానీ ఆ మధురమైన కంఠమే ఆమె బ్రతుకును అపస్వరంగా మార్చింది. ఇప్పుడా జ్ఞాపకమే ఆమె ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకేలా చేస్తోంది.

కానీ ఎవరో పిలిచినట్టనిపించిందే?

రాత్రి తను నిద్రపోవటానికి ముందుగా తన ముంగురులు దిద్దిన ఆ స్త్రీ, ఆ మధ్య వయస్కురాలు....

తుంగమ్మ గదిని పరికించి చూసింది. మంచం ఖాళీగా ఉంది. పడకచుట్ట ఉందక్కడ.

అయితే ఆమె అపుడే లేచేశారన్నమాట.

తన పక్కగా ఉన్న పడకమీద జలజ....తనవేపు మొహంతిప్పి పడుకుంది. కళ్ళు మూసుకుని ఉన్నా పెదవులు అరవిచ్చి నవ్వుతున్నాయి తెల్లవారుఝామున తియ్యటి కల కంటూ వుందేమో! నిద్రపోతూ ఉన్న ఈ పిల్ల తనను పిల్చివుండదు.

మళ్ళీ ఆ ధ్వని.

"చిక్ ... చిక్ ....చిలి చిలి ....చిలి చిలి...."

ఓ! పిచుకమ్మ! కిటికీలో కూరుని పిలుస్తూంది. ఒళ్ళు తిప్పుతూ ఇటునుంచటూ కదులుతూ పిలుస్తూంది

మెడదగ్గర నలుపు రంగు. అది మగ పిచుక. తుంగమ్మకా సంగతి తెలుసు. కానీ ఆ పిచిక పిలుస్తున్న దెవరిని? దాని జంట పిచిక ఏది?

ఇంటికప్పుకు ఉన్న ఒక దూలానికి ఆరడుగుల దూరంలో రెండు మేకులు కొట్టారు తాడు కట్టి చీరె ఆరవేసుకుందుకై వుండచ్చు. అందులో ఒక మేకుమీద కూర్చుంది ఆడపిచుక. దాని మెడమీద నలుపు రంగు లేదు. కానీ లావుగా వుంది.

తుమకూర్లో—అవును—అక్కడ తమ ఇంట్లో పిచుక గూడు కట్టుకోటాన్ని చూసింది తుంగమ్మ. ఆడపిచుక తల్లి కాబోతున్నప్పుడు మగపిచుక చేసే సంరక్షణ గమనించేది.

పిచ్చుక మాతృత్వం!

మనసుకు ప్రియంకాని ఆలోచనను దూరం చేయటానికి తుంగమ్మ మరోవేపుకు తిరిగింది.

మగపిచ్చుక అరుస్తూనే ఉంది

"చిక్ ... చిక్ ....చిలిచిలి....చిలిచిలి ..."

"తుంగా" అని ఎవరూ పిలవలేదు. అలా భ్రమించింది తాను. అంతే.

"భుర్"మన్న చప్పుడు. కిటికీవూచలమీద రెండు పిచికలూ జంటగా కూర్చున్నాయి. ఏం మాట్లాడుకుంటున్నాయో?

"బయట చలి. ఆ పాత కప్పులోనే గడిపాను."

"ఊఁ....ఇక్కడ నేనొక్కతినే...."

"నీకేం....గది వెచ్చగా ఉంది మనుషులూ మంచివాళ్ళే."

"చాలారోజులు ఉండలేను. వాళ్ళు లేచి దీపం వేసినప్పుడల్లా భయమేస్తుంది."

"ఇంకో రెండు రోజులు. అంతే. మన 'ఇల్లు' పూర్తవుతుంది."

"ఊఁ...."

"ఇటుచూడూ!"

"వాళ్ళు లేస్తున్నారు. బయటికి పోదాం!"

పిచికలభాషకు ఇలా అర్థం కల్పించుకుంటూ తుంగమ్మ చిరునవ్వు నవ్వింది కానీ ఆమె మనసు చేదుగా అయింది.

మనసు బాగుండక మళ్ళీ ఇటు తిరిగి పడుకుంది తుంగమ్మ. మళ్ళీ కిటికీవేపు చూపింది. కాని అక్కడ పిచ్చుకలు లేవు. అవి ఎగిరిపోయాయి.

తన కెవరున్నారు? 'తుంగా' అని పిలిచి నిద్రలేపే ప్రియుడు లేడు. ఎగిరిపోవటానికి రెక్కలు లేవు. వెళ్ళినా ఉండటానికి గూడు లేదు. తను నిస్సహాయురాలైన స్త్రీ.

ఆ అభిప్రాయాన్ని వెక్కిరిస్తూ జలజ కంఠం వినిపించింది.

"తుంగక్కా. లేచారా తుంగక్కా!"

ఆలోచనల మరో పేజీ తిరగేసి "ఊఁ...." అంది తుంగమ్మ-తనూ జలజవేపు మొహంతిప్పి.

వెలుగు ప్రసరిస్తూంది. రాత్రి జలజని సరిగ్గా చూడనే లేదు. ఎంత అందంగా ఉంది జలజ! ఏ శిల్పి ఎలాంటి మధుర క్షణంలో ఆమెను మలిచాడో! విల్లులా వంగిన కనుబొమ్మలూ, హరిణ నేత్రాలూ, పొడుగాటి ముక్కు, నిశ్చలంగా వున్న లేత పెదవులు....

"జ్వరం ఎలా ఉంది జలజా?"

"ఇది మరీబాగుంది! మీరెలా ఉన్నారని అడుగుదామంటే నన్నే అడుగుతున్నారే!"

"నాకేమయింది? బాగానే ఉన్నాగా!"

"నాకేమయిందట మరి?"

"జ్వరం."

"నిన్న మీరొచ్చారుగా, పారిపోయింది. చూడండి, పక్కబట్టలన్నీ చెమటతో తడిసిపోయాయి."

"చెమటపడితే మంచిదే."

"ఒళ్ళు నొప్పులుగా ఉంది కదూ మీకు? నిన్నే చెప్పాగా. తలంటి పోస్తాను"

"మీరు లేవకూడదు జలజా. మీ దొడ్డమ్మ కోప్పడతారు."

జలజ ఫక్కుమని నవ్వింది. తమాషా సంగతి విన్న పసిపిల్లలా దుప్పటిలోపల కాళ్ళాడిస్తూ నవ్వింది.

తుంగమ్మ తెల్లబోయింది.

"ఏం, ఎందుకు నవ్వుతున్నారు? మీ దొడ్డమ్మ కోప్పడరూ?"

జలజ ఇంకా గట్టిగా నవ్వసాగింది.

తుంగమ్మ మొహం నల్లబడింది. తనేం తప్పుగా మాట్లాడలేదే!

"ఎందుకు జలజా?"

మాటమాటకూ జలజ నవ్వుతూ చెప్పింది. "అది కాదండీ. ఆమె నా దొడ్డమ్మ అనుకున్నారా? మీకు దొడ్డమ్మ కాదా మరి?"

"అంటే?"

"అయ్యో రామా! ఆవిడ మేట్రనండీ. మేమంతా దొడ్డమ్మ అని పిలుస్తాం...."

"ఓ...."

"భలే తుంగక్క మీరు!...."

"నా కెలా తెలుస్తుందండి?"

"అదీ నిజమే; సావిత్రీ—జలజా-లలితా-సరస్వతీ-తుంగమ్మ-ఎవరైనాసరే—మనందరికీ ఆవిడ దొడ్డమ్మ."

"ఓ.... ఇప్పు డర్థ మయింది."

"అబ్బ! ఇప్పు డర్థమయిందిగా మీకు. ఫరవాలేదు తెలివిగలవారే."

జలజ కంఠంలో మృదుహాస్యం లాస్యం చేసింది. ఒక్కక్షణం తుంగమ్మ మనసుకు చీమ కుట్టినట్లనిపించింది. కాని జలజ నవ్వుతూంది నిర్మలంగా. ఆమె తనను అవమానించాలనుకుంటోందని ఊహించటం అసంభవం.

తుంగమ్మ అలా ఆలోచిస్తోందనికూడా భావించలేదు జలజ. మంచిగా కనిపిస్తున్న ఓ వ్యక్తి తనకు స్నేహితురాలు కాబోతుందన్న సంభ్రమంలోని సుఖాన్ని అనుభవిస్తోందామె.

తుంగమ్మను పూర్తిగా తనదానిని చేసికోవాలన్న ఆశతో జలజ అడిగింది.

"మీ రెంతవరకూ చదువుకున్నారు తుంగక్కా?"

మళ్ళీ నిన్న రాత్రి సంగతులు గుర్తు వచ్చాయి తుంగమ్మకు. నీతియుక్తం కాదని పరిగణించబడిన బ్రతుకులోనుండి పారిపోయివచ్చి కన్నీళ్ళతో ప్రాయశ్చిత్తం అనుభవించాల్సిన ఆశ్రమమా ఇది? ఊహూఁ....నిజంగా ఓ బడిలాగే ఉంది ఈ అభయధామం. తన చదువును గురించి అడుగుతూంది జలజ.

"నాలుగేళ్ళక్రిందటే చదువు మానేశాను జలజా!"

"ఏ క్లాసులో?"

"ఫిఫ్తుఫారంలో. ఆ సంవత్సరం మా అక్కయ్య పెళ్ళి జరిగింది. తరువాత స్కూలు మానేశా."

'అక్కయ్య ...అక్కయ్య పెళ్ళి.' తుంగమ్మకన్నా కాస్త పెద్దగా తుంగమ్మలాగే ఉండే మరో స్త్రీ రూపాన్ని ఊహించుకుంది జలజ వివాహితురాలయిన అక్కయ్య....పిల్లలూ ఉన్నారేమో. కానీ ఈ తుంగమ్మ ఇక్కడ....

అక్కయ్యనుగురించిన జ్ఞాపకాలతో తుంగమ్మమొహం మ్లానమయింది. జలజకూడా ఆ సంగతి గ్రహించింది. అనవసరంగా ఆమెను నొప్పించానే అని బాధపడుతూ కావాలనే మాట మార్చింది.

"నే నెంతదాకా చదువుకున్నానో చెప్పండి చూద్దాం!"

"మీరా?"

"ఊఁ....చెప్పండి చూద్దాం."

తుంగమ్మ లేచి కూర్చుంది. ఆ ప్రశ్నకు సరయిన సమాధానం చెప్పకుండా ఓడిపోవటానికి సిద్ధంగా లేదామె ఆ పిల్ల జలజ....ముగ్ధ మనోహరంగా ఉన్న జలజ....ఏమాత్రం చదివుండచ్చు? స్పష్టమయిన ఉచ్చారణ ...మాటల్లో ఉట్టిపడుతున్న వినయం....సంస్కారం.

"కాలేజీకి వెళ్ళావు కదూ?" అనుమానిస్తూనే అంది తుంగమ్మ. దానికి బదులుగా ఆమెకు దొరికింది—హృదయాన్ని వికసింపజేసే నవ్వు. ఉవ్వెత్తుగా పొంగి పొరలే నవ్వు.

జలజ కాలేజీ చదువులు చదవలేదని అర్థమయింది తుంగమ్మకు.

కానీ దానికి అంతగా నవ్వాలా?

"ఎలిమెంటరీ స్కూలు చదువందీ నాది. అహ్హహ్హహ్హహ్హ...."

జలజ నవ్వు అంటుజాడ్యంలా తుంగమ్మను పట్టుకుంది.

అప్పుడు తలుపు తోసుకుని లోపలికి ప్రవేశించారు దొడ్డమ్మ. ప్రేమగా ఆమెవేపు చూసింది తుంగమ్మ. ఈమె జలజకి మాత్రమే దొడ్డమ్మ కాదు. తనకు కూడా దొడ్డమ్మే

"ఏమిటర్రా గొడవ? ఏమిటి జలజా ఆ నవ్వు? నిజంగా జబ్బు మనిషివేనా నువ్వు?"

జలజ లేచి కూర్చుని నవ్వుతూనే "దొడ్డమ్మా, నేను కాలేజికి వెళ్ళా నంటున్నారు తుంగక్క. ఎలావుంది?" అంది.

"సరి! నీ మాటే చెప్పాలి."

తుంగమ్మ నవ్వు ఆపేసింది.

"జలజ అలాగే వాగుతూ వుంటుంది. మరేమనుకోకు తుంగా!"

"లేదు" అంది తుంగమ్మ.

"నేనూ ఒకప్పుడు అలాగే అనుకున్నా. చదువులో బుద్ధి మంతురాలేమో అనికూడా అనుకున్నా "

"తరువాత చూడబోతే అసలు సంగతి తెలిసిపోయింది కదూ దొడ్డమ్మా!" అలా అడుగుతున్న జలజ కళ్లు కొంటెగా మెరుస్తున్నాయి.

దొడ్డమ్మ నవ్వేసి కబుర్లకి ఫుల్‌స్టాప్ పెట్టారు. ఆవిడ మొహం గంభీరంగా మారిపోయింది. ఇక రోజూవారి కార్యక్రమంలో పడాలి.

ఆరు గంటలకల్లా లేచిన పిల్లలు నిత్యకృత్యాలు పూర్తి జేసుకున్నారు. ఆరున్నరకి సామూహిక ప్రార్థన....

"ఇవాళ నేను లేవనా దొడ్డమ్మా?" వినయంగా అడిగింది జలజ.

దొడ్డమ్మ జలజ నుదిటిని తాకి చూశారు. చెమటతో తడిసిన గుడ్డలను చూశారు.

"వద్దు జలజా. ఇవ్వాళ ఒక్కరోజు లేవొద్దు."

"నేనిలా పడుకుని ఉండలేను దొడ్డమ్మా!"

"జలజా, పట్టుపట్టకు. నాకు కోపం వస్తుంది." చిన్నపిల్లను గారాబం చేస్తున్నట్టు అన్నారు సరసమ్మ.

బయట తగ్గుధ్వనిలో కొన్ని కంఠాలనుండి వెలువడుతున్న ప్రార్థన గట్టిగానే వినిపిస్తోంది.

"రఘుపతి రాఘవ రాజారామ్

.... .... .... .... .... .... ....

ఈశ్వర అల్లా తేరేనామ్...."

"ప్రార్థన జరుగుతూంది" అన్నారు సరసమ్మ.

జలజ మౌనంగా తల వంచుకుంది. తుంగమ్మ గంభీరంగా పాట వింటూంది. సరసమ్మ నిశ్శబ్దంగా బల్లమీదున్న పుస్తకాలను సర్దారు.

ప్రార్థన అయ్యాక బయటనుండి కలవరం వినిపించింది.

"దొడ్డమ్మా, దొడ్డమ్మా" అంటూ ఐదుగురు పిల్లలు గది దగ్గరకి వచ్చారు.

"ఏమిటర్రా అది?"

తుంగమ్మ వెనుకటి రాత్రి చూసిన పిల్ల సరస్వతి అంది-

"ఇవ్వాళ దమయంతి జట్టువారు తుడవరట."

"ఎందుకట?"

"వారిది కాదట ఇవ్వాళ డ్యూటీ."

దమయంతి ఒక్కోసారి కావాలనే అలా చేస్తున్న సంగతి సరసమ్మకు కొత్తకాదు. కారణం అడిగితే దమయంతి ఇచ్చే బదులూ

ఆవిడకు తెలియంది కాదు. అయినా "దమయంతీ" అని కోపంగా పిల్చారు.

దమయంతి కనిపించేలా అమ్మాయిలంతా పక్కకి తప్పుకున్నారు. అక్కడే నుంచుంది పొట్టి దమయంతి....ఆ పిల్ల మొహం కోపంతో ఎర్రబడింది. ముక్కుపుటాలు అదురుతున్నాయి. అవతలి జట్టు అమ్మాయిలతో దెబ్బలాడివచ్చిన ఆమె రొప్పుతూంది.

తుంగమ్మ కుతూహలంతో అంతా గమనిస్తోంది. కాని జలజకు ఇదంతా మామూలే.

"ఆ అమ్మాయే దమయంతి చందనపు బొమ్మ." గొంతు తగ్గించి తుంగమ్మతో అంది జలజ. ఆ మాట విన్న దమయంతి జలజని తినేసేలా చూసింది. బదులుగా నవ్వింది జలజ.

"ఏమిటే నీ గొడవ?" సరసమ్మ అడిగారు.

"చూశారా దొడ్డమ్మా! మళ్ళా హింస పెడుతున్నారు."

"నువ్వెప్పుడూ ఇంతేగా?"

"లేదు దొడ్డమ్మా. ఇవ్వాళ తుడిచే డ్యూటీ మాదని ఎంత చెత్త పోశారో చూడండి."

"కావాలని పోశామా?" గుంపులో ఓ పిల్ల దీర్ఘం తీస్తూ అంది.

రెచ్చిపోయిన దమయంతి క్షణంలో అలా అన్న పిల్లమీద పడింది. కళ్లుమూసి తెరిచేలోగా ఒకరి జుత్తొకరి చేతుల్లో ఉంది. అసభ్యమయిన మాటలు ప్రవాహంలా వాళ్ళనోటినుండి బయటపడ్డాయి.

దమయంతి ఆరోపణ నిజమేనని సరసమ్మకు తెలుసు. కానీ ఈ కలహంతో పరిస్థితి విషమిస్తోంది.

"ఆపు. ఆపు. దమయంతీ, అలమేలూ, ఆగండి."

దొడ్డమ్మ ఆజ్ఞ వాళ్ళిద్దరి చెవుల్లోనూ దూరినట్టు లేదు. సరసమ్మకు కోపం వచ్చింది.

"విడిపించండి. ఇద్దర్నీ పట్టుకోండి." దెబ్బలాట చూస్తూ నుంచున్న అమ్మాయిలు ఆ పని చేశారు

పందానికి వదిలిన కోడిపుంజుల్లాగా బుస కొడుతున్నారు వాళ్ళిద్దరూ.

నొచ్చుకుంది. ధుమధుమలాడుతున్న ఆమె నోటినుండి ఎలాటిమాట బయటపడుతుందో అన్న భయంకూడా వేసింది.

కాని ఆమె మాటవిన్నాక తుంగమ్మ ఆశ్చర్యపడకుండా ఉండ లేకపోయింది. అంత త్వరగా సర్దుకుని వాత్సల్యంతో మాట్లాడటం సంభవమనికూడా తుంగమ్మకు తెలియదు.

"జలజా, మొహం ఎక్కడ కడుక్కుంటావ్? నడవగలవా?"

"ఊఁ. నేనే వెడతాను."

"తుంగని తీసికెడతావా నీతో?"

"ఓ.... ...."

జలజ లేచింది. జ్వరపడి నీరసంగాఉన్న ఆమెదేహం గాలిలో తేలిపోతున్న ట్లనిపించింది జలజ.

తన స్థితికి తనే నవ్వుకుంటూ "రండి తుంగక్కా!" అంది.

తుంగమ్మ, జలజ వెళ్ళిపోయాక, అలమేలు దమయంతుల వేపు తిరిగారు సరసమ్మ.

గదిబయట వెలుగులో తుంగమ్మ అభయ ధామపు భవనాన్ని చూసింది. నలుచదరపు ఆ కట్టడంలోని మధ్యభాగంలో ఖాళీస్థలంలో పూలచెట్లు ఆకాశంవేపు చూసి నవ్వుతున్నాయి. ఆ అమ్మాయిలే నీళ్ళు పోసి పెంచిన పూలవనానికి తులసికోట ముక్కుపుడకలా ఉంది. పూలచెట్లున్నచోటుకు చుట్టూరా అరుగు. అరుగుకు వెనకభాగంలో రెండు వరసలుగా ఎదురెదురుగా గదు లున్నాయి.

ఒక వరుసలోని ఆఖరిది వంటగది. ఇంకోవరస ఆఖర్లో లెట్రిన్-నీళ్ళగది. మూడవభాగం విశాలమయిన చావిడి.

తుంగమ్మతోబాటు జలజ అరుగుపక్కగా నడిచివెళ్ళినపుడు అమ్మాయిల చెత్తఊడ్చే కార్యక్రమం ఆఖరుదశలో ఉంది. కబుర్లు, చిన్నచిన్న దెబ్బలాటలు, నవ్వులు....

వాళ్ళల్లో కొందరు చాలారకాలుగా "జ్వరం తగ్గిందా, జలజా?" అని అడిగారు.

వాళ్ళందరూ తుంగమ్మవేపు ఆసక్తిగా చూశారు. సరస్వతి, సావిత్రి, లలితా చిరునవ్వు నవ్వారు. వాళ్ళకపుడే తుంగమ్మ పరిచితు

రాలు. ఎదురుగా వాళ్ళవేపు చూస్తోంది తుంగమ్మ. కొంతమంది చూపులు నిర్వికారంగా ఉన్నాయి. కొందరు కుతూహలంగా చూస్తు న్నారు. ఎక్కువమంది మౌనంగానే స్వాగతం చెబుతున్నట్లని పించింది తుంగమ్మకు.

అక్కడే ఓ స్తంభాన్ని ఆనుకుని నుంచుంది ఓ పిల్ల. కృశిం చిన వేషం. మొహంనిండా స్ఫోటకపుమచ్చలు. కళ్ళు తిప్పకుండా నుంచుంది. కాని పెదవులమీద అందమైన చిరునవ్వు మెరుస్తూంది.

ఆ అమ్మాయిని సమీపించగానే జలజ మృదుత్వం నిండిన స్వరంతో "మొహం కడుక్కున్నావా సుంద్రా?" అనడిగింది.

"కడుక్కున్నా నక్కా, ఎవరు జలజా! జ్వరం తగ్గిందా?"

"ఓ" అంది జలజ కొంటెగా. "జ్వరాన్ని తరిమేశాలే!"

"మంచిపన్జేశావు. అయితే ఫలారం టైముకి వస్తావా?"

"లేదమ్మా లేదు. ఇంకా ఓ రోజు మందు తీసుకోవాలిట."

జలజ తుంగమ్మవేపు చూపి, తన కళ్ళవేపు చూపించి, ఆపిల్ల గుడ్డిదన్నట్టు సైగజేసింది. తుంగమ్మ అప్పటికే ఆ సంగతి గ్రహిం చింది.

తుంగమ్మ చేతులగాజులు చప్పుడు చేశాయి.

"ఎవరు? ఎవరు నీతో ఉన్నది? పార్వతా?

"కొత్తగా వచ్చారు సుంద్రా! నిన్నవచ్చారు. తుంగమ్మని-"

"ఆఁ....అలాగా?"

గుడ్డిపిల్ల మొహం వికసించి స్ఫోటకపుమచ్చలు మరింత వికా రంగా తయారయ్యాయి. చూడ్డానికి ప్రయత్నిస్తున్నట్లు కనుగ్రుడ్లు చలించాయి. తుంగమ్మ కడుపులో దేవినట్లయింది.

తుంగమ్మను మాట్లాడమని సైగజేసింది జలజ.

ఏం మాట్లాడాలి? "బాగున్నావామ్మా!"

"ఎవరు! ఎవరు మాట్లాడింది? ఆమేనా?"

"అవును సుంద్రా! తుంగక్క అడుగుతున్నారు బాగున్నా వావి."

"ఇలా వున్నానక్కా!"

బదులు చెప్పిన ఆ కంఠంలో ఆ్రతుత ఉంది. కొత్తమనిషితో పరిచయం చేసుకున్న సంతోషముంది. ఆ కళ్ళల్లో నీరు తిరగటం చూపింది తుంగమ్మ ఆ అభాగ్యురాలిని చూస్తూ నుంచోటం బాధ కలిగిస్తూంది తుంగమ్మకు.

జలజ ఆ సంగతి గ్రహించి "నీళ్ళగదికి వెడుతున్నాం సుంద్రా!"

"వెళ్ళండక్కా.....తరువాత సాయంకాలం వస్తావా?"

"వస్తాను."

"ఆ మెనూ తీసుకురా!"

"అలాగే."

నీళ్ళగది అక్కడే ఉంది. అయినా వాళ్ళని ఏ దూర దేశానికో పంపుతున్నట్టు చెయ్యి ఊపింది గుడ్డిపిల్ల.

నీళ్ళగదిలో జలజ కుళాయి తిప్పినప్పుడు తుంగమ్మ అంది-

"పాపం, ఎంత కష్టంగా ఉందో ఆ పిల్లకు! ఎన్నేళ్ళుగా ఇలా?"

కుళాయిలో పడుతున్న నీళ్ళచప్పుడును అధిగమించే కంఠంతో జలజ అంది.

"పుట్టు గుడ్డిట. పదేళ్ళప్పుడు స్ఫోటకం వచ్చిందట. ఇక్కడికి వచ్చి ఓ రెండేళ్ళయింది."

"తనే వచ్చిందా?" అంది తుంగమ్మ, తను రావటం తలుచుకుంటూ.

"పోలీసువాళ్ళు అడిగారు-బస్సుస్టాండ్ దగ్గిర ఓ గుడ్డిపిల్లుంది, తీసుకుంటారా అని. దొడ్డమ్మ సరే అన్నారు."

"పాపం! కడుపు తరుక్కుపోతుం దా పిల్లను చూస్తే."

అలా అంటున్న తుంగమ్మకు ఆ క్షణంలో తన పరిస్థితిని గురించిన ఆలోచన రాలేదు.

"ఆమె కెన్నేళ్ళుంటాయి చెప్పండి?"

"చిన్న పిల్ల కదూ?"

"చిన్నపిల్లా! తనకేమో గుర్తులేదుట–పదిహేడో పద్దెనిమిదో

ఉంటాయంటారు దొడ్డమ్మ. పుస్తకంలో పదిహేడు అని రాశారు."

పుస్తకంలో రాయటం....తన పేరింకా రాసుకోలేదని మరో మారు గుర్తొచ్చింది తుంగమ్మకు. తన పూర్వకథని అడుగుతారన్న ఆలోచనతో ఆమె మొహం నల్లబడింది.

అక్కడే ఉన్న పళ్ళపొడిని తుంగమ్మ అరచేతిలో వేస్తూ జలజ అడిగింది-

"నీ కెన్నేళ్ళక్కా?"

"పద్దెనిమిది దాటింది."

"నేనూ అలాగే అనుకున్నా. నా కన్నా కొంచెం పెద్ద మీరు."

జలజ మాటలకు తుంగమ్మ నవ్వుతుంటూ పళ్లు తోముకో సాగింది. వయసునిగురించి అడిగిన జలజ మరేమి ప్రశ్న వేస్తుందో అన్న శంకతో ఆమె మనసు కలవరపడింది.

కాని జలజ మళ్ళీ మాట్లాడకుండా పళ్లు తోముకోవటం ప్రారంభించింది. మొహం కడుక్కుని లేచి నుంచుని "ఉస్" అంటూ ఒళ్ళు విరుచుకుంది. "నీరసంగా ఉంది" అంది.

తుంగమ్మకూ అలసటగానే ఉంది. వొళ్ళంతా నొప్పిగా వుంది. అడుగడుక్కీ 'నువ్వు వట్టిమనిషివి కాదు' అని దేహం గుర్తుచేస్తూనే ఉంది. కానీ తుంగమ్మ పైకి ఏమీ అనలేదు.

మొహం కడుక్కుని కొంగుతో తుడుచుకుంటూ-

"లెట్రిన్ ఎక్కడ?" అంది.

"శుద్ధ మొద్దుని నేను. ముందే అడగాల్సింది కదూ? రండి, చూపిస్తాను...."

తుంగమ్మ-జలజ మళ్ళీ ఆఫీసుగదిలోకి వచ్చేసరికి దమయంతి, అలమేలు ఇద్దరూ ఏడుస్తూ కూర్చుని ఉండటం కనపించింది. సరసమ్మ వాళ్ళకు గట్టిగా బుద్ధిచెప్పి అప్పుడే మౌనం వహించినట్టున్నారు.

ఉదయం ఫలహారపువేళ. తుంగమ్మ - జలజలకుమాత్రం టిఫిన్ తెప్పించి ఆ పిల్లలిద్దర్నీ అలాగే వదిలేయటం కుదరదు కనుక సరసమ్మ మరో నిర్ధారణకు వచ్చారు.

"ఈసారికి క్షమించాము మిమ్మల్ని."

ఇద్దరూ బదులు చెప్పలేదు. ఏడుస్తూనే ఉన్నారు.

"ఇంకోసారి ఇలా జరిగిందంటేమాత్రం ఊరుకోను. జాగ్రత్త!"

ఇంకా అలాగే కూర్చున్నారు ఇద్దరూ.

"ఇక వెళ్ళండి."

ఆ మాట వినగానే వాళ్ళిద్దరూ లేచి బయటికి వెళ్ళారు. వాళ్ళ వెనుక సరసమ్మకూడా బయటికి రాబోతుండగా తుంగమ్మ - జలజ లోపలికి వచ్చారు. సరసమ్మ వాళ్ళవేపుచూసి నవ్వి వెళ్ళిపోయారు.

"చూశారా అక్కా. ఇవ్వాళ మనవల్ల వాళ్ళిద్దరూ తప్పించు కున్నారు."

"అంటే?"

"మరి వాళ్ళిద్దర్నీ ఇక్కడ అట్టిపెడితే మనకు టిఫిన్ ఎలా ఇచ్చేది? అందుకని వాళ్ళని క్షమించి వదిలేశారు."

"అలాగా!"

"కాకపోతే దొడ్డమ్మ అంత సులువుగా వదిలిపెడ్తారను కున్నారా?"

పోనీ, తమవల్ల వాళ్ళకి శిక్ష తగ్గింది కదా అని సంతోషించింది తుంగమ్మ.

తరువాత కాసేపట్లో "కికి వికి కికి" అంటూ ఓ అమ్మాయి రెండు పళ్ళాలు పట్టుకొచ్చింది. ఒకదాంట్లో బ్రెడ్డు. రెండోదాంట్లో ఉప్మా ఉన్నాయి. వాటిని తుంగమ్మ, జలజలముందు పెట్టి. మరోసారి 'కికి వికి కికి' అని, పళ్ళికిలిస్తూ వెళ్ళిపోయిందా పిల్ల.

"మూగది" అంది జలజ.

తుంగమ్మ ఊహించింది.

కాని ఆ పిల్ల మొహం ఎంత ముగ్ధంగా ఉంది!

"పధ్నాలుగేళ్ళట. ఇక్కడికివచ్చి ఎనిమిది నెలలయింది."

మాటవచ్చుంటే ఏ సుందరాంగుని రాణి అయ్యేదో కదా!

మూగపిల్ల మళ్ళీవచ్చింది. ఆమెచేతిలో రెండు గ్లాసులున్నాయి. ఓదాంట్లో పాలు, మరోదాంట్లో కాఫీ. పాలగ్లాసు జలజ ముందు పెట్టి.

తుంగమ్మ వేపు చూసి 'దాన్ని ముట్టుకోకు. పీక్కాదు' అన్నట్టు సైగ జేసింది. కాఫీగ్లాసు తుంగమ్మచేతికిచ్చి నవ్వింది ఆ పిల్ల చూపులు తుంగమ్మ కడుపువేపు మళ్ళాయి. సిగ్గుతో మొహం ఎర్రబడింది.

"హూయ్—హూయ్" అంటూ కిటికీనుండి బయటికిచూస్తూ ఏదో సైగజేస్తోంది.

"నువ్వు కాఫీ, టిఫిన్ తీసుకున్నావా?" అని చేత్తో సైగ జేస్తూ అడిగింది జలజ.

"ఇంకా తీసుకోలేదు." అన్నట్టు ఆ పిల్ల సైగచేసింది.

"అయితే వెళ్లు" అంది జలజ మళ్ళీ సైగతోనే.

ఆ పిల్ల మళ్లీ 'కికి వికి' చప్పుడు చేసింది. తుంగమ్మ వేపుచూసి నవ్వింది. "హీ" అంది. వయ్యారంగా జడను మెడకు చుట్టుకుంటూ వెళ్లిపోయింది.

ఎంతమంది ఎన్నికష్టాలు అనుభవిస్తున్నారు అన్న ఆలోచనతో తుంగమ్మ హృదయం బరువెక్కింది. ఉప్మా గొంతులోకి దిగటంలేదు. మెల్లిమెల్లిగా కాఫీ గొంతులోకి పోసుకుంటూ ఉప్మా-కాఫీ పూర్తి చేసింది. ప్రపంచంలో కష్టం అనుభవించుతున్నది తనొక్కతే కాదు అన్న భావన ఆమె దుఃఖభారాన్ని కాస్త తేలికపరుస్తోంది.

* * *

స్నానం చేసివచ్చింది తుంగమ్మ.

ఆలోచనలతోనే ఉదయం పదిగంటలయింది.

టర్....టర్....మని తలుపు చప్పుడయింది.

"టీచర్ వచ్చారు" అంది జలజ.

"టీచర్?"

"ఊఁ....పాఠాలు చెబుతారు."

"ఓ...."

సరసమ్మ తలుపు దగ్గరికి వెళ్లి, నడుమున వున్న తాళంచేతుల గుత్తి తీసి, తాళం తీయటాన్ని తుంగమ్మ కుతూహలంతో గమనిస్తోంది.

"జైలులా ఉందికదూ?" అంటూ నవ్వింది జలజ.

''రోజంతా తలుపులు మూసేవుంటారా ?''

''ఆఁ....''

''ఎందుకూ ?''

''భలేవారే, మేము పారిపోతే ఎలా ?''

కన్నీళ్లతో కాపురంచేసే అభాగ్యురాళ్లే అందరూ. పరస్పరం సానుభూతితో వుంటున్న వాతావరణం అనుకుంటే అందులో కాస్త సుఖముంటుంది. కాని పారిపోదల్చుకున్నవారిని నాలుగుగోడలమధ్యా బంధించివుంచే దృశ్యం హృదయాన్ని కదిల్చి బరువెక్కేలా చేస్తోంది.

ఆలోచిస్తూనే తలుపువేపు చూస్తూంది తుంగమ్మ. ఆ అభాగినులకు పాఠంచెప్పే అధ్యాపకురాలు లోపలికి అడుగుపెట్టింది.

సుమారు ముప్ఫయిఏళ్లు ఉంటాయామెకు. ఆధునికమైన అలంకరణతో, ఉన్నఅందాన్ని ఎక్కువ చేసుకోవాలన్న ఉద్దేశం కనిపిస్తూంది.

ఆమె రాసుకున్న సెంటు తన పరిమళాన్ని చుట్టూ వ్యాపింపజేస్తూ ఉండగా ఆఫీసు గదిలో అడుగు పెట్టింది. జలజ ''నమస్తే టీచర్'' అంది.

''లేచేశావా ? గుడ్....''

చూడ్డానికి అందంగాఉన్న ఆమె కంఠం ఇంపుగా లేదు. ఆమె దృష్టి తుంగమ్మవేపు ప్రసరించింది. సరసమ్మ "ఈమె తుంగమ్మ. నిన్న రాత్రి కొత్తగా చేరారు'' అన్నారు.

తుంగమ్మ సంకోచంతో ఆమెకు నమస్కరించింది. ''నమస్తే'' అంది ఆమె చిరునవ్వు నవ్వుతూ. ఆ చిరునవ్వులో తన గొప్పతనాన్ని చాటుకునే గాంభీర్యం ఉంది.

ఆమెను చూసి తుంగమ్మ మనసు తనకు తెలియకుండానే ముడుచుకుంది. సరసమ్మా, అధ్యాపకురాలు బయటకు వెళ్లగానే జలజ తుంగమ్మవేపు చూసింది. ''అడుగు ఇక'' అన్నట్టుంది ఆ చూపు. కాని తుంగమ్మ మాట్లాడలేదు. ఆ మౌనాన్ని భరించలేక జలజ తనే అడిగింది-

"ఎలా ఉన్నారు మా టీచర్ ?''

''బాగున్నారు''

"చూడ్డానికి కదూ?"

"ఆఁ...."

"కానీ భలే గొప్పలు పోతార్లే- తనకే టిన్, ఫిన్ అని రెం(
ఇంగ్లీషుముక్క లొస్తాయని."

తుంగమ్మ నవ్వుకుంది. ఆమె అంటే తనకే కాదన్నమా(
పరిపడనిది.

"నాకూ అలాగే అనిపించింది."

"ఎవరికైనా అనిపిస్తుంది."

"ఆమెకెంత జీతం?"

"డెబ్బయి యిస్తారు నెలకు."

"దొడ్డమ్మకన్నా తనే ఎక్కువన్నట్టు ఉంటారుకదూ?"

"ఆ....ఇంతకుముందు ఇంకో ఆమె ఉండేవారు. భలే మం(
ఆమె. ఇంకెక్కడో ఉద్యోగం దొరికిందని వెళ్లిపోయారు తరువాత
కమిటీవాళ్లని మంచిచేసుకుని ఈ మహాతల్లి వచ్చారు."

"కమిటీవారా?"

"ఆఁ. అభయ ధామాన్ని చూసుకునే కమిటీ లేదూ?"

"ఓ....వాళ్ళా? అయితే దొడ్డమ్మక్కూడా జీతం ఇస్తారా?"

"చూశారా, ఎంత తొందరగా అర్థం చేసుకున్నారో మీరు.
మాలోనే కొంతమంది ఉన్నారు. వాళ్లకెంత చెప్పినా అర్థమయి
చావదు. మమ్మల్నందర్నీ ఇక్కడ పెట్టుకోవటంలో ఏదో మోస
ముందని వాళ్ల ఉద్దేశం. దొడ్డమ్మ దీనివల్ల లాభం సంపాదిస్తారని ..."

ఆ మాట తుంగమ్మకు నచ్చలేదు. తమలో కొందర్ని దూషిం
చటం సరికాదు. కానీ అది దూషణ కాదేమో! ఉన్నమాట చెబుతూంది.
జలజ అబద్ధాలు చెప్పదు.

జలజ మాటలు నిజం కనుకనే తుంగమ్మ మొహం నల్లబడింది.
మళ్లీ అసమాధానపు లోతుల్లో మనసు సంచరిస్తూంది.

కానీ కరుణామయురాలైన దొడ్డమ్మ పలుకులూ, స్నేహమయి
జలజ కబుర్లు, తుంగమ్మను ఓదారుస్తూ పైకి లేవనెత్తుతున్నాయి.
మళ్లీ మౌనాన్ని భంగంచేస్తూ జలజే మాట్లాడింది-

"తుంగక్కా, మీకు కథలంటే ఇష్టమేనా?"

"ఇష్టమే. ఏం?"

"ఎలాంటి కథలు?"

"అంటే...."

"రాజకుమారుడు, రాజకుమారి కథ నచ్చుతుందా?"

తుంగమ్మ నవ్వింది. జలజ నొచ్చుకుంది ఆ నవ్వుచూసి.

"పోన్లెండి. మీరు చదివారో లేదో. 'చందమామ' అని ఓ పుస్తకం వస్తుంది నెలనెలా, చూశారా?"

"చూశాను."

"బాగుంటుంది కదూ? బొమ్మలుకూడా బావుంటాయి."

పద్దెనిమిదేళ్ళపిల్ల జలజ. పసిపిల్లలాగా చందమామ చదువు తుంది. మావళ్లి ఇంట్లో ఉండగా, అంతకు మునుపు తుమకూర్లో తుంగమ్మకూడా చందమామ చూసింది. చిన్నపిల్లలతోబాటు పెద్ద వాళ్ళు దాన్ని చదవటం చూసింది.

"నా తమ్ముడు తెచ్చేవాడు." తనకు తెలియకుండానే అంది తుంగమ్మ.

"తమ్ముడా?...."

"ఊఁ... చిన్నవాడు మా ఊళ్ళో ఉన్నాడు."

జలజ హఠాత్తుగా మౌనం వహించింది. పలురకాల ఆలోచ నలు ఆమె మనసులో తలెత్తాయి. తుంగమ్మ పెద్ద సంసారంలోనుండి వచ్చింది. ఆమెకు తమ్ముడూ ఉన్నాడు తనకో?....

ఆలోచనలే ధ్వనిగా బయటికి వచ్చినట్టు-

"నా కెవరూ లేరు" అంది జలజ.

—నెమ్మదిగా, క్షీణమైనకంఠంతో దుఃఖపు తెరలాగా బయటికి వచ్చిం దామాట. తుంగమ్మకు చుట్టాలున్నారు. కాని ఎవరుండి ఏం లాభం? ఇప్పుడు తనకూ, జలజకూ ఇద్దరకూ ఆశ్రయమిచ్చింది అభయ ధామమే కదా!

కాని, ఏది ఏమైనా తనను ఒంటరిగా భావించుకొని బాధపడు తున్న జలజని ఓదార్చాలనిపించింది.

"మీ అమ్మకు నువ్వొకతే కూతురివా?"

"నాకు తెలియదక్కా. అమ్మనెక్కడ చూశాను నేను?"

"నీ చిన్నతనంలోనే చనిపోయారా?"

"ఆ సంగతి నాకేం తెలుసు తుంగక్కా?"

తుంగమ్మ గొంతు పెగల్లేదు. ఏం మాట్లాడాలో తోచలేదు.

జలజ తనే గోటితో నేలమీద గీతలు గీస్తూ ఒక్కొక్కటిగా కొన్ని విషయాలు చెప్పింది.

అతి బీదవాళ్లైన తల్లి-తండ్రులు తమ ఐదుగురు బిడ్డలతో బాటు వలసపోతున్నారుట. జలజ అప్పుడు నాలుగేళ్ళ పాపట. ముద్దులు మూటకట్టే ఆ పిల్లనుచూసి పిల్లలు లేని ధనవంతుల గృహిణి ప్రతిమాలి ఆ పాపని పెంచుకోడానికి తీసుకుందట. ఇంట్లో పనిమనిషి ఆ పిల్లని పెంచుతూంది. ఆ ధనవంతులు పెట్టినపేరే జలజ. తరువాత రెండేళ్ళలో ఆ గృహిణికి ఆడపిల్ల కలిగిందట. ఇంకేముంది? కొత్త బొమ్మకు స్వాగతం చెప్పేసందర్భంలో పాతబొమ్మ మూలబడింది. పెద్దింటి ఆవరణలో పనివాళ్ళమధ్య పెరిగింది జలజ. ఇంటివారమ్మాయికి తోడుగా రెండురోజులు బడికికూడా వెళ్ళింది. పనిపిల్లయింది. అది బ్రతుకుకాదు. చావులాటిది.... ఆ బాధని భరించలేక చీరె కట్టుకునే ఈడు వచ్చేసరికి ఇల్లువదిలి పారిపోయింది. బయట దెయ్యాలు ఆమె కోసం కాచుకున్నాయి. ఎవరో మంచివారు రక్షించి అభయధామానికి అప్పచెప్పారు.

"ఐదుగురుట మేము నాకన్నా చిన్నది చంటిపిల్లట. మిగతా ఐదుగురిలో అన్నలెంతమందో, అక్కలెంతమందో! అమ్మా- నాన్నా చూడ్డానికి ఎలా ఉండేవారో ...ఇదంతా నాకు చెప్పింది నన్ను పెంచి పెద్దజేసిన పనిమనిషి. నాకు ఐదేళ్ళొచ్చేసరికి అదీ చచ్చిపోయింది. తను బ్రతికుంటే బహుశః నేను ఇక్కడికి వచ్చేదాన్ని కాదేమో...."

జలజ అదంతా చెప్పి దీర్ఘంగా నిట్టూర్చింది.

"పోన్లెండి. ఏదోగొడవ. చెప్పేశాను" అంది.

అలా కాదని చెప్పాలనీ, ఓదార్చాలనీ ఏదేదో అనిపించింది తుంగమ్మకు. కాని నోటినుండి ఒక్కమాటకూడా బయటికి రాలేదు.

రెండు నిమిషాల్లోనే జలజ దుఃఖపు మబ్బుని తరిమివేసినట్టు చిరునవ్వు నవ్వింది.

"మీకో తమాషా తెలుసా తుంగక్కా ?"

"ఏమిటమ్మా ?"

"నేను చందమామలో కథలు చదివి, మిగతా పిల్లలకు రాజకుమారి-రాజకుమారులకథలు చెబుతూ ఉంటానా - దొడ్డమ్మ నన్ను హాస్యంచేస్తూ 'రాజకుమారి' అంటారు."

"ఆమె చాలా మంచివారు."

"ఆవిడేమంటారో తెలుసా ? నిజ జీవితాలకన్నా స్వారస్యమయిన కథలేదుట. మనమిప్పుడు, మీతో కలిపి, ముప్ఫయి ఒక్క మంది ఉన్నామా - మన ఒక్కొక్కరి జీవితమూ ఒక్కో మంచికథ అవుతుందని అంటారు."

ఆ మాట నిజమే అనిపించింది తుంగమ్మకు. ఉదాహరణకు తన కథే తీసుకుంటే, జరిగిందంతా రాస్తే ఓ మంచి నవల కాదూ ?

"దొడ్డమ్మకు అన్నీ తెలుసు జలజా !"

"కాని రాకుమారుడు-రాకుమారి లేకుండా కథెలా నడుస్తుంది తుంగక్కా ?"

వయసులో జలజకన్నా కాస్త పెద్దదయినా, తాను నిజంగానే జలజకు పెద్దక్క అన్న భావంతో తుంగమ్మ నవ్వుతూ ప్రేమగా జలజ ముగ్ధమైన ముఖాన్ని తదేకంగా చూడసాగింది.

మౌనానికీ జలజకూ బద్ధ ద్వేషం అయ్యుండాలి. మళ్ళీ జలజే మాట్లాడింది -

"నిన్నరాత్రి మీ పేరేమిటని అడిగాను "

"అవును."

"మీరు తుంగమ్మ అన్నారు."

జలజ ఏం చెబుతుందో అర్థంకాలేదు తుంగమ్మకు. జలజ అదేమీ గమనించకుండా చెప్పుకుపోతూంది-

"మీరు తుంగమ్మ అన్నప్పుడు నాకెంత నిరాశ కలిగిందో తెలుసా ?"

తుంగమ్మ ఆశ్చర్యానికి అంతులేదు. ఏమిటీ ధోరణి అను కుంది.

"ఎందుకమ్మా?"

"మీ పేరు ప్రేమలతో, పుష్పాలతో అయ్యుంటుం దను కున్నా."

"ఆహాఁ...."

"ఆ పేరు బాగుండదూ?"

"మొత్తంమీద తుంగమ్మ అన్న పేరు లాభం లేదంటావ్- అంతేనా?"

"అలాకాదు, తుంగక్కా - మీ పేరు బాగానే ఉంది. కాని ప్రేమలతో, పుష్పలతో అయ్యుంటే...."

"ఏమయేది?"

"ఓ రాజకుమారుడు, రాజకుమారిని ప్రేమిస్తాడు. ప్రేమిం చాక వదిలేయటం, రాజకుమారి కడుపుతో ఉండి నానాబాధలూ పడుతూ అభయ ధామానికి రావటం....అలా వచ్చినమ్మాయి పేరు ప్రేమలతో, పుష్పలతో అయ్యుంటే ఎలా ఉంటుంది?"

"ఛ...ఛ...." తుంగమ్మ మొహం ఎర్రబడింది.

"మిమ్మల్ని చూడగానే మీరు రాజకుమారి కాదని తెలుసుకున్నా ననుకోండి. రాజకుమారయితే ఇలాటి చీరె కట్టుకుంటుందాని."

"పోమ్మా, నువ్వో పిచ్చిపిల్లవి."

ఆ మాట విని జలజ తెరచిన నోరు అలాగే ఉండిపోయింది. తడిగా ఉన్న కళ్ళు మెరిశాయి.

"ఏది, ఇంకోసారి అనండి ఆ మాట."

"ఏమిటి?"

"అదే, ఇప్పుడన్నారే..."

"అలా అనటం తప్పే జలజా, మరేం అనుకోకు."

"అయ్యో! అక్కా, నువ్వు—నువ్వు అనండి నన్ను. ఛ! మీకేం అర్థంకాదు."

తుంగమ్మకు అప్పటికి అర్థమయింది. మాటల్లో పడి తుంగమ్మ

జలజను చనువుగా 'నువ్వు' అనేసింది. అదే జలజ ఆనందానికి కారణం.

తుంగమ్మ జలజ దగ్గరగావెళ్ళి భుజంమీద చెయ్యివేసి—

"నువ్వా అంతే జలజా! అక్క అయితే ఏక వచనంలోనే పలకరించాలి. ఏం?" అంది.

"మా మంచి అక్కయ్య"

ఆ రెండు జీవాలను ఒకటిగా కలిపిన మధురమయిన స్నేహ బంధం అది. దానికన్న విలువయినది వేరొకటి లేదేమో అనిపించింది తుంగమ్మకు.

మరోసారి మౌనం తనే గెల్చానని చాటింది. అమృతాన్ని నింపుకున్న జలజ హృదయం తొణకలేదు.

చాలాసేపయ్యాక సరసమ్మ వచ్చారు. రాగానే ఏదో రాసుకుంటూ కూర్చున్నారు.

పాఠం పూర్తిచేసుకుని మాస్టారమ్మ లోపలికి రాగానే-

"వెడుతున్నారా రాజమ్మా!" అన్నారు.

"అవునండి" అన్నారేగాని ఆవిడ వెళ్ళేలా కనిపించలేదు. ఆమె చూపులన్నీ తుంగమ్మమీదే ఉన్నాయి.

"ఆ అమ్మాయి హిస్టరీ షీట్ రాసుకున్నారా?"

ఏదో ఆపద వచ్చిందని ఖంగారుపడింది తుంగమ్మ. కాని అలాటి సంభాషణ తనకిష్టంలేనట్టు సరసమ్మ మొహంలో కనిపిస్తూనే ఉంది.

"ఇంకాలేదు....నిన్న రాత్రేగా ఆ పిల్ల వచ్చింది!" బదులు చెప్పిన సరసమ్మ కంఠస్వరంలో కాస్త కాఠిన్యం కనిపించింది. నిన్న రాత్రి తుంగమ్మ వచ్చినపుడు ఏ పరిస్థితిలో వుంది? అపుడు వివరాలు అడిగి రాసుకోవటం సంభవమా? ఆమాత్రం తెలుసుకోలేరా? అనుకున్నారు మనసులోనే. చిరునవ్వు నవ్వటానికి ప్రయత్నిస్తూ-

"వచ్చినవారికి కాస్త విశ్రాంతి నిద్దామని ఆగాను."

"అలాగా! ఇక వస్తాను."

సరసమ్మ రాస్తున్నపని ఆపుజేసి వెళ్లి ఆమెని పంపించివచ్చారు.

మళ్లీవచ్చి రాసుకుంటూనే అడిగారు-

"అందర్నీ పరిచయం చేసుకున్నావా తుంగా?"

"ఊఁ....దొడ్డమ్మా!"

జలజ కిలకిలా నవ్వింది. ఆమె తెల్లని పలువరస ముత్యాల్లా మెరిసింది.

"అంతా వుట్టిదే దొడ్డమ్మా! జలజ పరిచయం అయితే అందరి పరిచయం ఐనట్లే అనుకుంటూంది తుంగక్క."

ఆ మాటల్లోని ఆత్మీయత, చనువూ కలిసిన కంఠంవిని ఆమెకు తృప్తి కలిగింది.

"పోనీ, మీ యిద్దరికీ బాగా స్నేహం కలిసిందిగా-చాలు" అన్నారు. తరువాత ఒంటిగంటకు భోజనపు బెల్లు మ్రోగింది.

"మే మెక్కడ కూర్చోవాలి దొడ్డమ్మా?" అంది జలజ.

"నువ్విక్కడే ఉండు, తుంగ కావాలంటే........"

"ఊహుఁ....దొడ్డమ్మా! నేను ఇక్కడే ఉండాలంటే తుంగక్కా ఇక్కడే ఇవాల్టికి...."

"సరే తల్లీ...."

సరసమ్మ భోజనాల సంగతి చూడ్డానికి వెళ్ళారు బయటకు. వరండాలో తమ తమ కంచాలముందు వరుసగా కూర్చున్నారు ఆకలితో ఉన్న పిల్లలు. వడ్డనదాకా ఏవో గొడవలు, మాటలు. తరువాత మౌనంగా భోజనాలు....మూగపిల్ల జలజకోసం ఓ కంచంలో పాలు, అన్నం పెట్టింది. వడ్డించిన మరో కంచం, గ్లాసులో నీళ్ళూ తుంగమ్మ కోసం తెచ్చింది.

కొత్తవ్యక్తికి అలా వడ్డించటానికి తనకెంతో ఆనందంగా ఉందని సైగజేస్తూ తెలియజేసిం దా పిల్ల. 'హుం-హీ-కికి-వికి' ధ్వని గదినంతా ఆక్రమించుకుంది. తుంగమ్మకోసం తెచ్చిన కంచంలో ఓ వేపు సొట్టపడింది. ఆ భాగాన్ని చూపిస్తూ నవ్వింది.

తుంగమ్మ కేం అర్థం కాలేదు.

"జలజా, తనే మంటోంది?" అనడిగింది.

మూగపిల్ల ధ్వని చేస్తూ "జలజా! నీకు తెలియదూ? తుంగమ్మకేం తెలియదుట. కాస్త చెబుదూ" అన్నట్టు అభినయించింది.

జలజకు సంగతేమిటో అర్థమయింది. మొహం నవ్వుతో దీప్తం అయింది. కాని మాట్లాడలేదు.

"ఏంట్రా అది?" తుంగమ్మ మళ్ళీ అడిగింది.

"చెప్పేయ్" అన్నట్టు సైగ జేసింది మూగపిల్ల.

"నువ్వెళ్ళి భోంచెయ్. తరువాత చెప్తాగా. భోజనం అయ్యాక చెప్తాను" అని జలజ నమ్మకంగా చెప్పగానే మూగపిల్ల అక్కణ్ణించి కదల్లేదు.

జలజ మాట్లాడకపోవటం చూసి తుంగమ్మ అడిగింది.

"ఏమిటి తనన్నది?"

జలజ నవ్వింది.

"చెప్పి తీరాలా? అదో పెద్ద కథ మరి."

"రాజకుమారి - రాజకుమారుడు కథా?"

తుంగమ్మ మాటలకన్న తను చెప్పాల్సిన విషయాన్ని తలచుకుని జలజ తెరలు తెరలుగా నవ్వసాగింది. ఆ నవ్వులో అన్నం తింటున్నానన్న సంగతే మర్చిపోయిందేమో, కొరపోయి నానా అవస్థా పడాల్సిన పరిస్థితి ఏర్పడింది. తుంగమ్మ జలజ నెత్తిమీద నీళ్ళు తట్టి కాస్త స్థిమిత పడేలా జేసింది.

ఆ తరువాత కూడా జలజ చిన్నగా నవ్వుకుంటూనే వుంది.

తుంగమ్మకు ఒళ్లు మండింది.

"పోన్లే, చెప్పకపోతే మానెయ్. నవ్వకు మరి."

"కోపం తెచ్చుకోకక్కా!" అంది జలజ, తుంగమ్మ వేపోసారి పరీక్షగా చూసి, "ఇవ్వాళ చెప్పను. మరో రోజు చెబుతాను. ఇవ్వాళమాత్రం వద్దక్కా!" అంది బ్రతిమాలుకుంటున్నట్టు.

ఆ కంఠంలోని నిశ్చయాన్ని గమనించి తుంగమ్మ మరి అడగలేదు. సరసమ్మ అటు వస్తూ తుంగమ్మను చూసి అడిగారు.

"వంట బాగుందా తుంగా?"

భోంచేస్తున్న తుంగమ్మ ఆ సంగతి గమనించనే లేదు. కాని ఎలా చెబుతుంది?

"బాగుంది దొడ్డమ్మా!"

తుంగమ్మ మాటను ఆమోదిస్తూ సరసమ్మ—

"మన పిల్లలదే వంట. రోజుకు ముగ్గురి చొప్పున జట్లు ఏర్పరచాం."

"ఊఁ ..."

తుంగమ్మ అన్న 'ఊఁ....' అన్న పదానికి ప్రత్యేకంగా ఏ అర్థమూ లేదు. కాని వంట "ఎవరు చేశారు, ఏ కులంవాళ్లు" అన్న ఆలోచనే రాలేదామెకు.

తనలో వచ్చిన మార్పుకు తుంగమ్మకే ఆశ్చర్యం వేసింది.

అందరి భోజనాలూ అయ్యాక సరసమ్మ భోజనం.

తరువాత అదంతా శుభ్రపరచటం....విరామం.

జలజా, తుంగమ్మా కాసేపు పడుకున్నారు.

తుంగమ్మకు నిద్ర రాలేదు. ఆమె లేచి అక్కడే వున్న బీరువాలోనుంచి చేతికి దొరికిన కన్నడ పుస్తకం తీసుకుంది.

జలజ, "అక్కా! నేను నిద్రపోతాను. ఆ కథంతా చదివేసి నాకు చెప్పాలి. ఏం?" అంది.

"అలాగే"

తుంగమ్మ మాటిచ్చాక జలజకు నిద్రపట్టటానికి ఎక్కువసేపు పట్టలేదు.

కానీ ఆ పుస్తకం చదవలేదు తుంగమ్మ.

దొడ్డమ్మ కుర్చీలో కూర్చుని, ఆ పెద్ద పుస్తకాన్ని మేజాబల్ల మీద సర్దుకుని, తుంగమ్మను దగ్గరకు రమ్మన్నారు.

"అలా మంచంమీద కూర్చో తుంగా!"

ఆమె కూర్చున్నాక అడిగారు—

"నీ హిస్టరీ షీటు రాద్దామా తుంగా?"

"అంటే ఏమిటి దొడ్డమ్మా?"

"ఇప్పటిదాకా జరిగిన నీ జీవితపు సంగతులు—సూక్ష్మ పరిచయం."

"అలాగే దొడ్డమ్మా"

* * *

"నేను దౌర్భాగ్యురాలిని దొడ్డమ్మా, ఏమని చెప్పను?"

"ఈ ప్రపంచంలో అందరూ భాగ్యవంతులు ఎలా అవుతారు తుంగా?"

"నేను తప్పు చేశాను దొడ్డమ్మా?"

"అమ్మాయ్, తప్పు చెయ్యనివారిని ఎవరినైనా చూపించ గలవా?"

"...................."

"నీకు తెలియదు తుంగా! ప్రతి మనిషి ఎప్పుడో ఒకప్పుడు, తెలిసో తెలియకో, ఏదో తప్పుచెయ్యటం జరుగుతూనే ఉంటుంది."

ఎన్నో నెలల తర్వాత ఇంకొకరి సానుభూతి వాక్యాలు తుంగమ్మ దుఃఖపు ఆనకట్టను కదిలించాయి. ఆగని కన్నీరు రెండు బుగ్గలమీదుగా ప్రవహించసాగింది.

సరసమ్మ అభయ ధామ నివాసుల పూర్వచరిత్రలు వ్రాసుకునే ఆ పెద్దపుస్తకాన్ని మూసివేశారు. కళ్లద్దాలను తీసి బల్లమీద పెట్టారు. కాళ్ళు చాపుకుని తుంగమ్మనే చూస్తూ కూర్చున్నారు. సమితివాళ్ళు నియమాలనూ నిబంధనలనూ ఏర్పరచారు. ఒకే రకం ప్రశ్నలు. అన్నీ క్రమబద్ధంగా వుండేవి. కాని ఇక్కడికొచ్చే మనుషులుమాత్రం ఒకే రకంవారు కారు. ఒకరి కొకరికి పోలిక వుండేదికాదు. సరసమ్మకు ఆ సంగతి తెలుసు. ఎన్నోసార్లు ఆమెకు ఆదే అనుభవాని కొస్తూండేది. ఒక్కొక్కప్రశ్న అడిగి కావలసిన జవాబు తెప్పించుకోవటం సాధ్యమయ్యేది కాదు.

ఈసారీ అంతే.

పాత సంగతులన్నీ గుర్తుకొచ్చి ఏడుస్తోంది తుంగమ్మ.

"ఏడవకు" అనలేదు సరసమ్మ. అలాటి సమయాలలో ఆమె ఎప్పుడూ అలా అనేవారు కారు, కన్నీరు స్వేచ్ఛగా ప్రవహించాకనే

దుఃఖితురాలయిన స్త్రీకి కాస్త ఓదార్పుగా ఉంటుందని ఆమెకు తెలుసు.

కాని అమ్మాయిలు ఏకవచనంగా వున్న సంకల్పాలూ లే పోలేదు. వేశ్యావాటికలనుంచి, రోడ్లకో తిరిగేవాళ్ళ పోలీసులు తెచ్చినపుడు ఆ అనుభవమయ్యేది. అలాంటివాళ్ళు మాస్థానానికి విరోధులు. వారు సరసమ్మ అలాంటివారి దృష్టిలో శత్రువు. శత్రువును కాన్చే పేలా చూడటమే వాళ్ళిచ్చే జవాబు. అప్పుడు సరసమ్మ సాయముకన్నా, పోలీసుల లాఠీలే ఎక్కువ పనిచేసేవి. సరసమ్మ తగు జాగ్రత్తతో ప్రవర్తించేవారు.

తుంగమ్మ తనకుతానే అభయం కోరి వచ్చిన స్త్రీ. వెనుకటి రాత్రి తుంగమ్మను లోపలికి తీసుకొస్తున్నప్పుడే సరసమ్మకు తెలుసు ఆమె అన్యాయానికి లోనైన అమాయక స్త్రీ అని. అలాంటివాళ్ళవల్లనే అభయధామానికి మంచిపేరు వస్తూండేది. తనమూలా అలాంటివాళ్ళున్నప్పుడే సరసమ్మ భుజాలకు బలం వచ్చినట్టుండేది. తన బ్రతుకు సార్థకమనిపించేది.

కాస్సేపలా ఏడ్చాక సర్దుకుంది తుంగమ్మ.

అప్పుడడిగారు సరసమ్మ—

"మీ వూరు ఏది, తుంగా?"

"తుమకూరు దొడ్డమ్మా!"

ఆ వూరిపేరు ఆమెకు ఏదో పాత సంగతులను గుర్తుచేసింది.

"ఓ...." అన్నారు. "తుమకూరా? మా అత్తగారిది ఆ ఊరే!"

ఓ క్షణం తనకి కాని విషయాన్ని గురించి ఆలోచించే అవకాశం.

"మీకు తుమకూరు బాగా తెలుసా, దొడ్డమ్మా?"

"ఉహుఁ...ఇరవై ఏళ్ళకే వైధవ్యం పొందాను. అప్పుడే వచ్చేశాను. మళ్ళీ ఆ వూరి మొహం చూడలేదు మరి....ఇదంతా ముప్ఫయ్యేళ్ళ క్రితం సంగతి."

తరువాత తనేం మాట్లాడాలో తోచలేదు తుంగమ్మకు. ఆమె పరిస్థితిని గమనించి సరసమ్మే అడిగారు.

"ఇంట్లో ఎవరెవరు ఉన్నారు?"

"నాన్నగారు స్కూలు టీచరు. ఏప్రిల్‌లో రిటైరవుతారు. తమ్ముడు మిడిల్ స్కూల్లో పరీక్షకు కట్టాడు ఈ సంవత్సరం. వీళ్ళిద్దరే దొడ్డమ్మా!"

"ఓ....అమ్మగారు పోయి ఎన్నేళ్ళయింది?"

"నా చిన్నప్పుడే పోయారు."

"పాపం! ఏమయింది?"

"నా తమ్ముడు పుట్టాక చాలా ఏళ్ళతర్వాత కానుపొచ్చింది. కానుపు కష్టమై-పోయారు."

సమితివారు ఏర్పరచిన ప్రశ్నావళిలో ఇవన్నీ లేవు కానీ ఇలాటి ప్రశ్నలతో కావలసిన విషయాలను సేకరించటం సులువని సరసమ్మకు అనుభవపూర్వకంగా తెలుసు

"నువ్విక్కడ కొచ్చావని మీ నాన్నగారికి తెలుసా, తుంగా!"

ఆ ప్రశ్న తుంగమ్మను సూదులతో పొడిచినట్టు బాధించింది. కళ్ళల్లో మరోసారి కన్నీరు సుళ్ళు తిరిగింది. కంఠం గద్గదిక మయింది.

"లేదు దొడ్డమ్మా! ఐదు నెలలుగా ఈ ఊళ్ళోనే ఉన్నాను నేను. 'మావళ్ళి'లో—అక్కడనుండే వచ్చాను. నాన్నగారికి తెలియదు. ఇక రాయాలి దొడ్డమ్మా!"

"అలాగే రాద్దాం."

"మా నాన్న చాలా బాధ పడతారు. ఆయన్ని చాలా హింస పెట్టాను నేను."

"...................."

"అతను....అతను....ఇలా చేస్తాడనుకోలేదు నేను."

వింటున్న సరసమ్మ గాఢంగా నిట్టూర్చారు. అవే మాటలను పలుమార్లు విన్నారామె "అతను ఇలా చేస్తాడనుకోలేదు."

తుంగమ్మ తడబడుతూ, ఏడుస్తూ కాసేపు ఆపి మెల్లి మెల్లిగా తన కథంతా వినిపించింది.

• • •

ఆమె జీవితంలో ఆ అధ్యాయం ప్రారంభమయింది. నాలుగేళ్ళక్రిందట. అక్క పెళ్ళి రోజున. పధ్నాలుగేళ్ళ పిల్ల తుంగమ్మ సంభ్రమంతో తిరుగుతూంది పెళ్ళింట్లో. మైసూరునుండి పెళ్ళి వారొచ్చారు. వారిలో ఓ కుటుంబంలో తన ఈడు పిల్లతో జత కుదిరింది తుంగకు. బృందావనం, చాముండీకొండ, మృగాలయం, రాచనగరుల వర్ణన వింటూ ఆ పిల్లతో బాగా కలిసిపోయింది తుంగ.

అక్క పెళ్ళి హడావుడిలో చెల్లెలికి తీరికెక్కడిది? అయినా అప్పుడప్పుడూ ఆ అమ్మాయిని పలకరించేది. అప్పుడో సారి ఆ అమ్మాయి అడిగింది—

"మా అన్నయ్యను చూశావా, తుంగమ్మా?"

"మీ అన్నయ్యా? వచ్చారేమిటి?"

"అదిగో, పెళ్ళికొడుకుదగ్గర కూర్చున్నాడు చూడు."

"ఓహో...."

"అలా అంటావేం? బాగా లేడా?"

తుంగమ్మ మొహం ఎర్రబడింది.

"ఛీ....పో....అలా అన్నానా నేను?"

"అలా దారికిరా భలే షోకిల్లాలే మా అన్నయ్య. ఏమనుకున్నావో. చూడు, నీ వేపే చూస్తున్నాడు."

"ఛ....పో...."

"అంత సిగ్గెందుకూ, నీకు తగినవాడు కాదంటావా మా అన్నయ్య?"

అందగాడే అతను. తనవేపు చూస్తున్నదీ నిజమే. ఆ పెళ్ళి సందట్లో, మంగళవాద్యాల సంరంభంలో తుంగమ్మకూడా అతనివేపు చూడాలనిపించి చూపింది. అతడు చిరునవ్వు నవ్వుతున్నాడు. మళ్ళీ మళ్ళీ చూడాలనిపించే విగ్రహం అతనిది.

అప్పటికి పెళ్ళి అంటే ఏమిటో పూర్తిగా తెలియదు తుంగమ్మకు అయినా పెళ్ళి అనే ఆలోచన ఆమెకు ఆనందాన్ని కలిగిస్తూంది. పెళ్ళికూతురిగా అలంకరించుకున్న అక్కయ్య మొహంలోని తృప్తిని

చూపి తనకూడా ఓరోజు అలాటి తృప్తిని పొందుతానని నమ్మింది తుంగమ్మ.

మైసూర్‌పిల్ల చెప్పింది:

"బి ఏ చదువుతున్నాడు మా అన్నయ్య. ఇక రెండేళ్ళు. తర్వాత పెద్ద ఉద్యోగం వస్తుంది. అప్పటికి రెడీగా ఉండాలమ్మాయ్ నువ్వు."

పెళ్ళిరోజున ఆ విషయం అంతటితో ఆగలేదు. అవ్వాళ సాయంత్రం పాటకచ్చేరి జరిగింది.

సదూపరులకు వచ్చినవారు చాలా కానుకలు చదివించారు. అక్కయ్య కానుకలను లోపల ట్రంకులో పెట్టడానికి వెళ్ళింది తుంగమ్మ. ఇంట్లో లోపల గదులన్నీ నిర్జనంగా వున్నాయి. తను తెచ్చినవాటిని టంకులో పెట్టి తాళంవేసి లేచిన తుంగమ్మ నిశ్చేష్టితురాలై నుంచుండిపోయింది. అతను తీవిగా తలుపునానుకుని నుంచుని నవ్వుతున్నాడు.

అతను "మా చెల్లి వచ్చిందా ఇటు?" అన్నాడు.

"అఁ.... ఊఁ...."

"మా చెల్లి వచ్చిందా అన్నాను-అరె అంత భయపడతావేం?"

తన ఇంట్లోనే ఉంటూ తనకు భయమెందుకూ? తుంగమ్మ సర్దుకుని నవ్వటానికి ప్రయత్నించింది.

"నమ్మన్నావుట!" అన్నాడతను.

"ఎవరూ! నేనా? లేదే!"

"ఊహూఁ....అబద్ధాలు కూడానా?"

"అబద్ధాలా....నేనా?"

తుంగమ్మను పూర్తిగా మాట్లాడనివ్వలేదతను. క్షణంలో ముందుకొచ్చి తుంగమ్మను దగ్గరకు తీసుకుని ముద్దెట్టుకున్నాడు.

తుంగమ్మ పట్టు విడిపించుకుంది. కాని అరవలేదు. అతడూ కంగారుగా అక్కడనుండి వెళ్ళిపోయాడు.

పళ్ళు బిగబట్టుకుని తుంగమ్మ నీళ్ళగదిలోకి వెళ్ళింది. నీళ్ళతో నోరూ, పెదవులూ కడుక్కుంది. 'థూ....ఎంగిలి' అనుకుంది.

కాని కొంగుతో మొహం తుడుచుకుంటున్నప్పుడు ఏదోలా అనిపించసాగింది. గుండె వేగంగా కొట్టుకో సాగింది.

అతన్ని ద్వేషించా లనుకుంది ఆమె. కానీ ఆ నిర్ణయం కాస్సేపు కూడా నిలపలేదు. ఓ క్షణం గోడ నానుకుని నుంచుంది తుంగమ్మ. ఏడవాలో, నవ్వాలో అర్థంకాలే దామెకు ఆమె మొహం. ఒళ్ళూ మండుతున్నట్టుగా వుంది. ఎక్కువసేపు అక్కడ నుంచోటానికి వీల్లేదు. బయట అక్కయ్య తనకోసం చూస్తూంటుంది. తండ్రి ఏ నిమిషంలో నన్నా తనని పిలవచ్చు.

తుంగమ్మ పందిరివేపు నడిచింది. అందరూ తననే చూస్తున్నట్టనిపించింది. నిజానికి మైసూరు యువకుడు తప్ప ఎవరూ ఆమె వేపు పరీక్షగా చూట్టంలేదు. తుంగమ్మ తలెత్తలేదు, అతడు కనిపిస్తాడన్న భయంతో.

అక్కయ్య అడిగింది-"ఎక్కడున్నావ్ ఇంతసేపూ?"

"ఆ...."

"ఏం జేస్తున్నావ్ లోపల?"

"నీళ్ళగదిలోకి వెళ్ళా నక్కా!"

నిజం - అబద్ధం. రెండూ. కానీ ఎలా చెప్పటం అక్కయ్యతో. తుంగమ్మకు తెలుసు- అక్కను అంతవరకూ ఎవరూ ముద్దెట్టుకోలేదు. అవ్వాళే పెళ్ళి. తననుమాత్రం... అతడు ...

ఎండిన పెదవులను నాలుకతో తడుపుకుంది తుంగమ్మ.

ఇంట్లో జరిగిన దానిని ఎవరితోనూ చెప్పటానికి లేదు. ఎవ్వరితోనూ.

పెళ్ళివారంతా మరునటిరోజు వెళ్ళిపోయారు.

వెళ్ళేముందు మైసూర్‌పిల్ల వచ్చి "నాణి, నేనూ వెడుతున్నాం తుంగమ్మా!" అంది.

అంతవరకూ అతని పేరేమిటో తెలియదు తుంగమ్మకు. ఇప్పుడు తెలిసింది. అయినా అడిగింది-

"ఎవరు 'నాణి' అంటే?"

"ఓహో! ఏం తెలీదన్నమాట. నారాయణమూర్తి - మా అన్నయ్య."

"ఆయన పేరా అది?"

"ఏది?"

"నారాయణమూర్తి అని."

"పేరు చెప్పేశావే!" ఏడిపించిం దాపిల్ల.

"చ....పో."

"ఏం చెప్పమంటావు మా అన్నయ్యకు?"

"ఇంకోసారి మా ఇంటికి వస్తే పళ్ళు రాలగొట్టి చేతికిస్తానని చెప్పు."

నవ్వుతూ సరదాగా చెబుదామనుకున్నా ఆ మాట చెప్పేటప్పుడామె గంభీరంగానే ఉంది.

ఆ పిల్లకు తేలు కుట్టినట్లయింది.

"ఓ..."అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది మళ్ళీ అందరూ జట్కాల్లో వెళ్ళేటప్పుడు నారాయణమూర్తి కనిపించాడామెకు. కాని చెల్లికల్ల ఆమె సందేశాన్ని అందుకున్న అతను నవ్వటానికి ప్రయత్నించలేదు

తుంగమ్మకు నిరాశ కలిగింది. అందరూ వెళ్ళాక దిగులుగా ఇంట్లోకి వెళ్ళింది. అక్కయ్య ఏడుస్తూందక్కడ. అక్కయ్యతోబాటు చెల్లెలూ ఏడవసాగింది

తరువాత రెండేళ్లు అతన్నిగురించిన ప్రస్తావనేమీ రాలేదు. ఈ అవధిలో తుంగమ్మ అక్కయ్య అత్తవారింటికి వెళ్ళింది. అక్కడ నుండి భర్తకు 'బెళగాలి' కాలేజీలో లెక్చరరు ఉద్యోగం రావటంతో భర్తతో అక్కడికి వెళ్ళిపోయింది. ఇంట్లో పనీ పాటా చూసుకోవాల్సిన బాధ్యత మీదపడటంతో తుంగమ్మ హైస్కూల్లో చదువు ఆపేసింది.

ఓరోజు తండ్రి అడిగాడు—

"తుంగా, పద్మ పెళ్ళికి మైసూరునుండి నారాయణమూర్తి అని ఒకరొచ్చారు గుర్తుందా?"

"రెండేళ్ళ క్రిందట?" తుంగమ్మకు గుర్తులేకేం? బాగానే గుర్తుంది.

"ఊఁ ...పద్మ పెళ్ళికి...."

"అదే. ఓ పిల్ల వచ్చి నాతో మాట్లాడుతూ ఉండేది. వాళ్ళ న్నయ్య అనుకుంటా."

"ఊఁ....వాళ్ళే. ఆ అమ్మాయికి పెళ్ళయిందట. ఎవరో చెప్పారు మొన్న"

"ఓ... " అంది తుంగమ్మ. 'అంతేనా' అనుకుంది లోలోపల.

ఆయనే మళ్ళీ అన్నారు-

"నారాయణమూర్తి ప్యాసయ్యాడుట...."

"ఏం పరీక్ష నాన్నా?" తనకు తెలిసినా కావాలనే ప్రశ్నించింది.

"బి. ఎ."

"ఓ...."

సంభాషణ అంతటితో ఆఖరయింది.

ఆ నారాయణమూర్తి జ్ఞాపకాలు మరిచిపోవటానికి సాధ్యమా? పాత సంఘటన ఇప్పుడు ఇంకా ఎక్కువ అర్థాన్ని స్ఫురింపజేస్తూ గుర్తుకొస్తూంది.

అక్క 'బెళగాలి'లోనే ఆడపిల్లను ప్రసవించింది.

ఇల్లు చక్కపెట్టుకుంటూ, నవలలు చదువుతూ కాలక్షేపం చేస్తున్న తుంగమ్మ తను గృహిణి కాబోయే క్షణంకోసం ఎదురు చూస్తూంది

తండ్రి తన వివాహప్రయత్నాలు చేస్తున్నారా లేదా అని కుతూహలంతో గమనిస్తూ వుండేది. ఉత్తరాలను చదివి చూసేది.

ఓసారి నారాయణమూర్తి తండ్రి "కానీ చూద్దాం, తొందరేముంది?" అని రాసిన ఉత్తరం చదివింది. మళ్ళీ మరో స్నేహితులు "అకుర్రాడి తండ్రి మహాలోభి. రెండు వేలు చేతిలో పడందే ఒప్పుకోరు" అంటూ రాశారు

కాని అతి హీనస్థితిలో ఉన్న తుంగమ్మ తండ్రి- ఓ పెళ్ళి చేసిన మనిషి - అంత డబ్బుగురించి ఆలోచించటానికి అవకాశం లేదు.

మళ్ళీ తండ్రి రాసిన ఉత్తరానికి బదులుగా ఆయన రాసిన ఉత్తరంలో—"ఇంకో సంవత్సరం అబ్బాయి పెళ్ళి చెయ్యదలుచుకో లేదు. బలవంత పెట్టకండి" అని వుంది.

తుంగమ్మ నిరాశ చెందింది

మనసునుండి దూరం చేసి తీరాల్సిన పరిస్థితిలో నారాయణ మూర్తి రూపం మసకబార సాగింది.

మసక బారుతూందే గానీ పూర్తిగా చెరిగి పోలేదు

తుంగమ్మ తండ్రి వరాన్వేషణ సాగిస్తూనే ఉన్నారు. వధు పరీక్షలూ అయ్యాయి ఓ రెండుమార్లు దీన్నంతా యాంత్రికంగా సహించటం నేర్చుకుంది తుంగమ్మ.

తండ్రికి డబ్బుంటే తుంగమ్మ కాలేజీకన్నా వెళ్ళగలిగేది. అపుడు "అమ్మాయి ఇంకా చదువుకుంటూంది" అని తండ్రి బంధువులకు చెప్పే అవకాశం ఉండేది. ఇప్పుడు ఆ అవకాశము లేక పోయింది

వయసు పెరుగుతూందని భయపడే కాల మెపుడో పోయింది. కాని పెళ్ళి ఎలాగూ చెయ్యాలి కదా. అదెలాగా అనేదే ఆయన సమస్య.

తుంగమ్మ తల్లిని ఆయన పెళ్ళి చేసుకున్నప్పుడు పరిస్థితి వేరు. ఈ పాతికేళ్ళలో వచ్చినమార్పు పోల్చలేనిది. మార్కెట్లో వరుళ్ళ వెల బాగా పెరిగిపోయింది. వరుణ్ణి సంపాయించటం అసాధ్య మనిపించేలా వుంది. పెళ్ళిచేసి చేతులు కడుక్కునేసరికి జన్మాంతరపు ఋణం తీర్చినంత పనవుతూంది ఇక పిల్ల కనీసం ఇంటర్మీడియట్ పాసవ్వాలి. కన్యాపరీక్ష పశువుల సంతలో పశువులను పరీక్షించిన తీరులో జరుగుతూంది

తుంగమ్మ మృదువైన మనసు రానురాను కఠినమవుతూంది. ప్రతిసారీ ఓడిపోతున్న ఆమె తండ్రి అధీరు డవసాగారు. సహనశీలియైన ఆ బీద బడిపంతులు కోపిష్టిగా తయారవుతున్నాడు.

తుంగమ్మ ఈ ఆలోచనలతో కృశించి పోతూంది.

అలాటి పరిస్థితిలో ఆమె జీవితపు కాళరాత్రిలో చంద్రోదయమయింది.

ఆ సంవత్సరం చలికాలం అప్పుడే వెళ్ళిపోతూ వేసవికాలాన్ని ఆహ్వానిస్తూంది. అవ్వాళ ఆదివారం సాయంత్రం తుంగమ్మ తండ్రి ఎవరినో చూడటానికి వెళ్లారు. తుంగమ్మ తమ్ముడు క్రికెట్ చూడ్డానికి వెళ్ళాడు. ఇంట్లో తుంగమ్మ ఒక్కతే 'కన్నీరు' నవల చదువుతూ కూర్చుంది.

తలుపు కొట్టిన చప్పు డయింది.

"ఎవరూ....?"

మళ్ళీ తలుపు చప్పుడయింది. నవల చదవటంలో నిమగ్నురాలయిన తుంగమ్మ విసుగ్గా. "ఎవరూ?" అంది.

"నేను."

ఆ కంఠం ఎవరిదో తుంగమ్మకు తెలియకపోయినా గబుక్కున లేచి పుస్తకం క్రిందపెట్టి తలుపు తీసింది.

ఆశ్చర్యంతో అలాగే నుంచుండి పోయింది.

నవ్వుతున్న కళ్ళు. అందంగా దువ్విన క్రాపు—ఉన్న అందాన్ని ఇనుమడింపజేసే యౌవనం.

అతను నారాయణమూర్తి. చిరునవ్వు నవ్వుతున్నాడు

తుంగమ్మ మొహం సిగ్గుతో ఎర్రబడింది. కళ్ళకు చీకట్లు కమ్ముతున్నట్లు అనిపించింది. ఒక్కక్షణం ఇది కలా, నిజమా అనిపించింది.

నారాయణమూర్తి తుంగమ్మవేపే తదేకంగా చూస్తున్నాడు.

"లోపలికి రండి" అనా లనుకుంది తుంగమ్మ. కాని నోట్లోని మాట బయటికి రాలేదు.

తుంగమ్మను చూట్టం కళ్ళకు పండుగలా ఉందతనికి.

"ఇంట్లో ఎవరూ లేరా?"

"లేరు" అంది తుంగమ్మ.

"ఎప్పు డొస్తారు?"

"తెలీదు."

"బాగున్నారా?"

"ఊఁ. ఇలా వున్నాం-రండి."

ఆమె మనసులో అనిపిస్తూంది. ఈతన్ని అవమానించి తట్టి పంపాలని. బోలెడంత కట్నం కావాలన్నది ఇతనే కదూ? లేత మనసుమీద నిర్దాక్షిణ్యంగా వాత పెట్టిన ఘనుడు కదూ? కాని మనసులో మరోభాగం మధురమయిన రాగాన్ని ఆలాపిస్తూంది-'ఎన్నిసార్లు తల్చుకున్నావో ఈ మూర్తిని. ఇదిగో ఇప్పటికి వచ్చాడు నీ మన్మథుడు. రమ్మను లోపలికి. ఆహ్వానించు' అంటూంది.

"రండి" అంది తుంగమ్మ.

కానీ అతను లోపలికి రాలేదు.

"మీ రొక్కరే వున్నప్పుడు రాను లెండి-పళ్ళు రాలగొట్టి చేతికిస్తారేమో!"

అతను నవ్వుతున్నాడు. ఆమెకూడా నవ్వింది. ఎందుకో తెలియని కన్నీరు ఆమె కనుకొలుకుల్లో నిల్చింది.

"రండి."

"ఇప్పుడే పళ్ళు రాలగొడదామనా?"

"అబ్బ....చాల్లెండి. ఎంతసేపూ ఆ మాటేనా?"

నారాయణమూర్తి కంఠం మారింది.

"వచ్చే ఆదివారం వస్తానని చెప్పండి మీ నాన్నగారితో. నాకీ ఊళ్ళోనే ఉద్యోగం. కలెక్టరాఫీసులో వున్నాను. ఇక్కడి కొచ్చి ఓ వారమయింది."

"ఓ ...!"

"ఇక వస్తాను."

బలవంతంగా లోపలికి పిలవాలనుకుంది. కానీ నోట్లోమాట పెగల్లేదు. నారాయణమూర్తి ఠీవిగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

ఎదురింటి కిటికీలోనుండి చూస్తున్న రుక్మిణమ్మ అడిగారు-"ఎవరొచ్చింది?"

"మైసూరు వాళ్ళు, మా బావవేపు వాళ్ళు"

"ఓ ..."

తుంగమ్మ మొహం సిగ్గుతో ఎరుపెక్కింది

"మంచికుర్రాడు. లోపలకు రాకుండానే వెళ్ళిపోయాడు కదే..."

మంచి కుర్రాడే మరి!

"మళ్ళీ వస్తానన్నారు" అంది తుంగమ్మ.

రుక్మిణమ్మ నవ్వారు.

తుంగమ్మ తలుపు వేసి లోపలికి నడిచింది. కాని మళ్ళీ 'కస్తూరి' నవల చేతిలోకి తీసుకోలేదు. మనసు తేలిగ్గా వుంది. అద్దంలో మొహం చూసుకుంది. ముడి చేత్తో ముట్టి చూసుకుంది. పొడగ్గా వేలాడుతున్న కొంగు సర్దుకుంది.

అక్కయ్య పెళ్ళి రోజు....ఇంట్లో తనొక్కతే....అతని పేరు కూడా తెలియదు .. అతను....ఛ....!

తనను చూసి తన ఆలోచనలను ఎవరైనా పసిగడతారేమోనని భయపడింది తుంగమ్మ.

హృదయం సంతోషంతో పొంగి పొరలుతూంది. మృదువుగా మధురంగా తగ్గుస్థాయిలో పాడసాగింది, తుంగమ్మ—

"క్రిష్ణయ్య వచ్చెనే. గోపాల క్రిష్ణయ్య వచ్చెనే...."

చీకటి పడుతుండగా తుంగమ్మ స్వప్నలోకంలోనుంచి బయటికి వచ్చింది. నారాయణమూర్తి వచ్చి వెళ్ళాడన్నసంగతి తండ్రితో ఎలా చెప్పాలన్న సమస్య పట్టుకుంటామెను.

ఇంటికి వచ్చిన తండ్రి కూతురి మొహంలోని ప్రసన్నతను గమనించి "ఏమిటమ్మా ఖుషీగా ఉన్నావ్! ఎవరైనా స్నేహితురాళ్ళు వచ్చి వెళ్ళారా!"

"లేదు నాన్నా!"

నారాయణమూర్తి వచ్చి వెళ్లాడని చెప్పటానికి సంకోచించింది తుంగమ్మ.

భోజనానికి కూర్చున్నప్పుడు మెల్లగా—

"ఓ సంగతి చెప్పటం మర్చేపోయాను నాన్నా!"

"ఏమిటమ్మా!"

"పద్దక్క పెళ్ళికి వచ్చారన్నావే అవ్వాళ...."

"ఊఁ...."

"నారాయణమూర్తి అనుకుంటా...."

"ఔను....ఔను."

"ఆయ నొచ్చారు సాయంతం."

"నారాయణమూర్తా! ఈ ఊరెందుకొచ్చాడట!"

"ఇక్కడే ఉన్నారటగా ఇప్పుడు? ఇక్కడే ఉద్యోగ మయిందిట."

"నాకేం తెలియదమ్మా."

నారాయణమూర్తి చెప్పిందంతా తండ్రికి అప్పజెప్పింది.

ఆ తండ్రిమనసులో ఒక్కసారి చెరిగిపోయిన ఆశ మళ్లీ తలెత్తింది.

"కూర్చోమన్నావా?"

"అన్నాను. కానీ లోపలికి రాలేదు."

"భలే సంకోచం మనిషి."

నారాయణమూర్తికి సంకోచమా! తుంగమ్మ నవ్వు ఆపుకుంది. పాపం, ఈ నాన్నకేం తెలీదు అనుకుంది.

మరుసటిరోజు అతను రాలేదు. ఇంకో ఆదివారంనాకా అతను రాడేమో, తనే వెళ్ళివద్దాం అని తండ్రి అనుకుంటూ వుండగా ఆదివారానికి ముందే వచ్చాడతను.

అతను ఇంటికి రావడం ప్రారంభించాడలాగ.

కూతురికి సంబంధాలు వెతుకుతున్న తండ్రి ఈ సందర్భాన్ని వదులుకో దలచలేదు.

"హోటల్లో ఎందుకు భోంచేయటం, మా ఇంట్లో ఉండకూడదూ?" అని బలవంతం చేశాడు.

నారాయణమూర్తి ఒప్పుకోలేదు. వారానికోసారి కాఫీ టిఫిన్, ఎప్పుడైనా భోజనం-అంతే.

మళ్లీ ఒకసారి నారాయణమూర్తి తండ్రికి వ్రాసి కనుక్కుందామా అనిపించిందాయనకు. కాని "కాదు, ఇప్పుడు కాదు" అనుకున్నాడు.

అప్పుడప్పుడు తుంగమ్మ ఒక్కతే ఉన్నప్పుడూ వచ్చి వెడుతున్నాడు నారాయణమూర్తి. మొదటిసారి అలా వచ్చినప్పుడు పళ్ళ

రాలగొట్టలేదు తుంగమ్మ దానికి మారుగా తన అందమయిన పలు వరస కనిపించేలా ఆహ్వానించింది.

నారాయణమూర్తి తను ఒంటరిగా వుండగా వచ్చిన మొదటి సారి తుంగమ్మకు భయం వేసింది. కానీ అతనిప్పుడు బాధ్యతగల పెద్ద మనిషిలాగా ప్రవర్తించాడు. మర్యాదగా దూరంగా కూర్చుని ఏవో మాట్లాడి వెళ్ళాడు. అతను వెళ్ళిపోయాక మళ్ళీ అతనొచ్చేదాకా ఆమె మనసు అతనికోసం తపించింది పాత జ్ఞాపకాలు మధురంగా అని పించాయి.

ఒక్క అడుగునుండి మరో అడుగు ఎంతో దూరం లేదు.

ఓరోజు తుంగమ్మ అంది—

"పద్మక్క బెళగాలినుండి ఉత్తరం రాసింది."

"ఎలా ఉన్నారట ప్రొఫెసరుగారు?"

"ప్రొఫెసరా?"

"కాదా మరి. ఆ ఊళ్ళో కాలేజీ మేస్టర్లనంతా ప్రొఫెసర్లనే అంటారు."

"ఓ....బాగానే ఉన్నారట."

"ఊఁ ..."

ఒక్క క్షణం ఆగి తుంగమ్మ అంది—

"మగవాళ్ళంతా స్వార్థపరులు"

"ఏం?"

"ప్రొఫెసర్‌గారి సంగతి అడిగారేగాని పద్మక్క ఎలా ఉందని...."

"క్షమించు, పరధ్యానంలో మర్చిపోయాను."

తుంగమ్మ చకితురా లయింది. ఇన్ని రోజులుగా తమ ఇంటికి వస్తున్నా ఎప్పుడూ తనను ఏకవచనంలో పిలవలేదు. సిగ్గు, సంకోచా లతో ఆమె తల వంచుకుంది.

"ఏమిటి విశేషం?"

"పద్మక్కకు ఐదో నెలట."

"ఓ....వస్తారా ఆమె?"

అక్కయ్య వస్తే తన ఏకాంతానికి ఎక్కడ అడ్డు వస్తుందో నన్న భీతి తొంగి చూసిందా కంఠంలో!

"ఎందుకొస్తుంది? ఇక్కడ ఏమి అనుకూలం వుందని? మొదటి కాన్పుకే రాలా. మా యింటి సంగతి తెలుసుగా!"

"ఇంకేం రాశారు?"

ఆ ఉత్తరంలో నారాయణమూర్తి గురించి కూడా వుంది. అప్పుడపుడు ఇంటికి వస్తూంటారు అని తను రాసినదానికి బదులుగా ఆయనకు పెళ్ళయిందా అని రాసిందామె. ఆ సంగతి గుర్తొచ్చి తుంగమ్మ మొహం ఎర్రబడింది.

"ఏం రాశారేం?"

ఉత్తరం గదిలో వుంది. తెచ్చి "మీరే చదువుకోండి" అనొచ్చు ఉత్తరం తేవటానికి తను గదిలోకి వెళితే....

"తెస్తానుండండి ఉత్తరం."

తుంగమ్మ లోపలికివెళ్ళి ఉత్తరం చేతిలోకి తీసుకుంది. ఆమె అంచనా తప్పు కాలేదు. పిల్లినడకతో లోపలి కొచ్చాడతను.... మూడేళ్ళక్రిందటి సంఘటన పునరావృతమయింది....

ఈసారి నాకేం తెలియదన్నట్లుగా తుంగమ్మ కళ్ళు మూసుకుని తన్ను తాను మరచిపోయింది. పెదవులు ఎంగి లయ్యాయని కూడా ఆమెకు అనిపించలేదు. అతడూ గాభరాగా పారిపోలేదు.

కౌగలి సడలిస్తూ నారాయణమూర్తి నవ్వి అన్నాడు—

"పళ్ళు రాలగొట్టి...."

"ఛ!...."

కానీ 'ఛ' అన్నప్పుడు ఆమె కంఠంలో ఉపేక్షాభావం లేదు. 'నువ్వు నా ప్రాణం' అన్న స్పష్టత వుంది.

ఆకాశం చేతి కందుతున్నా ఈ ప్రపంచాన్ని మరచిపోలేదు.

"నాన్న వచ్చే వేళయింది."

"బయటికి నడు అని అర్థమన్నమాట."

"ఛ!"

నారాయణమూర్తి బయటికివచ్చి కూర్చున్నాడు. తమిద్దర మధ్యా నలిగి మానం పోగొట్టుకున్న ఉత్తరాన్ని తుంగమ్మ అతని చేతి కిచ్చింది-చదవమని. తనగురించి రాసిన సంగతి చదివి నారాయణ మూర్తి నవ్వేశాడు.

''ఏం రాశావు?''

''ఇంకా ఏం రాయలేదు. ఏం రాయమంటారు?''

''అయిందని.''

తుంగమ్మ కంగారుగా ''ఏమిటి?'' అంది.

''అదే....అయిందని....నారాయణమూర్తి అను వరునకు తుంగమ్మ అన్న వధువునిచ్చి ఇవ్వాళ శుభ ముహూర్తంలో....''

''అబ్బ....ఊరుకోండి.''

కాఫీ చేద్దామని తుంగమ్మ లోపలికి వెళ్ళింది.

బడినుండి వచ్చిన తుంగమ్మ తమ్ముడితో నారాయణమూర్తి మాట్లాడుతూ కూర్చున్నాడు.

తుంగమ్మ తండ్రి సూక్ష్మంగా వీళ్ళను పరీక్షిస్తూనే ఉన్నాడు. కానీ ఆయనకు అర్థం కాలేదు.

నారాయణమూర్తీ—తుంగమ్మా అప్పుడప్పుడు వీలు చూసుకుని ఏకాంతంగా ఉండేవారు. దొంగచాటుగా తమకు కావలసినది ఇచ్చి పుచ్చుకునేవారు.

ఓ రోజు తుంగమ్మ అడిగింది-

''ఎప్పుడూ?''

''ఏమిటి?''

''పెళ్ళి.''

''నాన్నకి ఉత్తరం రాస్తాను తుంగా!''

''నిజం?''

''కాక?''

''తొందరగా రాయండి. మిమ్మల్ని విడిచి ఎక్కువ రోజులు ఉండలేను నేను.''

''నేనుమాత్రం ఉండగలనా?''

"పద్మక్కకు రాయనా?"

"ఏమని?"

"అదే....మన సంగతి."

వెంటనే "ఊఁ" అన్న బదులు వస్తుందని ఆశించింది తుంగమ్మ. కాని, అలా జరగలేదు.

తుంగమ్మ తలెత్తి అతని మొహాన్ని పరిశీలనగా చూసింది.

"ఏం, మీ కిష్టంలేదా?"

"అలా కాదు తుంగా!"

"మరి?"

"కొన్నాళ్లాగు. ఇప్పుడు తొందరేముంది?"

తుంగమ్మ తల వంచుకుంది. మనసులోని క్షోభ కన్నీటి రూపంలో బయటపడింది.

"ఏడవకు తుంగా!" బ్రతిమాలుకున్నాడు మూర్తి దైన్యంగా.

తుంగమ్మ కళ్ళద్దుకుంది కొంగుతో.

"ఏడవను."

"అలా అంటే చాలదు. ఏది, ఇటు చూడు."

తుంగమ్మ తలెత్తింది.

"అలా నవ్వాలి మరి."

"...................."

"నవ్వు మరి...."

"...................."

"ఈ సంవత్సరం డిసెంబర్‌లోగా పెళ్లి ఖాయం."

తుంగమ్మ నవ్వింది. నారాయణమూర్తి చేతులు తుంగమ్మ నడుమును చుట్టేశాయి.

ఓ సాయంకాలం మూర్తి వచ్చేవేళకు తుంగమ్మ బయట కూర్చుంది.

"సెలవా?"

"ఊఁ....దగ్గరకు రాకండి."

"ఏం, అంటుకోరాదా?"

"ఛ!....ఛ!"

"చాదస్తం."

"ఏమన్నారు?"

"వినపళ్ళేదా?"

"అధునిక లన్నమాట. మరోసారి అనండి. చూస్తాను." మూర్తి మాట మార్చాడు.

"వంటగదిలో చప్పుడు వినిపిస్తూంది. ఎవరు!"

"తమ్ముడు....మీరు వస్తారని కాఫీ పెడుతున్నాడు."

"ఆ కాఫీ ఎవరిక్కావాలి?"

"అలా అని చూడండి వాడిముందు."

"అబ్బో....అననులే."

ఓ క్షణం ఆగి తుంగమ్మ నవ్వుతూ అంది:

"ఓ సంగతి తెలుసా?"

"ఏమిటది?"

"తమ్ముడు ఇవ్వాళ అడిగాడు—మూర్తిగారిని ఇక బావా అని పిలవచ్చా అని."

"ఓ....అయితే అందరికీ టాం టాం చేస్తున్నావన్నమాట."

ఆ కంఠంలోని అసమాధానపు ఛాయను గుర్తించి తుంగమ్మ ఊరుకుంది.

కాని, పరిస్థితి చాలారోజులు అలాగే ఉండటం కుదరలేదు. తుంగమ్మ తండ్రి తనలో తను మథనపడుతూ ఆఖరి కో రోజున అడిగాడు-

"ఈమధ్య నారాయణమూర్తి రాలేదు టమ్మా?"

"వచ్చారే...."

"ఏమిటో, అత నొచ్చేసరికి ఇంట్లోవుండి మాట్లాడదామంటే కుదరటమే లేదు."

"మీ కెక్కడ....ఎన్నో పనులు...."

"మరి చెయ్యొద్దా అమ్మాయ్! రిటైరయ్యే సంవత్సరం బద్ధక మని మాట పడమంటావా?"

తుంగమ్మ నవ్వింది.

తండ్రి కాస్సేపాగి మళ్ళీ అన్నాడు-

"తుంగా, నారాయణమూర్తి ఎలా ఉన్నాడమ్మా?"

"ఏం? బాగానే ఉన్నాడే?" తుంగమ్మ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

కాసేపు మౌనం తర్వాత మళ్ళీ ఆయనే పిలిచారు.

"తుంగా!"

"ఏమిటి నాన్నా?"

"నారాయణమూర్తి ఆ సంగతి ఏమైనా ఎత్తాడా అమ్మా?"

ఏ సంగతని అడగలేదు తుంగమ్మ. తండ్రి కడుపులోని బాధ ఆమెకు తెలుసు. కానీ ఆయన అడిగినదానికి ఏమని బదులు చెప్పాలి? ఆమె చీరెకొంగు మెలిపెడుతూ నుంచుండి పోయింది.

"ఆ మాట రానే లేదన్నమాట?"

అది సరికాదని చెప్పాలని కంగారుపడింది తుంగమ్మ.

"వచ్చింది నాన్నా!"

"ఆఁ....నిజంగానా? చేసుకుంటానన్నా డమ్మా?"

తుంగమ్మ సిగ్గుపడింది.

"నువ్వు అడిగిచూడు నాన్నా!"

శనివారం పొద్దుట ఆఫీసు నారాయణమూర్తికి. మధ్యాహ్నం తీరిక జేసుకుని అతడిని చూట్టానికి వెళ్ళాడు తుంగమ్మ తండ్రి.

ఆయన రాకతో ఆయన అడిగే ప్రశ్ననికూడా నిరీక్షించాడు నారాయణమూర్తి.

మూర్తి గదినుండి బయట పడినపుడు సగం బరువు దిగిపోయి నట్టనిపించింది తుంగమ్మ తండ్రికి.

తన కిష్టమే నన్నాడు మూర్తి. మైసూరు వెళ్ళి ఇంట్లోవారిని ఒప్పిస్తానన్నాడు.

చాలా రోజులతర్వాత తండ్రి నవ్వటాన్ని చూసి తుంగమ్మ లోలోపలే సంతోషించింది.

ఆ తరువాత మూర్తి వచ్చినప్పుడు తుంగమ్మ నవ్వుతూ అంది:

''ఆఖరికి మీరే ఓడిపోయారన్నమాట!''
''అంటే....?''
''అంటే....కొండంత కట్నం కావాలన్నారుగా మరి!''
''ఓ....అదా? అడిగినవారికి బుద్ధిలేదు.''
''మరి మీరేం అడగరన్నమాట?''
మూర్తి తలుపువేపు చూస్తూ ''అడిగితే ఇస్తావా మరి?''
ఆ కంఠంలోని ఉద్వేగాన్ని గమనించలేదు తుంగమ్మ.
''మీరడిగే దేమిటో నాకు తెలుసు.''
''చెప్పుకో!''
''అదే....మామూలు.''
మామూలు పుచ్చుకున్నాడు మూర్తి—
''ఇంతేకాదు తుంగా....''
తుంగమ్మ భయపడి దూరంగా జరిగింది.
నారాయణమూర్తి నవ్వాడు.
''నామీద నమ్మకం లేదా తుంగా?''
''అలా ఎందు కంటారు!''
''మరి....?''
తుంగమ్మకు భయంవేసింది. బదులు ఎలాచెప్పాలో తోచలేదు.
''రేపు సెలవు పెడతాను. ఆఫీసుకు వెళ్ళను.''
మూర్తి కళ్లల్లో ఆ మాటకు అర్థాన్ని వెతికింది తుంగమ్మ.
''రేపొస్తాను తుంగా, నీతో చాలా కబుర్లు చెప్పాలి'' అంటూ వెళ్ళిపోయాడు మూర్తి.
....ఆ రేపు రానే వచ్చింది.
అతనూ వచ్చాడు.
భయం, ఆతురత, కుతూహలాలతో విలవిల్లాడుతూ కూర్చుంది తుంగమ్మ.
ఇంట్లో అమె ఒక్కతే ఉండే సమయాన్ని కనిపెట్టి వచ్చాడతడు.
ఆ రోజు జరగరానిది జరిగిపోయింది....

తుంగమ్మ కళ్ళు తెరిచేసరికి గోటితో గిల్లిపడేసిన లతలా ఉంది.

నారాయణమూర్తి వెళ్ళిపోతుంటే ఆమె ఏడ్చింది.

అతనన్నాడు—"ఏడవకు తుంగా! ఈ ఆదివారం మైసూరు వెడతాను. తేదీ నిశ్చయించుకునే రావటం."

"ఊఁ....నన్ను వదలకండి. మా కెవరూ దిక్కులేరు."

అతడు వంగి, కూర్చున్న ఆమె తలను వణుకుతున్న చేతుల్తో నిమిరాడు.

"అలాగే తుంగా! నువ్వేం కంగారుపడకు" అన్నాడు.

కానీ తరువాత అలా జరుగలేదు.

ఆ ఆదివారం అతడు రాలేదు. మైసూరు వెళ్ళుంటా డనుకుంది. తండ్రి అడిగినపుడు కూడా అదే బదులు చెప్పింది.

కానీ మరో రెండురోజులు గడిచేసరికి ఆమె మనసు నిలవ లేదు. ఉదయమే తమ్ముడిని పంపింది. తమ్ముడు తిరిగొచ్చి చెప్పాడు- "ఉన్నారక్కా?"

"ఏమన్నారు?"

"ఆదివారం ఒంట్లో కులాసాగా లేదుట. అందుకే రాలేదుట."

అనారోగ్యపు మాట వినగానే తుంగమ్మ మిగతా ఆలోచన లన్నీ ఎటో పోయాయి.

"ఒంట్లో బాగా లేదా? ఇప్పుడెలా వున్నారు?"

"ఏమిటో మరి....ఇప్పుడు బాగానే ఉన్నారు. నేను వెళ్ళినప్పుడు మొహానికి సబ్బు రాసుకుని అద్దంముందు కూర్చున్నారు. అది కాదక్కా....ఎంతసేపు 'షేవ్' చేసుకుంటారని?"

తుంగమ్మ నవ్వింది.

"ఏమన్నారు? రేపొస్తా నన్నారా?"

"రేపా....ఊహుఁ. ఆదివారం వస్తానని చెప్పమన్నారు."

"ఊఁ...."

"నాన్నతోనూ చెప్పమన్నారు."

'అయితే ఆదివారం తనతో ఒంటరిగా మాట్లాడ దలుచుకోలే దన్న మాట! ఎందుకలా అన్నారో మరి. బహుశః ముందే వద్దామను

కున్నా తమ్ముడితో కావాలనే చెప్పి ఉండరు. అంతే అయ్యుంటుంది.' అని తనను తనే సమాధాన పరచుకుంది తుంగమ్మ.

కానీ వారం మధ్యలో అతను రానే లేదు.

ఆదివారం వచ్చినప్పుడుకూడా తలెత్తి తుంగమ్మవేపు చూడ లేదు.

"మైసూరునుండి ఉత్తరమేమన్నా వచ్చిందా?" తుంగమ్మ తండ్రి మామూలుగా అడిగాడు.

"లేదు" కాస్త తడబడ్డాడు నారాయణమూర్తి.

"నువ్వు, వెనకటి ఆదివారమే మైసూరు వెళ్ళుంటావంది తుంగ."

ఆ మాటల వెనకనున్న భావాన్ని పసికట్టా డతను.

"అవును. వెడదామనే అనుకున్నా. సెలవు దొరకలేదు. రేపు ఆదివారం వెడతాను...."

మూర్తి అబద్ధాలాడుతున్నాడని ఎవరూ అనుమానించలేదు.

"వీలయినంత త్వరగా వెళ్ళిరా బాబూ!"

నారాయణమూర్తి ఎక్కువసేపు కూర్చోకుండానే హడావుడిగా వెళ్ళిపోయాడు.

మళ్ళీ ఆదివారంకూడా అతడు మైసూరు వెళ్ళలేదు. తుంగమ్మ తమ్ముడితో కబురంపినా ఇంటికి రాలేదు.

తుంగమ్మ కంగారుపడింది. ఒంటరిగా కుమిలి కుమిలి ఏడ్చింది.

ఈ సంబంధం కుదురుతుందని నమ్మకంగా వున్నాడు తుంగమ్మ తండ్రి. ఇప్పుడు నారాయణమూర్తి ఉపేక్ష ఆయన్ని కలవర పెట్టింది.

"కుర్రసన్నాసి. మనసు మార్చుకున్నాడో ఏమో!" అని గొణుక్కున్నాడు. "నువ్వేమయినా అన్నావా-ఏం?" అన్నాడు కూతురితో.

ఎలాటి ప్రశ్న! తుంగమ్మ బదులు పలుకలేదు.

ఆయన మళ్ళీ అదేమాట అడిగాడు.

"ఏమంటాన్నేను? మీరు మరీను." తుంగమ్మ నొచ్చుకుంది.

ఆ పరిస్థితిలోనూ ఆమె "మీరే మైసూరికి ఉత్తరం రాసి చూడకూడదూ నాన్నా!" అని మాత్రం అనగలిగింది.

ఆయన అలాగే చేశాడు. ఈపాటికి నారాయణ ఈ సంగతి చెప్పి ఉంటాడని అందులో సూచించాడు.

కానీ నారాయణమూర్తి ఏమీ చెప్పలేదు వాళ్ళకి. వాళ్ళు తుంగమ్మ తండ్రిని అవమానిస్తూ ఉత్తరం రాశారు- "అయోగ్యుల సావాసం. ఎప్పుడో ఏదో పరిచయం ఉందన్న మాత్రాన ఇంతదూరం వల వెయ్యాలా? మనమధ్య సంబంధం ఎప్పటికీ జరగదు. కూతురి పెళ్ళికి ఐదు, పదివేలు ఖర్చుపెట్టే స్తోమతు మీకు లేదు. కుర్రాణ్ణి వల్లో వేసుకుని ఏమన్నా చేద్దామనుకుంటున్నారేమో, జాగ్రత్త!...."

బడిలో పాఠాలు సరిగా చెప్పటం లేదని విద్యాధికారి ఒకసారి హెచ్చరించినపుడు తుంగమ్మ తండ్రి తన ఉద్యోగానికి రాజీనామా ఇవ్వాలనుకున్నాడు. అపుడు తుంగమ్మ తల్లి కడుపులో ఉంది. తన తొందరపాటువల్ల కుటుంబం వీధిలో పడుతుందన్న వ్యథతో ఆ అవమానాన్ని దిగమింగుకున్నాడాయన. ఇప్పుడు దాన్ని మించిన అవమానం.

ఆ ఉత్తరం చదివితే అమాయికురాలైన కూతురు నొచ్చుకుంటుందని ఉత్తరం దాచేయడానికి ప్రయత్నించాడాయన. కానీ అది జరగలేదు.

ఉత్తరం చదివి మౌనంగా ఉండిపోయింది తుంగమ్మ. తండ్రీ, తమ్ముడూ బడికి వెళ్ళిపోయాక బావురుమని ఏడ్చింది.

ఆ రోజు తండ్రికి కూతురు వ్యథ మనసులో నాటింది. కానీ అర్థం కాలేదు.

తుంగమ్మకు భయం వేసింది. ఏమీ తెలియకపోయినా మరీ పసిపాప యేం కాదుగా! నారాయణమూర్తిని చూసి మాట్లాడాలని నిశ్చయించుకుందామె.

"గదికి తాళం వేసుందక్కా!" అన్నాడు తమ్ముడు. అక్క మనసులోని కలవరం అతనికేం తెలుసు? కానీ నారాయణమూర్తి ప్రవర్తనవల్ల అతనిమీద జుగుప్సమాత్రం కలిగిందతనికి.

"ఊళ్ళో లేరా?"

"లేరు. మైసూరు వెళ్ళారుట."

మైసూరుకి!

ఉడికిపోతున్న మనసులోని ఆవేదనను చల్లార్చే నీటిజల్లు. నిజమేనా? ఇది సాధ్యమా? మూర్తి మంచివాడే నన్నమాట కదూ!

తుంగమ్మ మొహంలో చిరునవ్వు తొంగి చూసింది.

కానీ తండ్రికి మాత్రం దీనివల్ల పెద్ద సంతోషం కలుగలేదు.

"నువ్వు వాడి ఆశ వదిలెయ్యమ్మా! బీదవాళ్ళ మయినంత మాత్రాన మానం, మర్యాదా వదిలెయ్య లేదుగా మనం!"

ఆ మాటలు సూటిగా సూదుల్లా వచ్చి తగిలాయి తుంగమ్మ హృదయానికి. మానం.... మర్యాదా....

నారాయణమూర్తి తనని మోసం చెయ్యడన్న ఆశ ఇంకా మిగిలే ఉంది తుంగమ్మలో. ఈ తుపాను వెలిసి ఏర్పడే నిర్మల వాతావరణంకోసం ఎదురు చూస్తుంది తుంగమ్మ.

తుపాను ఆగనే లేదు.

తుంగమ్మ తమ్ముడిని మూర్తి ఉద్యోగం చేస్తున్న ఆఫీసుకు పంపింది.

ఆదివారంనుండి మూడువారాలు సిక్ లీవట.... "అత నేమయితే నీ కేమిటక్కా?" అన్నాడు తమ్ముడు.

తమ్ముడు ఇంకా ఏమిటో అంటూనే ఉన్నాడు. కానీ తుంగమ్మకు అదొక్కటీ వినపడనే లేదు. తన మూర్తికి జబ్బా! ఏమిటయింది? ఎంత బాధపడుతున్నాడో పాపం! తనకు ఉత్తరం రాయించకూడదూ? తనను పిలిపించకూడదూ? ఆమె ఆలోచన ఈ త్రోవలో నడిచింది

మూడువారాల తర్వాత తమ్ముడు మరోసారి కనుక్కొని వచ్చాడు.

"అక్కా, మూర్తికి బదిలీ అయిందట."

"ఆఁ....!"

"బదిలీ అయిందట."

తుంగమ్మకు కళ్ళు తిరిగాయి. గోడ నానుకుని క్రింద కూర్చుండి పోయింది.

తమ్ముడు చెబుతూనే ఉన్నాడు.

"మైసూరికి బదిలీ అయిందట. ఇక అక్కడే ఉంటార్ట."

తుంగమ్మ చూపులు ఎప్పటిలా లేవు. తమ్ముడు కంగారు పడ్డాడు.

"నాన్నా!" అని అరిచా డతను. కానీ తండ్రి ఇంట్లో లేడు.

"అక్కా, అక్కా!" అన్నాడు భుజంపట్టి కుదుపుతూ.

"అక్కా, అక్కా. ఇలా చూడక్కా!"

తమ్ముడి పిలుపుతో ఈ లోకంలో పడింది తుంగమ్మ.

కానీ మనసు అడుగుతూంది - 'ఎందుకు? ఎందుకు లేస్తున్నావు? ఇలాటి బ్రతుకు బ్రతికేకన్నా దీర్ఘనిద్ర మంచిది కదా!'

కానీ....తల్చుకుంటే వెంటనే వచ్చేది కాదది.

కొత్త కొత్త పదాలు ఆమె బుర్రమీద దాడి చేశాయి. 'పాపి, కళంకిని, పెళ్ళి కాకుండానే తల్లి కావటం....అయ్యో!'

తనను పెంచి పెద్దజేసిన తండ్రికి ఎంతటి ద్రోహం తలపెట్టింది తాను! ఈ వృద్ధాప్యంలో ఆయనకు ఎంతటి మనఃక్లేశాన్ని కలిగిస్తుందది!

ఈ అపరాధానికి శిక్ష వుందా? ప్రాయశ్చిత్తమంటూ వుందా? పరిహారం అంటూ వుందా?

గంటల తరబడీ ఆలోచించినా ఆమెకు తోచిన పరిష్కారమొక్కటే—చావు.

తండ్రి, పిచ్చిదానిలా ప్రవర్తిస్తున్న కూతురిని చూసి, 'ఏమీ తెలియని అమాయకురాలు—అతనిమీద ఆశతో మనసు పాడు చేసుకుంది' అనుకున్నాడు గాని, దానిలోతు ఎంత ఉందో ఆయనకేం తెలియలేదు.

తనకు తెలిసినప్రకారం లెక్కలు గడుతూంది తుంగమ్మ........మూడో నెల. సందేహం లేదు.

ఏది నయం? బ్రతికినా చెడ్డపేరు. చచ్చినా చెడ్డపేరు.

ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. జ్వరంతో పడకేసింది. తండ్రి కంగారుతో డీలా పడిపోయాడు. పసిపాపను చూసుకున్నట్టు చూసుకున్నాడు. మందూ మాకూ ఇస్తూ శ్రద్ధగా కనిపెట్టుకుని శుశ్రూష చేశాడు.

ఆమె కోలుకున్నాక అమ్మాయి కిది పునర్జన్మ అనుకున్నాడు. కానీ కోలుకుంటున్న తుంగమ్మ పడుకునే తండ్రి చేతులతో మొహం కప్పుకుని కన్నీటితో తడిపేసింది.

"ఎందు కేడుస్తా వమ్మాయ్? తొందరగా నయమవుతుం దమ్మా ఇక. ఇకనేం భయం లేదమ్మా!"

తుంగమ్మ కంఠం క్షీణంగా పలికింది-

"నాకు నయం కాకపోవటమే మంచిది నాన్నా!"

"ఎందుకు? ఎందుకమ్మా అలా అంటావ్!"

"నాన్నా, నేను పెద్ద నేరం చేశాను నాన్నా!"

తుంగమ్మ తండ్రికి వెంటనే అర్థం కాలేదు. కాని మరుక్షణమే అర్థమయింది. గుండె ఆగినట్టయింది.

తన కుడిచేతిని ఆమె పట్టునుండి విడిపించుకుని ఆమె తల నిమరసాగాడు. ఆయన కళ్ళల్లోనుండి ప్రవహించిన వేడి కన్నీటి బొట్లు ఆమె మొహంమీద పడ్డాయి. ఆయన వంగి, కూతురి తలను తన బరువైన హృదయానికి హత్తుకుని అలాగే కూర్చుండిపోయాడు.

తుంగమ్మ మళ్ళీ క్షీణ కంఠంతోనే అంది:

"నేను తప్పు చేశాను. నన్ను క్షమించగలరా నాన్నా? నన్ను క్షమించగలరా?"

"ఎక్కువగా మాట్లాడకమ్మా, నీరసపడి పోతావ్...."అంటూ తన వేలిని ఆమె పెదవులమీద ఉంచాడు. ఆయన కంఠం వణుకుతూంది—వేలుకూడా.

....కూతురు బ్రతికింది. తండ్రికి పిచ్చెక్కలేదు. ఆయన శాంతంగా కూర్చుని ఆలోచించాడు. నారాయణమూర్తి తనంతట తను బయటపడడు. వాళ్ళింట్లో చెప్పినా ప్రయోజనముండదు. మూర్తిని కలుసుకుని మాట్లాడి ప్రయత్నించా లంతే.

తుంగమ్మకు ఏమైనా మందు లిప్పించేందుకు ఆయన ఇష్టపడ లేదు.

ఏమీ చెయ్యకుండా తాత్సారం చెయ్యటానిక్కూడా వీల్లేదు.

తుంగమ్మ తండ్రి సెలవుపెట్టి బెళగాలి వెళ్లాడు. పెద్దకూతురు నిండు చూలాలు. ఆమెతో ఈ విషయం చెప్పటం ఎలా చూసినా మంచిది కాదు. అల్లుడు సానుభూతి చూపిస్తాడన్న నమ్మకం కూడా లేదు. వాళ్ళతో చెప్పకపోవటమే మంచి దనుకున్నాడు.

పద్మ అడిగింది-"తుంగ ఎలా ఉంది నాన్నా ?"

"బావుందమ్మా!"

"తీసుకు రాలేక పోయావా ?"

"ఈసారి తప్పక తీసుకొస్తాను."

"తమ్ముడిపీ తీసుకు రావాలి."

"అలాగే....అలాగే...."

తరువాత ఆయన ఎదురుచూస్తున్న ప్రశ్న రానేవచ్చింది-

"తుంగ పెళ్లిసంగ తేం చేశారు నాన్నా ?"

"అదే ప్రయత్నంలో ఉన్నా నమ్మా ! ఈ వేసవిలో నయినా చేసెయ్యాలి."

"నారాయణమూర్తి అని ...."

"ఆ....అతని కిపుడు మైసూరికి బదిలీ అయింది. ఆ సంబంధం కుదిరేలా లేదు. కాని ఆఖరి ప్రయత్నం చేద్దా మనుకుంటున్నాను. భగ వంతుని దయ ఎలా ఉందో చూడాలి."

....భగవంతునిమీద భారంవేసి ఆయన మైసూరు వచ్చాడు. అక్కడికి రావటాని కేదో లేనికారణం చెప్పి వియ్యాలవారింట్లో దిగాడు. ఓ రోజంతా ప్రయత్నించాక ఒంటరిగా నారాయణమూర్తిని కలుసుకో గలిగాడు.

అతడు తప్పు చేశాడు. ఆ సంగతి అతని ప్రతి కదలికలోనూ కనిపిస్తూనే ఉంది.

కానీ, ఆ మహానుభావుడు చెప్పిం దొక్కటే—

"నాకేం తెలియదు. మీరేమైనా చేసుకోవచ్చు."

మొదట తుంగమ్మ తండ్రి, జరిగింది తప్పేం కాదు, పెళ్ళి చేసుకుంటే సరిపోతుందని చెప్పాడు. తరువాత బెదరించాడు. ఆఖరికి కళ్ళల్లో నీరు నింపుకుని బ్రతిమాలుకున్నాడు.

నారాయణమూర్తి మొహం నల్లబడింది కాని హృదయం కరుగలేదు.

నిరాశతో తుంగమ్మ తండ్రి పైకి లేచాడు.

"ఇంకా ఎన్ని ఇళ్ళకు నిప్పు పెడతావో-నువ్వు మనిషివి కావు, రాక్షసుడివి!"

రాక్షసులు కాని మనుషుల్ని వెతుక్కుంటూ ఆయన బెంగుళూరు వచ్చాడు. ఇక ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు.

'మావళ్ళి'లో ఉన్న తన పాత శిష్యుణ్ణి వెతికి పట్టుకున్నాడు. కాళ్ళమీదపడి ప్రార్థించటానికి సిద్ధంగా ఉన్నాడాయన—

పెళ్ళి చేసుకోమని కాదు, అలాటి ఆశ లేదాయనకు. వివాహితుడైన అతనివద్ద తమ కుటుంబపు మర్యాద నిలబెట్టమని యాచించాడు.

మొదట వెనుకంజ వేసినా, అతను కాదనలేదు. అలా తుంగమ్మ బెళగాలికని బయలుదేరి తండ్రితో బెంగుళూరికి వచ్చింది.

ఆమెను శిష్యుడింట్లో వుంచి, తండ్రి ఊరికి బయల్దేరుతూ అన్నాడు:

"వెళ్తున్నానమ్మా తుంగా! దేవుడున్నాడు. ఇంట్లో వారికేమీ ఇబ్బంది కలిగించకమ్మా!"

తుంగమ్మ బదులుగా వెక్కి వెక్కి ఏడ్చింది.

తండ్రి మనసు ఆవేదనతో నిండిపోయింది. కూతురి కన్నీరు తుడిచి "జరిగిందేదో జరిగిపోయిందమ్మా, ఏడవకు తల్లీ!" అని ఓదార్చాడు.

తుంగమ్మ పెద్దగా రోదించింది.

తండ్రి కూతురి తల, వీపు నిమురుతూ వుండిపోయాడు. కన్నీరు ఆరకుండా, ఆయన ఎండిన చెంపలమీదుగా, పెరిగిన గడ్డం మీదుగా ప్రవహిస్తూనే ఉంది.

* * *

సరసమ్మ ఎంతోమంది అమ్మాయిల విషాదగాథలను విన్నారు. అభయ ధామంలో అడుగుపెట్టిన అమ్మాయి లెవరూ లేనిపోని కట్టు కథలు చెప్పుకునేవారు కాదు. తుంగమ్మా అంతే!

ఆగి ఆగి వచ్చాయి మాటలు. చెప్పేటప్పుడు క్రమబద్ధంగా కాకుండా వెనకా ముందూ అయ్యేది,

కానీ సరసమ్మ దాన్నంతా ఒక వరుసగా పేర్చటంలో సమర్థురాలు. తుంగమ్మ మాటల గొలుసు తెగిపోతూ ఆగిపోతూ నడుస్తున్నా, తను చెప్పనిదానిని కూడా సరసమ్మ ఊహించుకోగలరు. ఆమెకు తుంగమ్మ జీవితం తెరచి ఉంచిన పుస్తకం.

తండ్రి తనను మావళ్లి ఇంట్లో వదిలి వెళ్ళేదాకా చెప్పి ఊరుకుంది తుంగమ్మ.

సరసమ్మా మాట్లాడలేదు.

ఆ విరామం కావాలనే కల్పించా రావిడ.

నిద్రపోతున్న జలజ అటునుం డిటు పొర్లింది.

లేస్తుందేమో అనుకున్నారు సరసమ్మ. ఆమె పని ఏమీ కాలేదింతవరకూ. రాసుకోవాల్సిన పెద్ద పుస్తకం బల్లమీద విశ్రాంతి తీసుకుంటోంది. బయట వృత్తి శిక్షణ క్లాసు జరుగుతూంది. అక్కడెవరో నవ్వుతున్నారు. మూగ కల్యాణి 'కికి లికి'లూ వినిపిస్తూన్నాయి.

"నువ్వు ఇక్కడికి వచ్చావని మావళ్లి ఇంట్లోవాళ్ళకి తెలుసా?" అనడిగారు సరసమ్మ.

"తెలుసు దొడ్డమ్మా, ఉత్తరం రాసిపెట్టి వచ్చాను."

"ఏం రాశా వందులో?"

అందులో తాను రాసినదానిని తల్చుకుంది తుంగమ్మ. "నన్ను గురించి వెతకొద్దు. నే నేం చేసుకోను. క్షేమంగా ఉన్నాను....నాన్నగారికి నేనే రాసి తెలుపుతాను. మీరు నిశ్చింతగా వుండాలి. ఇరుగు పొరుగువారికి కుతూహలం కలక్కుండా చూసుకోండి. నాకోసం ఈ ఐదునెలలూ పడ్డ శ్రమకు నేనెంతో ఋణపడి వున్నాను. ఈ జన్మలో తీర్చుకోలేను....అంతే దొడ్డమ్మా, అంతే!"

"సర్లే తుంగా, కాని వాళ్ళు నువ్వు కనిపించలేదని పోలీసులకు రిపోర్టు ఇస్తే మేమూ తెలపాల్సి ఉంటుంది."

"అంటే ?"

"భయపడకు....నిన్ను ఎవరూ ఇక్కడనుండి లాక్కుపోరు. కానీ పోలీసువారికి నువ్విక్కడున్నావని తెలపాలి కదా ?"

"వద్దు దొడ్డమ్మా....ఈ సంగతి బయటపడితే మా నాన్నగారికి చెడ్డపేరొస్తుంది."

"ఫరవాలేదులే....నీ ఉత్తరం చూశాక మీ నాన్నగారికి రాయకుండా వాళ్ళు పోలీసులకు రిపోర్టు ఇవ్వరనే అనుకుంటా."

"నాకూ అలాగే అనిపిస్తుంది దొడ్డమ్మా !"

"నువ్వేం ఆలోచనలు పెట్టుకోకు. నిశ్చింతగా ఉండు."

"ఇక్కడి కొచ్చాక నాకు పునర్జన్మ ఎత్తినట్టుంది దొడ్డమ్మా!"

'పునర్జన్మ....ఈ అమాయికురాలి కేం తెలియదు. ఈమెకు సుఖప్రసవమయ్యాక పునర్జన్మ అన్నా అర్థముంది. సుఖప్రసవం....'

సరసమ్మ తుంగమ్మవైపు పరిశీలనగా చూశారు.

"నెలలు నిండాయా తుంగా....?"

"అలాగే అనుకుంటున్నాను దొడ్డమ్మా! ఏమిటో ఇలా బ్రతికున్నాను."

"అలా అనకూడ దమ్మాయ్! ఇప్పుడు నువ్వొక్కదానివే కాదు. నవ్వుతూ సంతోషంగా ఉండాలి."

తుంగమ్మ మొహంలో నల్లటి నీడ కదిలింది.

సరసమ్మ పుస్తకం తీసి రాసుకున్నారు.

పేరు—తుంగమ్మ. వయసు—పద్దెనిమిది—పంథొమ్మిది. దేహస్థితి-ఆరోగ్యవంతురాలు. గర్భిణి. తీసుకొచ్చినవారు-స్వతః వచ్చింది. పూర్తి ఇతిహాసం:—

సరసమ్మ, తుంగమ్మ పూర్వ ఇతిహాస సారాంశాన్ని క్లుప్తంగా రాశారు.

ఆ పేజీ ఎదుట తుంగమ్మ ఇంగ్లీషులో సంతకం పెట్టింది.

ఆమె చెవులను, చేతులను వున్న కొద్దిపాటి నగల లిస్టు రాసుకున్నారు. ఇవన్నీ అయ్యాక సరసమ్మ—

"నువ్వెళ్ళి మొహం కడుక్కుని రా, తుంగా! ఏడ్చింది చాలు" అన్నారు.

తుంగమ్మ వెళ్ళాక జలజ కళ్ళు తెరచింది. అప్పుడే మెలకువ వచ్చిందామెకు. ఆ మధ్యాహ్నపు నిద్రలోనూ ఓ మంచి కల వచ్చింది జలజకు. కలలో అందంగా అలంకరించుకున్న తుంగమ్మనూ, ఎత్తుగా అందంగా ఉన్న ఆమె భర్తనూ చూసింది జలజ. తుంగమ్మకు కడుపు లేదు.

కల అర్థంకాక-ఇదేమి విచిత్రం అనుకుంటూ చూరువేపు చూస్తూ పడుకుంది....

అప్పుడు మధ్యాహ్నం కల్యాణి సొట్టలు పడిన కంచంలో తుంగమ్మకు భోజనం తేవటం గుర్తొచ్చింది. జలజ పక్కకు తిరిగి, దిండుమీద చెంప ఆన్చి, ఒక అరచేతిని ఇంకోదానితో కప్పుకుంటూ నవ్వింది.

"ఏమిటది?" అని అడిగింది తుంగమ్మ. తను చెప్పలేదు. ఎలా చెప్పటం! తుంగమ్మ ఆ స్థితిలో ఉండగా....

జలజ మేలుకోవటాన్ని గమనించారు సరసమ్మ.

"లేచావుటే?"

"ఏం దొడ్డమ్మా?"

"తుంగమ్మ పురిటికి ఏంచేద్దాం?"

జలజ టపీమని లేచి కూర్చుంది. ఆమె మొహం గంభీరంగా వుంది.

"ఆస్పత్రిలో చేరుద్దామా?"

"ఉహుఁ....వద్దు దొడ్డమ్మా!....కానీ వాళ్ళ ఇంట్లోవాళ్ళు...."

"ఈ ఊళ్ళో ఎవరూ లేరు. అయినా నువ్వనేదీ నిజమే. ఇక్కడే మీతోబాటు ఉంటే ఆమె మనసుకూ ధైర్యంగా ఉంటుంది."

"అవును."

"ఎవరు చూసుకుంటారు?"

"భలే అడుగుతున్నారే.... నేను లేనూ?"

"సరే....అలాగేనమ్మా!"

సంతోషంతో జలజ మొహం ఇంతయింది. సంతోషంతో, నవ్వుతూన్న లేడికళ్ళతోనే జలజ మొహం కడుక్కుని లోపలికి వచ్చిన తుంగమ్మను చూపింది.

"తుంగక్కా! ఏది, ఇటివ్వు."

"ఏమిటివ్వ మంటున్నావు?"

"నీ చాకిరీకి దొడ్డమ్మ నన్ను నియమించారు. జీతం ఇవ్వు- ఈ నెల అడ్వాన్సు."

తుంగమ్మ నవ్వింది.

"అయ్యో రామ! నేనే మివ్వగలను? బీదదాన్ని-"

"ఓ...." అంది జలజ, "చూశారా దొడ్డమ్మా, ఎలా మోసం చేద్దామనుకుంటూందో! అంత సులభంగా వదిలిపెడతా ననుకుంటుం దేమో....అదేం కుదరదు. ఇప్పుడే చెబుతున్నా తుంగక్కా, పని పూర్తయ్యాక నా జీతం...."

"అదెలాటి జీతం కావాలో స్పష్టంగా చెప్పకూడదుటే జలజా?" సరసమ్మ సూచించారు. ఆమెకు అదేమిటో అర్థం కాలేదు.

తాను చెబుదా మనుకున్నదాన్ని తల్చుకోగానే జలజ మొహం ఎర్రబడింది. ఏదో ఆట పట్టిస్తూందని తెలుస్తూనే ఉంది.

"చెప్పవే జలజా!"

"తుంగక్క బాబుని చూసుకునే బాధ్యతంతా నాకే ఇవ్వాలి. పేరుకూడా నేనే పెడతా. ఇదే నా జీతం."

సరసమ్మ నవ్వి, "సరేనా తుంగా?" అన్నారు.

తుంగమ్మ 'సరే' అంది.

"ఇలారా."

తనకు మాట్లాడ్డానికి అవకాశం ఇవ్వటం లేదని సరసమ్మమీద కోపం వచ్చింది జలజకు.

"కథ చదివేశావా?" అంది జలజ, తను పడుకున్నప్పుడు తుంగమ్మ పుస్తకం చేతికి తీసుకోవటాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

"లేదు."

"తుంగ కథ చదవలేదు. చెబుతూవుంది" అన్నారు సరసమ్మ.

అరెరె....అనవసరంగా నిద్రపోయిందే, లేకపోతే తనూ వినేదే. ఇక తుంగమ్మ చెప్పేదాకా ఆగాలి. లేవా, దొడ్డమ్మను అడగాలి. తుంగక్క 'అతడు' ఎలా ఉన్నాడో....తను కలలో చూసిన మహానుభావుడిలా....

"అన్నీ రాసుకున్నారా, దొడ్డమ్మా?"

"ఆ....మాటలమల్లి. లే....కళ్లు ఎలా ఉన్నాయో చూసుకో. తాగినవాళ్ళ కళ్ళలా....వెళ్ళు మొహం కడుక్కురా...."

జలజ నవ్వింది. తాగినవాళ్ళెలా ఉంటారో తనకు తెలుసు. రెండుమార్లు పోలీసువాళ్ళు అర్ధరాత్రి, తాగి మైకంలో వాగుతున్న అమ్మాయిల్ని తీసుకొచ్చి అభయ ధామంలో వదిలిపెట్టడం ఎరుగును తను. మరుసటిరోజు, ఆ అమ్మాయిలు లేకుండాచూసి, తను, దొడ్డమ్మ గదిలో మిగతా పిల్లల ఎదుట, తాగినదానిలా నటిస్తూ అందర్నీ నవ్విస్తూ వచ్చింది.

సరసమ్మ తామూ నవ్వేస్తూ 'అలా వెక్కిరించరాదు' అని వారించాలన్నసంగతే మరచిపోయేవారు.

జలజ బయటకు వెళ్ళగానే సరసమ్మ—

"మీ నాన్నగారికి ఉత్తరం రాయమ్మా! నేనూ రాస్తాను. రెండిటినీ పంపిద్దాం" అన్నారు.

"ఊఁ...." అంది తుంగమ్మ.

"ఇవాళ పోస్టుకు ఆలస్యమయింది. రేపు వెడుతుంది."

తుంగమ్మ అభయ ధామపు ముద్రవున్న కాగితాన్ని తీసుకుని రాయసాగింది. మొదట తననే గమనిస్తున్న మేస్టారి ఎదుట పరీక్ష పేపర్ రాస్తున్నట్టు కలవరపడింది. కాని రాస్తున్నకొద్దీ, మనసులోని పదాలు వాక్యాల రూపంలో కాగితంమీద పరచుకొంటున్నకొద్దీ తుంగమ్మ కళ్ళముందునుండి సరసమ్మ మాయమయ్యారు. ఆమె కళ్ళ ముందు ఒకే ఆకారం కనిపిస్తూంది-దుఃఖభారంతో వడిలిపోయిన తన తండ్రిది. ఆయన, తనముందు వెక్కి-వెక్కి ఏడుస్తూ, తనను ఆశీర్వ

దించిన రోజునుండి ఇవ్వాళ్టివరకూ జరిగిన సంగతులన్నీ రాసింది తుంగమ్మ. ఆమె వ్రాత అందంగా లేదు. కన్నీటితో కొన్నిచోట్ల మరక లయ్యాయి.

తుంగమ్మ రాయటం పూర్తయ్యేసరికి సరసమ్మ ఉత్తరం కూడా సిద్ధంగా ఉంది.

"ఇటివ్వు" తుంగమ్మ ఉత్తరం తీసుకుని సరసమ్మ చదువుతూ ఉంటే మళ్లీ మాస్టారి ఎదుట ఉన్న విద్యార్థినిలా అయ్యింది తుంగమ్మ.

"సరే" అని తలాడించారు సరసమ్మ. తుంగమ్మ నెమ్మదిగా ఊపిరి పీల్చుకుంది. కానీ సరసమ్మ కళ్ళు తడిగా ఉండటం తుంగమ్మ గమనించలేదు.

"దొడ్డమ్మా, దొడ్డమ్మా!" అంటూ కంగారుగా జలజ లోపలికి వచ్చింది. "దొడ్డమ్మా! మొన్న రాలా అరవవాళ్ల అమ్మాయి! కొబ్బరి దొంగిలించిందని, నోట్లో గుడ్డలు కుక్కి వంటగదిలో పడేసి కొడుతున్నార్ట, మీకు తెలియకూడదని."

తుంగమ్మ ఒళ్ళు జలదరించింది.

సరసమ్మ ఆత్రంగా వంటగదివేపు వెళ్లారు.

"అయ్యో పాపం! ఎన్ని దెబ్బలు కొట్టారో" అంటూ జాలి చూపింది తుంగమ్మ.

"పాపమా? భలే అన్నావులే. ఉట్టి దొంగమొహం. ఇవ్వాళ కొబ్బరి తింటే, రేపు మనల్నే మింగేస్తుంది. బాగా తగలాల్సిందే!"

ఈ మాటన్నది జలజేనా అని ఆశ్చర్యంతో చూసింది ఆమె. జలజ ఆమెకు దగ్గరగా వచ్చి——

"నువ్వు సరే, నా కామాత్రం తెలీదూ? ఆకలేసిందేమో, ఏమీ దొరక్క కొబ్బరిమీద పడింది. వాళ్ళను ఆపుదామనే వెళ్ళానక్కడికి. కానీ నన్ను తరిమేశారు!..."

జలజ చెడ్డపిల్లవటానికి వీలే లేదు. ముట్టుకుంటే ముడుచుకునే మృదుహృదయం ఆమెది.

తుంగమ్మ జలజ చేతివ్రేళ్ళను మృదువుగా పట్టుకుని తన హృదయంమీద పెట్టుకుంది.

జలజకు, తుంగమ్మ ప్రియుని విషయం అడిగి, సరదాగా ఏడిపించాలనిపించింది. కానీ తుంగమ్మ నొచ్చుకుంటుందేమోనని ఆ ఊహ వదిలిపెట్టింది.

మూగపిల్ల కల్యాణి తుంగమ్మకు భోజనం తెచ్చిన కంచం కూడా గుర్తొచ్చింది. జలజ తుంగమ్మను తదేకంగా చూస్తూ "అక్కా, అక్కా" అంది ఆప్యాయంగా.

సాయంత్రమయింది. చీకటి పడింది. మళ్లీ ప్రార్థన. తరువాత భోజనం.

జలజకేనా జ్వరం వచ్చింది అన్నంత చురుగ్గా పనిచేస్తూంది. తనకూ, తుంగమ్మకూ పక్కలువేస్తూ అంది-

"రేపు మనల్ని బదిలీ చేస్తారు"

ఎక్కడికి అని అడగాలనుకున్న తుంగమ్మ జవాబు ఊహించి ఊరుకుంది.

ఇద్దరూ పడుకున్నాక, "రేపు లలితను పరిచయం చేస్తాను. నా స్నేహితురాలు. కానీ కొత్తవారంటే సంకోచం. అందుకే ఇక్కడికి రాలా" అంది జలజ.

"ఉహూఁ...."

జలజ దృష్టి పైన వెతుకుతూ ఒకచోట ఆగింది. తుంగమ్మ కూడా అటువేపే చూస్తోంది.

జలజ చిరునవ్వుతో "తుంగక్కా, ఈ గది అద్దెక్కూడా ఇచ్చాం తెలుసా?"

"తెలుసులే."

జలజ ఆశ్చర్యంతో—

"అరె, నీకెలా తెలుసు?" అంది.

తుంగమ్మ నవ్వుతూ జలజవేపు చూసింది. తరువాత పైన జలజ చూస్తున్నవేపు చూసింది.

జలజకు సంతోషమూ అయింది, నిరాశా కలిగింది—

"ఓ.... నీకో తమాషా చూపిద్దామని నేననుకుంటూంటే—"

ఆడ పిచుక, పూలుబంతిలాగా మేకుమీద కూర్చుంది.

* * *

సరసమ్మ ఆఫీసుగది ప్రక్కనున్నగది సామాన్యంగా ఖాళీ గానే ఉంటూఉండేది. అందులో అల్లిన చాపలు, గుడ్డలు, సంగీతం క్లాసులో వాడుకునే హార్మోనియం, తంబూరా పెట్టె - ఇవన్నీ ఉంచే వారు. గది కాస్త విశాలంగానే ఉంది. ఆఫీసుగదిలోలాగా ఇక్కడ కూడా అలాటిదే కిటికీ, ఆ కిటికీలోనుండి కుడివేపుకు చూస్తే విశాల మయిన ఖాళీస్థలం.

కిటికీదగ్గర నుంచుని తుంగమ్మ నిర్వికారచిత్తంతో చూస్తూంది.

"బాగుంది కదూ చూట్టానికి?" జలజ అంది.

"ఊఁ...."

"కానీ, నేల ఇపుడేమో బాగానే ఉంది. వర్షంవస్తే యిక సము ద్రంలా ఉంటుంది."

తుంగమ్మలాగే జలజకూడా సముద్రం చూసి ఎరగదు. కాని, విశాలమయిన జలాశయాన్ని సముద్రమని ఊహించుకుంటుంది.

"ఓ సారేమయిందో తెలుసా?"

"ఊఁ...."

"నిరుడు ఓ రాత్రి పోలీసువాళ్ళు ఓ అమ్మాయిని తీసుకొచ్చారు. అర్ధరాత్రి రోడ్డులో తిరుగుతూందట. వృత్తిలో వున్న పిల్లనుకో. చూడ్డానికి ఎలా ఉండేదని! మొహమంతా ఉబ్బరించి....అబ్బ....రంగు మాత్రం తెలుపు."

"ఏమయింది ఆ పిల్లకు?"

"అదే....ఆ రాత్రి వచ్చినప్పటినుండి సర్కస్‌లో పులిలాగా గుర్‌గుర్ మంటూనే ఉంది. పలకరిస్తే మీదపడేలా వుంది. ఎవరూ ఆ పిల్ల జోలికి వెళ్ళకండి అన్నారు దొడ్డమ్మ. సరే...అని ఊరుకున్నాం. కాని, రాత్రి ఆ పిల్ల లెట్రిన్‌గోడ ఎక్కి కిందికి దూకేసింది. మా కెవ రికీ మెలుకువ రానేలా. తప్పించుకుని ఆ పిల్ల-అదిగో కనిపిస్తూందే, ఆ దారినే పరిగెత్తింది. వర్షంవచ్చి వారంరోజులే అయిం దప్పటికి. ఆ పిల్ల దారితెలియక ఆ నీళ్ళల్లో పడిపోయింది. 'అయ్యయ్యో! చచ్చా నర్రోయ్' అని కేక పెట్టిందట. రాత్రిపూట దొడ్డమ్మ చెవులు పాము చెవులే అనుకో. లేచి లాంతరు తీసుకుని అందరూ ఉన్నారా అని

చూసుకు వచ్చారు. ఆ పిల్ల లేదు. సరే. జరిగిందేమిటో దొడ్డమ్మకు అర్థమయింది. నన్నూ, లలితనూ తీసుకుని తలుపు తెరచి, బయటినుండి తాళం వేసుకుని, బయల్దేరారు. అక్కడో ఇల్లుందిగా, వాళ్లనూ లేపాం. మంచివాళ్లు పాపం...."

మొదట అభయ ధామాన్ని బడితో పోల్చుకుంది తుంగమ్మ. ఆ బడి జైలుగా మారింది. జైలు అల్లరి పిల్లలతో నివసిస్తున్న ఓ బీదతల్లి ఇల్లుగా మారింది. చిత్రవిచిత్రంగా ఉంది జలజ చెబుతున్న కథ.

"ఊకొట్టటం లేదేం అక్కా? వింటున్నావా లేవా?"

"వింటున్నా.... చెప్పు...."

"ఆ ప్రవేశం లోతుగా లేదనుకో. ఆ పిల్ల బయటపడింది. అంతే. వాళ్ళంతా బురద. ఇక నోరెత్తకుండా మాతో వచ్చింది. ఒక చేతిని లలిత గట్టిగా పట్టుకుంది. లలిత చేతిపట్టునుండి ఎవరూ తప్పించుకోలేరు. అదెలా వుంటుందో తెలుసా?"

"ఇప్పుడా పిల్ల ఎక్కడుంది? ఇక్కడే ఉందా?"

బదులు చెప్పడానికి ఉత్సాహం లేకపోయింది జలజకు. అయినా అంది-

"ఏదో జబ్బుందట ఆ పిల్లకు. దొడ్డమ్మ ఆస్పత్రికి తీసుకెళ్ళారు. అక్కణ్ణించి తప్పించుకుని పారిపోయింది."

ఎక్కడికి పారిపోయిందని అడక్కుండానే అర్థం చేసుకుంది తుంగమ్మ.

"ఇక వదిలేయ్ ఆ సంగతి" అంది జలజ.

తరువాత మాట్లాడ్టానికి మరోసంగతి సిద్ధంగానే ఉంది. ఆరు నెలల క్రిందట ఆ గదిలో ఒకమ్మాయి పురుడు పోసుకుంది. ఓ నెల లోపలే ఒకతను వచ్చి, తల్లి-పిల్లలను తనతో పంపమన్నాడు. ఆ అమ్మాయికూడా "పంపించండి దొడ్డమ్మా, వెళ్ళొస్తాను" అంది. దొడ్డమ్మ కాదనలేదు.

కాని ఇలాటి సంగతులు తుంగమ్మకు చెప్పటం మంచిదేనా అన్న ఆలోచన వచ్చింది జలజకు.

ఉదయమే దొడ్డమ్మ జలజని పిలిచి చెప్పారు.

"తుంగమ్మని జాగ్రత్తగా చూసుకో. మంచిపిల్ల. ఆమె మనసు నొప్పించే సంగతులేం చెప్పక."

పురుడు పోసుకున్న అమ్మాయిగురించి చెబితే తుంగమ్మ నొచ్చుకుంటుందన్న ఊహతో ఆ సంగతి చెప్పకూడదని తీర్మానించుకుంది జలజ.

జలజ బయటికి వెళ్ళి, ఎండలో వేసిన పల్చని పడక తెచ్చి చాప మీద వేసింది. అది ముందురోజు జలజ వేసుకున్న పడక. దొడ్డమ్మ గదిలోకి వెళ్లి ఉతికిన దుప్పటి తెచ్చి పక్కమీద వేసింది.

"అక్కా, ఇవ్వాళ్టినుండి ఇది నీది."

జలజ చేస్తున్న పనంతా మౌనంగా చూస్తున్న తుంగమ్మ—

"మరి నీకో?..." అంది.

"నాకు చాప ఉంది. దానిమీద నా పాత చీరెలు రెండు మడత పెట్టి వేసుకుంటాను, అందరిలాగా...."

తుంగమ్మకు అర్థం కాలేదు.

"ఈ అక్కకేం తెలియదు" అంది జలజ, బుంగమూతిపెట్టి. "మే మెవరం పడకమీద పడుకోం. జబ్బుతో ఉన్నవారికి, కడుపుతో ఉన్నవారికిమాత్రమే ఈ సౌకర్యం."

తను గర్భవతినని తనకు లభిస్తున్న సానుభూతిని చూసి తుంగమ్మకు సంకోచం కలిగింది.

....టీచర్ రాగానే జలజ పెన్సిలూ-పుస్తకం తీసుకుని క్లాసుకు వెళ్ళింది.

తుంగమ్మని ఆశ్చర్యపరచిన మరో సంగతి భోజనాల దగ్గర జరిగింది.

ఒక్కొక్కరూ తమ తమ కంచాలు తెచ్చుకొని వరుసగా కూర్చున్నారు. జలజ తనది, తుంగమ్మది కంచాలు కడిగి పట్టుకొచ్చింది. తుంగమ్మకు కనిపించకుండా నవ్వుకుంటూ, కొద్దిగా సొట్టలు పడ్డ కంచాన్నే ఆమె ముందు పెట్టింది.

ఈ రోజు వంటబాధ్యత వహించిన పిల్లలజట్టుకు నాయకురాలు

లలిత. ఆమె కొంగు నడుముకు బిగించి గరిట చేతిలో పట్టుకుని సేనాని లాగా నడచివచ్చింది. కానీ ఎప్పటిలా అందరూ ఆమెవేపు చూట్టం లేదు. అందరి కళ్లూ తుంగమ్మ మీ దున్నాయి.

గొంతు తగ్గించి జలజ అంది-

"ఇవ్వాళ పరమాన్నం వండారక్కా!"

"పరమాన్నమా! ఎందుకూ, ఇవ్వాళ పండగా?"

"ఇదో ప్రత్యేకమయిన పండగలే. అభయ ధామంలో మాత్రమే జరుపుకుంటాం."

"అలాగా!"

"ఆఁ....అలాగే." వెక్కిరించింది జలజ. "నీ వల్ల మా అందరి నోటికీ తీపి దొరుకుతూంది. అందుకే అందరూ నీ వేపే చూస్తున్నారలా."

"నా వల్లనా?"

"అవును మరి. కొత్తవాళ్లొచ్చినప్పుడల్లా ఇదే పద్ధతి. వచ్చినామె మాతో పంక్తిలో కూర్చున్నరోజున దొడ్డమ్మ పరమాన్నం వండిస్తారు. దాంతోబాటు ఓ లెక్చర్ ఇస్తారు. అదిగో....వచ్చారు."

సరసమ్మ చిరునవ్వు నవ్వుతూ అమ్మాయిలు భోంచేస్తున్న వేపు నడచి వచ్చారు.

పండగ భోజనం...కూర, కోసంబరి-ఏదీ లేదు. మొదటిమాటు కంచంలో రెండు గరిటెలు పరమాన్నం వడ్డించారు.

పిల్లలు కంచం వేపోసారి, దొడ్డమ్మ మొహంవేపోసారి చూస్తున్నారు. 'దొడ్డమ్మ భలే ఆలస్యం' అనికూడా గొణుక్కుంటు న్నారు.

జలజ అంది-

"ఇక మొదలు పెడతారు చూడు-'పిల్లలూ ఇవ్వాళ్ళ మనకంతా ఆనందకరమయిన రోజు'...."

జలజ అన్నట్టుగానే సరసమ్మ ప్రారంభించారు-

"పిల్లలూ, ఇవ్వాళ మనకందరికీ చాలా ఆనందకరమయిన

రోజు....." గంభీరంగా ఉన్న ఆమె కంఠంనుండి అనర్గళంగా ప్రవహిస్తున్నాయి అలవాటుపడ్డ మాటలు.

"మన మధ్యకు ఇవ్వాళ మరో సోదరి వచ్చింది. ఆమె పేరు తుంగమ్మ. మీరంతా ఆమెను చూశారు. అభయాన్ని యాచించ వచ్చిన ఆమెకు ప్రేమతో స్వాగతం చెబుదాం. ఆమెకూ, మనకూ దయామయుడయిన భగవంతుడు మంచిని చెయ్యాలని ప్రార్థిద్దాం."

జలజ మౌనంగా ఉంది. తుంగమ్మకు ఆ ఉపన్యాసం విని దుఃఖం ముంచుకు వచ్చింది. అందరూ చేతులు జోడించి, కళ్ళుమూసి తెరిచేలోపల, ప్రార్థన ముగించారు. తుంగమ్మ మాత్రమే తడబాటుతో ఇబ్బంది పడింది. ఆ ప్రార్థన ఎప్పుడో అయిపోయిన అంశంలాగా ప్రతి ఒక్కరూ పరమాన్నం రుచి చూడ్డంలో నిమగ్నులయ్యారు.

సరసమ్మ చిన్నపళ్లెంలో కాస్త పరమాన్నం తెప్పించుకుని, తుంగమ్మ వేపు చూసి చిరునవ్వు నవ్వి, చెంచాతో పాయసం తినసాగారు.

భోంచేస్తూ చిన్నగా మాట్లాడుకుంటున్నారు అందరూ.

"ఈ ఉపన్యాసం నేను వింటున్నది డెబ్భయ్యవసారి అక్కా!"

"నిజంగానా?"

"ఊఁ....పేరు మారుస్తారు ప్రతిసారీ. అంతే. ఇంకేం తేడా ఉండదు. ఈ నాలుగేళ్లలో మొత్తం డెబ్భయ్‌మంది వచ్చారన్నమాట. ఇప్పుడున్నవారు నీతో కలపి ముప్ఫయ్యొక్కమంది."

భోజనం చెయ్యలేకపోయింది తుంగమ్మ. ఏమీ సహించలేదామెకు. సరసమ్మ ఆ సంగతి గ్రహించారు. మొదటిసారి పంక్తిలో కూచుని భోజనం చేసేటప్పుడు కొంతమంది కొత్తవాళ్ళు అనుభవించే బాధ ఆమెకు తెలుసు. ఆమె తుంగమ్మ దగ్గరగా వచ్చి—

"ఏం తుంగా, అన్నం సహించటం లేదా?" అన్నారు.

"సయిస్తోంది. కానీ ఆకలిగా లేదు."

"మజ్జిగా అన్నం కాస్త తిను."

"ఊఁ...."

పద్దక్క పెళ్ళిభోజనం-అప్పుడు నూరారుమంది భోజనాలకు

కూర్చున్నారు. వాళ్ళంతా గృహస్థులు. సద్గృహిణులు. నవ్వుల సంరంభంలో పెళ్ళిభోజనాలు పూర్తిచేశారు. అప్పుడూ వచ్చినవాళ్ళ దృష్టిలో పద్దక్క, తనూ, తమ్ముడూ తల్లిలేని అనాథలు. తండ్రి పేదవాడు- నిజమే. కానీ మొదటికూతురి పెళ్ళికి శక్తికి మించి ధారాళంగానే ఖర్చు పెట్టాడు. భోజనంలో ఎక్కడా లోటు జరగలేదు.

ఆ తర్వాత మూడేళ్ళకు తన పెళ్ళి ఊహాచిత్రం అస్పష్టంగా కనిపించింది. పద్దక్క పెళ్ళి జరిగినంత సులువుగా తన పెళ్లి జరగదని తెలుసు. అయినా ఇక పెళ్ళి కావలసిన ఆడపిల్లలు లేరన్న కారణం చేత తండ్రి అప్పుతెచ్చి తనపెళ్ళిని వీలయినంత బాగానే చేసేవాడు. నారాయణమూర్తికి తను తనను అర్పించుకున్నాక తన పెళ్లిని గురించి కలలు కంటూవుండేది తుంగమ్మ. తన పెళ్లిభోజనం....

ఇప్పుడు ఇక్కడ కూర్చుందామె-అభయ ధామపు నివాసులతో.

దొడ్డమ్మ అన్నారు-"ఇవ్వాళ మనకంతా చాలా ఆనందకరమయిన రోజు. .."

దొడ్డమ్మ మంచివారే కానీ, అలా అనటం బాగాలేదు. ఎందుకు సంతోషం? దేనికోసం? లేదా-ఆమె అన్నదే సరయినదేమో... నుయ్యో గొయ్యో చూసుకోవాల్సిన తను దేవుడి దయవల్లనో అభయ ధామాన్ని చేరుకుంది కదా....

మజ్జిగ వచ్చింది. ఉట్టి తెల్లని నీరు....ఎవరో తన కంచాన్ని లాక్కున్నారు. జలజ కంచాన్నెత్తి తన కంచంలో పడేసుకుంటూ—

"లే అక్కా....లే. చేయి కడుక్కుందాం"

"ఊహుఁ....నా కంచం ఇలా ఇచ్చెయ్."

"గొడవ చెయ్యక పదక్కా!"

"వద్దు జలజా! ..నా కంచం నేను కడగాలి."

"ఇది మరీ బాగుంది. నిన్న దొడ్డమ్మ చెప్పలా, నేను నీ చాకిరీ చెయ్యాలనీ?"

తుంగమ్మ లేచి నుంచుంటూ అంది:

"చాకిరి! అలా మాట్లాడకే జలజా!"

జలజ ఊరుకుంది. దొడ్డమ్మ ముందుగానే చెప్పారు, ఆమె మనసు నొప్పించేమాట మాట్లాడవద్దని. జలజకు భయం వేసింది. తను ఇప్పటికే తుంగమ్మ మనసు నొప్పించింది.

మళ్ళీ గది.

మాపల్లె ఇంట్లో ఆ గృహిణి, భోంచేశాక, తాంబూలం వేసుకొనేది. ఆమె తుంగమ్మనూ వేసుకోమంది నాలుగయిదుమార్లు. కాని దుఃఖితురాలయిన తుంగమ్మకు ఏమీ అక్కర్లేకపోయింది. ఆమె, వారు బలవంతం చేసినపుడు ఓ వక్కపలుకు నోట్లో వేసుకునేది.

ఇక్కడ అలాటి ఇబ్బందులేం లేవు.

జలజను సరసమ్మ పిలిచారు.

తుంగమ్మ దిండును గోడవేపుకుని ఆనుకుని కూర్చుంది. చూరువేపు చూపింది. అక్కడెక్కడా మేకులు లేవు. కనుక ఈ గదిని అద్దెకిచ్చే ప్రశ్నే లేదు.

తుంగమ్మకు నిరాశ కలిగింది. చీకటిలో ఏ ఆడపిచుకా ఇక్కడికి రాదు. ఆ పిచుక-కాపురాన్నిగురించి తను ఆలోచించటం మంచిది కాదు, మరిచిపోవడమే న్యాయం అనుకుంది తుంగమ్మ.

గబగబా అడుగులు వేస్తూ జలజ లోపలికి వచ్చింది.

"తుంగక్కా! లలితా, నేనూ ఇవ్వాళ మార్కెట్‌కి వెడతాం."

మార్కెట్‌కా! తాళంకప్ప వేసిన తలుపులు తెరుచుకుని బజారుకు!

"ఏం అలా చూస్తావ్? ఆశ్చర్యంగా ఉందా తుంగక్కా?"

"మీ రెవ్వరూ ఈ ఇల్లు దాటి వెళ్లరనుకున్నా."

"నేనూ, లలితా గొప్పవాళ్లంలే."

"దొడ్డమ్మ వస్తారా మీతో?"

"ఊహుఁ! మేము ఇద్దరమే... "

తుంగమ్మ వూరుకుంది. ఆ మౌనం జలజకు నచ్చలేదు. అసహనంతో, "ఎందుకు వెడుతున్నారని అడక్కూడదా తుంగక్కా?" అంది.

తుంగమ్మ నవ్వింది. "సరే, అడుగుతా. ఎందుకు వెడుతున్నారు?"

"ఇక ఓ వారం పూర్తిగా లలితదే 'నలపాకం'. కూరగాయలు తేవాలిగా, రెండు మూడు రోజులకు సరిపడేలా తెచ్చిపడేస్తాం ఒక్కసారే."

జలజా లలితలకు ఎవరి భయమూ లేదు. వాళ్ళలా బయటికి వెళ్ళి రాగలరు. కాని తన కా స్వాతంత్ర్యం లేదు. క్షమించరాని నేరం చేసినదానిలా కడుపు దాచుకోవాలి అందరినుండి. హంతకురాలిలా జనాలదృష్టినుండి తొలగి దూరంగా ఉండాలి.

జలజ తన అక్కదగ్గర కూర్చుంది.

"ఇక రెండు-మూడు నెలలయ్యాక నువ్వూ నేనూ జతగా మార్కెట్‌కి వెళ్లివద్దాం. ఒక వారమంతా మన మిద్దరమే వంట బాధ్యత తీసుకుంటే సరి."

....తన పురిటి తరువాత సంగతి.

"ఏం? నమ్మకం కలగటంలేదా నీకు? దొడ్డమ్మ వదనరు నిన్ను. కావాలంటే పందెం కాస్తాను. వేరే ఎవరికీ దొరకనంత తొందరగా బయటికి వెళ్లివచ్చే స్వతంత్రం దొరుకుతుంది నీకు."

"నువ్వు చాలా మంచిదానివి జలజా!"

"అయ్యో! నీ కేదో పిచ్చి. నేను మంచిదాన్నయితే ఇక్కడెందు కుండేదాన్ని చెప్పు?"

మంచివారు ఎవరూ ఇక్కడ—ఈ అభయ ధామంలో ఉండాల్సిన పనిలేదు. సత్యమే చెప్పింది జలజ.

తుంగమ్మ మొహం నల్లబడింది.

జలజకు తన తప్పు అర్థమయింది.

"నాకు బుద్ధిలే దక్కా! నన్నుగురించి అలా అన్నా నక్కా! అంతే నక్కా, ఏమీ అనుకో కక్కా" అని ప్రాధేయపడసాగింది నొచ్చుకుంటూ.

జలజ మొహం చూసి, తన దుఃఖాన్ని మరచి, స్నేహితురాలి కోసం చిరునవ్వు నవ్వింది తుంగమ్మ.

"నువ్వన్న దాంట్లో తప్పేముంది? ఉన్నమాటేగా?"

లలిత లోపలకు రావటంతో మాట మార్చటం సులభ మయింది.

లలిత చామన చాయ. ఎత్తయిన విగ్రహం. ఆరోగ్యంగా, దృఢంగా వున్న శరీరం, విశాలమయిన మొహం. చూసినవాళ్ళు మొదట విస్తుపోయి, తరువాత మెచ్చుకునేలాటి రూపం.

ఆమె తొడుక్కున్న మాసిన రవికెగాని, కట్టుకున్న పాత చీరె గాని ఆమెలోని ఆకర్షణను దాచటం లేదు.

"చూశావా తుంగక్కా, ఎలా ఉంటుందో మా లలిత!"

"రండి" అంది తుంగమ్మ.

"ఓ....రండి! గౌరవపు బహువచనం! అక్కా, ఇప్పుడే చెబుతున్నా- ఈ లలిత మాయలమారి. దగ్గర జేర్చకూ...." అంది జలజ.

లలిత మోహకంగా నవ్వింది.

"రావే జలజా, ఆలస్యమవుతూంది. మళ్లీ ఐదుగంటల్లోపల వాపసు అవాలి."

జలజ హడావుడిగా లేచి, అద్దంలో ఓసారి మొహం చూసుకుని, 'సరిగ్గా ఉంది' అనుకుంది.

ఆమె లలిత పక్కన నుంచుంటే చిన్నగా కనిపిస్తూంది, మరీ చిన్నగా.

తుంగమ్మ ఆలోచనను ఇట్టే పసికట్టింది జలజ.

"ఇప్పుడే జ్వరపడి లేచానుగదా, అందుకని అలా వున్నానంతే. లేకపోతే నేనూ కొంచెం భారీగానే ఉంటాన్లే...."

తుంగమ్మ నవ్వింది.

"కాదంటావా?"

"ఓహో...."

"కానీ, ఓ విషయం తుంగక్కా! ఈ లలిత నాతో ఉంటే దేనికీ భయపడక్ఖర్లా. ఈ దేవి, మా దొడ్డమ్మ మాటల్లో చెప్పాలంటే, అభయ

సాక్షాత్కారం. ఈమెతో ఉన్నప్పుడు నా ఒంటిమీద చెయ్యి వెయ్యటానికి ఎవ్వరికైనా ఎన్ని గుండె లుండాలి!"

"ఇక చాలించి రావే" అంటూ జలజను లాక్కుపోయింది లలిత.

ఎండ మండిపోతూంది. కళ్లు మూసుకుని నిద్రపోవటానికి ప్రయత్నించింది తుంగమ్మ. చాలాసేపు నిద్రపట్టలేదు. తర్వాత కొద్దిగా మగత.

ఏవో కంఠాలు వినిపిస్తూనే ఉన్నాయి.

ఎవరో-దొడ్డమ్మ కావచ్చు-తొంగిచూసి, తలుపు ముందుకు లాక్కుని వెళ్లినట్లయింది.

బయట తలుపు కొడుతున్న చప్పుడు.

తలుపు దగ్గరగా ఓ అమ్మాయి కంఠం- "మగ్గం మేష్టారొచ్చారు, రండర్రా" అని అరిచింది.

అదో, మొగో తెలియదు....దారాన్ని గుడ్డగా మార్చటం ఎలాగో నేర్పేవా రొకరు.

మళ్లీ తలుపు చప్పుడు.

ఎవరొచ్చారో!

"సరిగమ పదనిస..." సంగీతపాఠం చెబుతున్నా రెవరో.

అయితే చప్పుడు కాకుండా హార్మోనియం పెట్టె తీసుకు వెళ్లుండాలి ఎవరో.

"గాడిదలు....ధూత్!" ఎవరో తిడుతున్నారు. ఎవరిగొంతు అది? దొడ్డమ్మ అలా తిట్టరు. సంగీతపు మేడం అయ్యుండాలి.

"నితల్....నితల్...." మగ్గం చప్పుడు చేస్తోంది. "నితల్....నితల్...."

"గాడిదలు" అన్న తిట్టుకు తగ్గట్టుగానే పాడుతున్నారు పిల్లలు.

తుంగమ్మకు నిద్రపట్టింది.

....చాలాసేపటి తర్వాత మేలుకుంది తుంగమ్మ. కళ్ళు మండుతున్నాయి. లేవాలనిపించటం లేదు.

ఎండ వేడి తగ్గి సాయంకాలం అయినట్టుంది.

ఇక లేద్దాం అనుకుంటూండగానే జలజా లలితల కంఠాలు విని పించాయి ఆఫీసు గదిలోనుంచి.

మరో రెండు నిమిషాల్లో జలజ లోపలికొచ్చింది. తుంగమ్మ లేచి కూర్చుంది.

జలజ, తన ఒడివేపు చూపిస్తూ, "అక్కా, నేనేం తెచ్చానో చెప్పుకో" అని ప్రశ్న వేసింది.

"నాకేం తెలుసు!"

"నీకోసం జలజ ఏమీ తేదా అయితే?"

ఇంతకు మునుపు ఇవే మాటల్ని తనెక్కడో విన్నట్టు అని పించింది. ఎవరన్నారు ఆ మాటలు? తల్లి కాదు. తండ్రి? పద్దక్క? తమ్ముడు? నారాయణమూర్తి? ఎవరు?—ఎవరని ఉంటారలా?

ఊహుఁ....ఎవ్వరూ అలా అనలేదు. తన బ్రతుకులో ఇదే మొదటిసారి, ఇలాటిమాట వినటం.

"పోక్కా....నువ్వేం మాట్లాట్టంలా...."

"సరే....చూపించు, అక్కకోసం ఏం తెచ్చావో!"

జలజ కాయితం పొట్లం ఒడిలోనుంచి తీసింది బయటికి. పచ్చటి కాయితంలో రంగురంగుల పిప్పర్‌మెంట్ బిళ్ల లున్నాయి.

జలజ పసిపిల్లలా ఉత్సాహంగా తను అన్నిబిళ్లల్ని మార్కెట్ బస్టాండులో అమ్ముతున్న కుర్రాడిదగ్గర్నుండి చాకచక్యంగా కొనుక్కు వచ్చిన సంగతి వర్ణిస్తూంది.

"ఇన్ని బిళ్లలకూ ఒక్క అణా ఇచ్చానక్కా! అంతే. ఒక్క అణాకు నలభయ్. నా దగ్గరున్నది ఒక్క అణా. అది ఇచ్చేసి తీసు కున్నా. అభయ ధామానికి ఎ తినుబండారం తెచ్చినా అందరూ పంచు కోవాలి. ఇవ్వాళేం చేస్తానో తెలుసా? దొడ్డమ్మకు రెండిస్తాను. గుడ్డి పిల్ల సుంద్రాకీ, లలితకీ, నాకూ రెండు రెండు. ఇరవయ్యేడుగురు పిల్లలకి ఒక్కోటి. మిగతా ఐదూ నీకు."

ఆ మాటల్లోని తియ్యదనంకన్నా బిళ్లలు రుచిగా వుండటం అసాధ్య మనిపించింది తుంగమ్మకు.

"ఉహుఁ....నే నొప్పుకోను. మా అక్కయ్యకు ఐదు బిళ్ళలు ....ఐదు."

* * *

పురిటి నొప్పులతో బాధపడుతూంది తుంగమ్మ. ఆ బాధ ప్రాణం పోతున్న జీవి బాధ తట్టుకోలేక చేస్తున్న ఆర్తనాదంలా ఉంది. ఆమె దిండుకొసని గట్టిగా పట్టుకుని పొర్లుతూ మూలుగుతూంది. అక్క డెవరికీ ఆ దృశ్యం కొత్తది కాదు. ఆ గదిలో ఇదే మొదటి కాన్పు కాదు.

ఐనా అభయ ధామపు వాతావరణం రోజూలా లేదు. ఒక రక మయిన మౌనం. అవ్యక్తమయిన కాతర్యం చోటు చేసుకుం దక్కడ.

మగవాళ్లులేని భవనమది. గది తలుపులు ముందుకు జేరవేసి జలజ, లలిత, సావిత్రుల సాయంతో సరసమ్మ తుంగమ్మ సేవకు సిద్ధంగా నుంచున్నారు.

అభయ ధామంలో అడుగుపెట్టిన పదో రోజున తుంగమ్మ చావుతో పోరాటం సాగించింది.

అది పగటిపూట. టీచర్ రాజమ్మ వచ్చింది. లోపలికి తొంగి చూసి, అంతా సరిగ్గానే వుంది అన్నట్టు తలవూసి, క్లాసు జరపాల్సిన వేపు వెళ్ళిపోయింది. పురిటిగదిలో వున్న పిల్లలు, గుడ్డిపిల్ల, మూగ పిల్ల తప్పించి అందరూ క్లాసుకు వచ్చారు. రాజమ్మ విడివిడిగా ఎవరికి చెప్పాల్సిన అక్షరాలు-పదాలు వాళ్ళకి బోధిస్తూంది. కళ్ళు అందరివీ రాజమ్మమీదే వున్నా, చెవులుమాత్రం తుంగమ్మ గదిలోంచి వస్తున్న శబ్దమే వింటున్నాయి. లోపలున్న ముగ్గురు అమ్మాయిల్లో ఏ ఒక్కరు బయటికి వచ్చినా క్లాసంతా అటే చూసేది.

క్లాసు ఆపేసి వెళ్ళిపోవచ్చు గదా అని ఆనందించింది రాజమ్మ. కాని దానిని పైకి చూపించలేదు. మొహం ముడుచుకుని పుస్తకాలను చేతిలోకి తీసుకుని—

"ఇవ్వాల్టికి చాలు" అంది.

స్విచ్ నొక్కితే వెలుగువచ్చేకన్నా వేగంగా క్లాసు ఖాళీ అయింది.

తుంగమ్మ ఉన్న గదిలోకి వెళ్ళి నుంచుని రాజమ్మ. రెండు నిమిషా లాగి, "నేను వెడుతున్నా" అంది.

"వెడతారా?"

"ఊఁ...."

కాని ఆవిడ వెళ్ళే సూచనలేం కనిపించలేదు. ఏదో ఒకటి అనకుండా ఆవిడ వెడుతుందని సరసమ్మ అనుకోనూ లేదు.

"డాక్టర్ని పిలిపించక్కర్లే దంటారా?"

"పిలిపిద్దాం తర్వాత."

"ఆస్పత్రిలో...."

"ఆమె ఇక్కడ వుండటమే ఇష్టపడింది."

నిజంగానే తుంగమ్మకు ఆస్పత్రికి వెళ్ళాలనిలేదు. అక్కడెవరైనా తనను గుర్తిస్తారేమో నన్న భయం.

"సరే, అయితే."

'ఇంకా నుంచున్నారేం' అన్నట్టు విసుగ్గా ముగ్గురు అమ్మాయిలూ ఆమెవేపు చూశారు. రాజమ్మ ఓ క్షణం వాళ్ల వేపు చూసి, అక్కడినుండి వెళ్లిపోయింది.

ఆమెను పంపించి లోపలినుండి తాళం వేసుకునేభారం జలజ మీద పడింది.

కాని తుంగమ్మ పురిటినొప్పులు చిత్రంగా వున్నాయి. మధ్యాహ్నంవేళకు ఆగిపోయాయి. పిల్లల్లో కొంతమందికి ఆశాభంగమైంది. మిగతావాళ్లు ఆ సంగతి మర్చిపోయారు.

మళ్లీ మామూలు రొటీన్.

సాయంత్రం మళ్లీ నొప్పులు కనిపించాయి.

తుంగమ్మ భరించలేక అరుస్తూంది:

"చచ్చిపోతున్నా. అమ్మా, అమ్మా...."

రేపు తనను 'అమ్మా' అని పిలవబోయే పాపకోసం అలమటిస్తూ తుంగమ్మ, బాధకు ఓర్చుకోలేక, 'అమ్మా' అని తనను కన్న తల్లిని తోడు పిలుస్తోంది-తన బాల్యంలోనే పోగొట్టుకున్న తల్లిని.

నరసమ్మ తల్లిగా, నర్సుగా, మంత్రసానిగా తుంగమ్మను ఓదార్చారు. "ఏం ఫరవాలేదమ్మా. కాస్త ఓర్చుకోవాలి తల్లీ!"

"అయ్యో. నేను బ్రతకను దొడ్డమ్మా!"

"పిచ్చిపిల్లా, అలా అనకూడదమ్మా! నీకేం ఆపదు. బంగారం లాటి మగపిల్లాడు వస్తాడు."

"అయ్యో...."

దొడ్డమ్మ పిల్లల్ని కన్నతల్లి కాదు. ఆమె ఆ అదృష్టానికి నోచుకోలేదు. భర్త వున్నంతకాలం చుట్టూవున్న మనుషులు తనని 'గొడ్రాలు' అన్నారు. మొదటి కాన్పులో తల్లి మగబిడ్డనే కోరుకుంటుందన్నది ఆమె తెలుసుకున్న సంగతి మాత్రమే.

చీకటి పడింది. భోజనాలయ్యాక పిల్లలంతా పడుకునే ప్రయత్నం చేస్తున్నారు. తుంగమ్మ దగ్గరున్న పిల్లలూ ఒక్కొక్కరే వెళ్ళి భోంచేసి వచ్చారు. అక్కర్లేని దీపాలన్నీ ఆర్పటం అయింది. బయట చల్లని వెన్నెల కాస్తోంది. ఆ వెన్నెల్లో అందంగా కనిపిస్తూంది ఉద్యానం. తాడు సాయంతో బయటికి వెళ్ళాలన్న ప్రయత్నంలో గోడ మీదికి ప్రాకిన మల్లెతీగలోనుంచి పూలు సువాసనలను వెదజల్లుతున్నాయి. గులాబిమొగ్గలు క్షణక్షణానికి పెరుగుతూ వికసించే ప్రయత్నంలో ఉన్నాయి.

భోంచేసి చేతులు కడుక్కున్న నరసమ్మ ఓ క్షణం ఆ నిసర్గరమణీయతను తిలకిస్తూ నుంచున్నారు. మెదడు ఏ ఆలోచనకూ తావివ్వకుండా ఆ సుందరదృశ్యావలోకనంలో లీనమయింది.

గదిలోంచి మూలుగు వినపడటం లేదు.

నరసమ్మ మెల్లిగా గదివేపు వెళ్ళారు. చప్పుడు చెయ్యకుండా తలుపుతోసి సైగతో జలజను పిలిచారు.

"తుంగ పడుకుందా?"

"ఊఁ....నొప్పులు నిల్చిపోయినట్లైనా దొడ్డమ్మా?"

"ఒక్కోసారి అలా అవుతుంది. ఇంతకుముందు గోదావరి కూడా ఇలాగే అయింది. గుర్తుందా?"

"అఁ-అవును. నిజమే. నేను వచ్చిన సంవత్సరం. కానీ ఆమెను ఆస్పత్రికి తీసుకెళ్ళారు కదూ?"

"ఊఁ...."

తుంగమ్మ బాధ చూస్తుంటే జలజ కళ్ళు తిరుగుతున్నాయి. తన అక్క బాధను తక్కువ చెయ్యటానికి తనేం చెయ్యగలదు?

లలిత బయటికి వచ్చింది.

"తుంగక్కకు నిద్రపట్టింది దొడ్డమ్మా!"

రాత్రి మళ్లీ నొప్పులు వస్తాయేమో!

జలజ అంది: "దొడ్డమ్మా! మీరు వెళ్లి పడుకోండి."

ఆ సలహా బాగుంది.

"ఈసారి నొప్పులువస్తే వచ్చి లేపుతాం."

సరసమ్మ 'సరే' అన్నట్టుగా వాళ్లవేపు చూశారు.

"మీరు ఎవరెవరు పడుకుంటా రిక్కడ?"

లలిత, జలజ మౌనంగా ఒకరివేపు ఒకరు చూసుకున్నారు.

"ఇద్దరూ పడుకుంటాం దొడ్డమ్మా!"

.... .... .... ....

సరసమ్మకు మెలకువ వచ్చేసరికి బయట వెన్నెల లేదు. తెల్లవారుతూం దప్పుడే. దూరంలో మైసూరు రైలు బెంగుళూరు నగరాన్ని ప్రవేశిస్తూ చేస్తున్న చప్పుడు అస్పష్టంగా వినిపిస్తుంది.

ఐదయింది—అనుకున్నారు సరసమ్మ.

నిద్రమత్తు తీరగానే తుంగమ్మ గుర్తుకొచ్చిం దావిడకు. గబగబా లేచి పక్కగదివేపు వెళ్ళారు. తలుపు లోపలగడియ పెట్టలేదు. తోసినప్పుడు వెంటనే తెరుచుకుంది. లైటు వెలుగుతూంది. దుప్పటి కప్పుకుని తుంగమ్మ పసిపాపలా నిద్రపోతూంది. జలజ-లలిత ఒక పక్కమీద ఒకరి నొకరు కౌగిలించుకుని నిద్రపోతున్నారు. దుప్పటి కాళ్ళదగ్గర పడివుంది.

సరసమ్మ చప్పుడు చెయ్యకుండా వాళ్లకి దుప్పటి కప్పారు. లైటు ఆర్పేసి బయటికి వెళ్ళారు.

ఆ తర్వాత కిటికీలోనుండి వెలుగు మెల్లిగా లోపలికి ప్రవే శించ సాగింది.

అవ్వాళ గంట కొట్టలేదు సరసమ్మ. తుంగమ్మను వీలయి నంతసేపు నిద్రపోనిస్తే మంచిదన్న ఉద్దేశంతో తామే పిల్లలందర్నీ నిద్రలేపారు.

సావిత్రి కళ్లు నులుపుకుంటూ లేచి కూర్చుంది.

"పురు డొచ్చిందా దొడ్డమ్మా?" అని అడిగింది.

లేదని సైగచేస్తూ ముందుకు వెళ్ళారు సరసమ్మ. తను నిద్ర పోతున్నప్పుడు పురుడొచ్చేసిందేమోనని శంకించిన సావిత్రి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

గుడ్డిపిల్ల సుంద్రాకూడా దొడ్డమ్మ తనవేపురాగానే అడిగింది:

"పురు డొచ్చిందా దొడ్డమ్మా?"

"లేదు సుంద్రా!"

నీళ్ళగదిలోకి వెడుతున్న ఆమె హృదయం బరువయ్యింది. ఎలాటి సంసారం తమది! ప్రధాన సహాయకురాలిగా అభయ ధామా నికి వచ్చా రామె. ముఖ్యురాలు ఆ పని వదిలి వెళ్ళాక ఆ స్థానంలో వచ్చారు. అప్పటినుండి ఇప్పటిదాకా—ఇన్నేళ్ళు— ఎంత విచిత్రంగా సాగుతూంది బ్రతుకు!

గదిలోకి వచ్చి మొహం తుడుచుకుంటున్నారు. తల దువ్వు కుంటూ తలుపుదగ్గర నుంచుని ఒక్కొక్కరుగా లేచి తమ పనిపాటలు మొదలు పెడుతున్న అమ్మాయిల్ని చూడసాగారు. ఒక్కొక్కరిది ఒక్కోగుణం. వాళ్లందరూ మంచివాళ్ళని చెప్పలేం. కాస్త సందు దొరికితే తలుపు తీసుకుని పారిపోవటానికి తయారుగా వున్నవారూ ఉన్నారు. ఎలాటి నీచకృత్యానికయినా వెనుకాడనివారూ ఉన్నారు. కొత్తవా రొచ్చినప్పుడు, పాతవారి మంచిప్రభావం వాళ్ళమీద పడేవాని కన్నా, పాతవారినే తమ ప్రభావానికి లోనయ్యేలా జేసే సమర్థులూ ఉన్నారు. ఒక్కోసారి కలుపు మొక్కలే ఎక్కువై పంటంతా పాడవు తుందేమో అనిపించినా జలజ, లలిత, సావిత్రి, సుంద్రాలాంటి మంచి

పిల్లలను చూసినప్పుడు మానవత్వంలో సరసమ్మకున్న విశ్వాసం మళ్ళీ గట్టిపడేది.

ముడి వేసుకుని, జుత్తు చిక్కు తీసుకున్నప్పుడు వచ్చిన వెంట్రుకలను ముద్దగాజేసి అరుగు పక్కనున్న చెత్తబుట్టలో పడేసి వచ్చారు. అప్పుడే జలజ-లలితల దర్శన మయింది.

"లేచారన్రా?"

జలజ నేరస్థురాలిలా—

"పదకొండు గంటలదాకా మేలుకునే వున్నాం దొడ్డమ్మా! ఆ తరువాత నిద్ర పట్టేసింది" అంది.

జలజ కళ్ళల్లో ఇంకా నిద్రమత్తు కనిపిస్తూనే ఉంది. సరసమ్మ చిరునవ్వు నవ్వారు.

"లైటు మీరు ఆర్పారా దొడ్డమ్మా?"

"అవును. ఇప్పుడిప్పుడే ఆర్పాను-తెల్లారాక."

"ఓ...." అంది జలజ.

"తుంగ లేచిందా?"

"ఇంకా లేదు దొడ్డమ్మా!"

"పాపం! పడుకోనీయ్"

"అయితే రాత్రి తుంగక్కకు మళ్ళీ నొప్పులు రాలేదు కదూ దొడ్డమ్మా?"

"మీరు అక్కడే పడుకున్నారుగా. నన్నడుగుతారేం? వెళ్ళి మొహం కడుక్కోండి ప్రార్థనకు టైమవుతూంది."

ఇద్దరూ మొహం కడుక్కోటానికి వెళ్ళిపోయారు. ఆ తరువాత ప్రార్థన.

పాలవాడు వాడుకగా పోసే ఒక్కశేరు పాలు పోశాడు. అవ్వాళ తుంగమ్మకోసం పావుశేరు పాలు ఎక్కువ పోయించుకున్నారు సరసమ్మ.

"ఇక ఒక్క నెలదాకా ఐదు పావుశేర్లు పొయ్యాలి."

"అలాగే నండమ్మా!"

"ఒక్క శేరుకే నీళ్లు పోస్తావా ఏమిటి?"

"ఎందుకండమ్మగారూ, కొత్తగేదె, మొన్నే దూడేసిందని చెప్పలా?"

పాలవాడిది గేదెల సంసారం. అదే వాడి ప్రపంచం.

సావిత్రి పాలగిన్నె తీసికెళ్ళాక సరసమ్మ తలుపు తాళం వేశారు.

....ఆమెది ఈ సంసారం. ఇదే ఆవిడ ప్రపంచం.

తుంగమ్మకు మెలకువ వచ్చింది. కాని ఒళ్ళంతా నొప్పులుగా ఉండటంవల్ల పైకి లేవలేక పోయింది. జలజ చాప చుట్టబెట్టి వుంది. ఎప్పుడో లేచి వెళ్ళినట్లుంది- అనుకుంటూండగానే దొడ్డమ్మ లోపలి కొచ్చారు.

ఆ తల్లి వాత్సల్యపు నవ్వులో ఏదో మోహక శక్తి ఉన్న ట్టుంది. ఆమె తుంగమ్మ దగ్గర కూర్చుని, ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని మృదువుగా నిమురుతూ, "బాగా నిద్రపట్టిందా తుంగా?" అని అడిగారు.

"పట్టింది, దొడ్డమ్మా!"

"ఆకలేస్తోందా?"

ఆ ప్రశ్న అడిగాక తుంగమ్మకు ఆకలి గుర్తొచ్చినట్టుంది. అవునని తల వూపింది.

"ముందు కాస్త వేడిగా పాలు ఇస్తాను. తరువాత కొద్దిగా ఉప్మా తిందువుగాని...."

సరేనని నవ్వింది తుంగమ్మ.

అందరికీ మామూలుగానే గడిచిందా రోజు.

కానీ, మధ్యాహ్నం తుంగమ్మకు వాంతయ్యింది- తాగిన పాలు, తిన్న ఉప్మా అంతా....

ఆ తరువాత నొప్పులు మొదలయ్యాయి. 'ఇవ్వాళ తప్పదు' అనుకున్నారు సరసమ్మ.

వీధిలో డాక్టరుగారాయన్ని తీసుకొచ్చారు.

ఆయన విజిటింగ్ ఫీజు మామూలుగా ఓ రూపాయి. కానీ అభయ ధామం నుండి ఆయన ఫీజు పుచ్చుకునే వారు కారు.

తుంగమ్మ నాడిచూసి, పరీక్షించి ఆయన "భయమేమీ లేదు. అవసరం అనిపిస్తే లేడీ డాక్టర్‌ని పిలిపించండి సాయంత్రం" అన్నారు.

ఇలాటి మాటలతో ఏమి లాభమో- దేముడికి తెలియాలి!

తుంగమ్మ బాధ ద్విగుణీకృత మయింది.

అభయ ధామపు నిర్వాహక సమితిలో ధనికురాలైన సభ్యురాలి సోదరి లేడీ డాక్టరు. ఆమెను పిలిపించటం మంచి దనిపించింది సరసమ్మకు. దగ్గరున్న పోలీసు స్టేషన్‌కువెళ్ళి ఆ డాక్టరమ్మకు ఫోన్ చేశారు. ఆమె ఇంట్లోనూ లేదు. డిస్పెన్సరీలోనూ లేదు ...రాత్రి మళ్ళీ రెండు మార్లు ఫోన్ చేసినా దొరకలే దామె. డాక్టరమ్మగారు సీరియస్ కేసు చూడటానికి వెళ్ళారు అన్న బదులు వచ్చింది.

యాంబ్యులెన్సు తెప్పించి ఆస్పత్రిలో జేర్పిస్తే - అన్న ఆలోచన వచ్చింది. కానీ ఈ అపరాత్రిలో అభయ ధామపు రోగికి అక్కడ తగిన చికిత్స దొరకదన్న సంగతి సరసమ్మకు అనుభవపూర్వకంగా తెలుసు. అమ్మాయిల్లో చాలామంది అవాళ రాత్రి పొద్దు పోయేదాకా నిద్రపోలేదు. సరసమ్మ జలజ-లలిత-సావిత్రులతో తుంగమ్మ దగ్గిరే ఉన్నారు. వెన్నెల ఆ రాత్రికూడా వెక్కిరిస్తూంది.కానీ దాన్ని ఎవరూ పట్టించుకో లేదు.

తెల్లవార వస్తూండగా సరసమ్మ బయటికి వచ్చి—

"జలజా, లలితా! ఓ పని చేస్తారా?" అన్నారు.

"చెప్పండి."

"మీ రిద్దరూ వెంటనే మన సెక్రటరీగా రింటికి వెళ్ళాలి. చీటీ ఇస్తాను ఆమెను లేపి, వాళ్ళ కారులో లేడీ డాక్టర్‌ని తీసుకుని రావాలి."

"ఇవ్వండి చీటీ" అంది జలజ.

మహా ధైర్యవంతురాలు లలిత బిక్కమొహంతో తుంగమ్మ గదివేపు చూసింది. ఆమె కళ్ళ కొనల్లో నీరు నిండింది. దాన్ని చూడగానే అప్పటిదాకా ఏడుపు దిగమింగుకుంటున్న జలజ బావురుమంది.

"ఛ" అన్నారు సరసమ్మ. ఇద్దర్నీ తమ గదికి తీసుకెళ్ళి

"ఎందు కేడుస్తార్రా; ఏమయిందని? తుంగమ్మ కేమీ అవదు. దేవుడున్నాడు. వినిపించిందా?" అన్నారు.

ఆమె చీటీ రాసిచ్చి వాళ్ళని బయటికి పంపించారు.

ఏడుగంటలకల్లా హారను వేస్తూ వచ్చింది కారు.

"నిన్ననే ఎందుకు పంపలేదు కబురు?" అంటూ సెక్రటరీ, లేడీ డాక్టర్, నర్సు-జలజా-లలితలతో లోపలికొచ్చారు. ముందురోజు సాయంత్రంనుండీ డాక్టర్ని పిలవటానికి తాము చేసిన ప్రయత్నాన్ని సరసమ్మ వివరించలేదు.

ఊపిరి పీల్చలేక బాధపడుతున్న తుంగమ్మ, చికిత్స మొదలు పెడుతున్న డాక్టరు, ఆమెకు సాయంగా నర్సు - ఈ ముగ్గుర్ని లోపల ఉంచుకొన్న గది తలుపులు మూసుకొన్నాయి.

ఇరవయి నిమిషాల తర్వాత లేడీ డాక్టరు బయటికి వచ్చారు. అక్కడ ముళ్ళమీద నుంచున్న భర్త లేడు. ఎలాటి బిడ్డో తెలుసుకుందామన్న చుట్టాలు లేరు. అయినా ఎంత మందున్నారక్కడ! రాతి స్తంభాల్లా నుంచున్నారు కొందరు. కూర్చున్నచోటే నిశ్చల విగ్రహాల్లా వున్నారు కొందరు. మూగపిల్ల కల్యాణి అందరికన్నా దూరంగా కూర్చుంది, మౌనంగా. గుడ్డిపిల్ల సుందా కళ్ళు మాట్లాడుతున్నాయి. ఆ క్షణంలో ఎంతమంది చుట్టాలు - లోపలున్న మనిషికి! ఆ లేడీ డాక్టరు చెప్పే ఒక్కమాటతో వారందరూ బావురుమని ఏడవటానికి సిద్ధం - కిలకిల నవ్వటానికి సిద్ధం.

కానీ డాక్టరు ఏమీ అనలేదు. చేతిసైగతో సరసమ్మనీ, సెక్రటరీని పక్కగదిలోకి తీసుకెళ్ళారు. అక్కడ ఒక్క నిమిషం - ఒక యుగం అనిపించే నిమిషం—గుసగుసలు.

మరోసారి తుంగమ్మ గది తలుపులు, డాక్టర్ని లోపలికి రానిచ్చి మళ్ళీ మూసుకున్నాయి.

అనంతకాలంలా అనిపించిన పదిహేను, ఇరవయి, ఇరవైఐదు నిమిషాలు.

డాక్టరు తలుపు తెరిచి సరసమ్మను పిలిచారు లోపలికి.

రెండు నిమిషాల్లోనే బయటికి వచ్చారు-అమ్మాయిల దొడ్డమ్మ.

కానీ గుర్తు పట్టలేనంతగా మారిపోయిం దామె మొహం. ఆ కంఠం....

"వెళ్ళండి. ఎందుకు ఇక్కడ నుంచున్నారంతా? ....పొండి.... పొండి-మీ పనులు చూసుకోండి!" పిచ్చివారిలా రెండు చేతులూ ఊపుతూ అరిచా రామె.

జలజ, లలితా దొడ్డమ్మను పట్టుకుని ఆఫీసు గదిలోకి తీసు కొచ్చారు.

"దొడ్డమ్మా, ఏం జరిగింది దొడ్డమ్మా?"

ఎవరిదో కంఠంలా వినిపించిం దామె గొంతు-

"బిడ్డ చనిపోయింది - తుంగ బ్రతికింది!"

* * *

సగం తెరచిన 'కౌరవంజి' మాస పత్రికను అలాగే వుంచి, తను చదివిన విషయాన్ని తల్చుకుని నవ్వుకుంటూ, తుంగమ్మ మరో వేపు తిరిగింది. ఎడంచేతి వేళ్ళు దిండును స్పృశించి క్రిందికి వెళ్ళాయి. అక్కడున్న ఉత్తరం ఆమె చేతికి తగిలింది.

అది తుంగమ్మ తండ్రి రాసిన ఉత్తరం.

తను బ్రతికి బయట పడిన మరుసటిరోజే సరసమ్మ నడిగింది-

"మా నాన్న ఉత్తరం రాయలేదా దొడ్డమ్మా?" అంటూ.

"అరె, చెప్పటం మర్చిపోయాను. మొన్ననే ఉత్తరం వచ్చింది. నీ తమ్ముడూ, బెళగాలిలో మీ అక్కయ్యా - పిల్లలూ, అందరూ బాగున్నారుట!" అన్నారు దొడ్డమ్మ.

"ఉహుం-ఇంకా ఏం రాశారు?"

"వీలయినంత తొందరగా వచ్చి నిన్ను చూస్తారుట."

తను చనిపోయి ఉంటే, తండ్రి వచ్చి చూసే ప్రశ్నే వుండేది కాదు. ఇప్పుడు తను బ్రతికింది - ఒక్కతే....

దొడ్డమ్మ మాట విని తుంగమ్మ —

"అయితే, నాన్నకు నామీద కోపం లేదన్నమాట."

"పిచ్చిపిల్ల....కోప మెందుకుంటుంది?"

"ఐనా మీ కొక్కరికే రాశారు. నాకేం రాయలేదు కదూ దొడ్డమ్మా?"

"ఊఁ...."

తండ్రినీ, తమ్ముడినీ చూడాలనిపించింది తుంగమ్మకు. మరో మారు తండ్రి ప్రేమతో తన తల నిమురుతూ చిరునవ్వుతో 'అమ్మాయ్' అంటే....

ఆ తరువాత పది రోజులకు సరసమ్మ ఓ ఉత్తరం తెచ్చి ఇచ్చారు తుంగమ్మకు.

"మీ నాన్నగారు రాశారమ్మా!"

"నాకేనా?"

"ఊఁ...."

ఉత్తరం విప్పుతూ—

"ఇవ్వాళొచ్చిందా దొడ్డమ్మా?"

"లేదు తుంగా- ఆవేళే వచ్చింది. నువ్వు కాస్త కోలుకున్నాక ఇద్దామని."

తమ కిష్టంలేని విషయాన్ని చెబుతున్నప్పటి విషాదఛాయ ఉంది ఆమె కంఠంలో.

"ఓ...." అంది తుంగమ్మ.

ఆ ఉత్తరం తెచ్చే ఆత్మీయతాప్రపంచంలో తుంగమ్మ నొక్క- దాన్నీ విడిచి సరసమ్మ గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయారు.

తండ్రి తనకు రాసిన ఉత్తరం-ఈ ఐదునెల్లో బెంగుళూరికి రాసిన మూడవ ఉత్తరం....

'తుమకూరు'—ఎంత ప్రియమయిన పేరది! ఆ తరువాత తేదీ.

"చి॥ సౌ॥ తుంగమ్మకు.... ఆశీర్వచనాలు!"

వెనకటిదే సంబోధన. అందులో మార్పేమీ లేదు.

దొడ్డమ్మ ఇదివరకే ఆయనకు రాసిన విషయాలు. తరువాత....

'బాధపడకు తుంగా. నువ్వు దొడ్డమ్మ అని పిలిచే పల్లనితల్లి ఎవరో నాకు తెలియదు కాని, దేవుడు ఆమెను కాపాడుగాక! నువ్వు ఇల్లు విడిచి వెళ్లానని రామచంద్రయ్య రాసిన ఉత్తరమూ, మేట్రన్ ఉత్తరమూ ఒకేసారి అందాయి. నువ్వు అంత తొందరపడకుండా

నాకు రాసుంటే. నేనే వచ్చివుండే వాడివి. నేనింకా ఉన్నాను కదా! అయినా నువ్వు చేసిన పనేమో మంచిదే నాకూ ఓసారి అలాటి ఆలోచన వచ్చింది, వివరాలు తెలియక వూరుకోవలసివచ్చింది. నువ్వు దేనికీ భయపడకు. నేను ఇప్పుడే వచ్చి చూడచ్చు. కానీ ఏమిటి లాభం? కనుక పరీక్షలయ్యాక వస్తాను. ఈసారి నేను రిటైర్ కూడా అవుతున్నానుగా.... నువ్వు దొడ్డమ్మా అని పిలిచే మేట్రన్ గారికి రాశాను. ఆమె నిన్ను చూసుకుంటుందన్న నమ్మకం నాకుంది.... ఇంకా ఏం రాయను?'

ఆఖర్లో-'నీ ఆరోగ్యం బాగా చూసుకో. దేహప్రకృతి విషయంలో అశ్రద్ధ చెయ్యకు'

తన ఆరోగ్యం.... దేహప్రకృతి....

ఉత్తరం చదివి దిండులో తలదూర్చి మనసారా ఏడ్చింది తుంగమ్మ.

తరువాత ఆ ఉత్తరం మరల దిండుకింద ఆత్మీయంగా విశ్రాంతి తీసుకుంటూంది.

తుంగమ్మ కావాలనుకున్నప్పుడల్లా ఉత్తరం పైకితీసి చదువుకునేది.... తండ్రి ఉత్తరం వచ్చి ఐదురోజులయింది. నిజమే. అయినా 'కారవంజి' చదువుతూ నవ్వుతున్న తుంగమ్మ చేతివేళ్ళకు ఆ ఉత్తరం తగలగానే ఉత్తరంలోని ఒక్కో విషయమూ స్పష్టంగా వినిపించసాగింది.

'పరీక్షలయ్యాక వస్తాను'

పరీక్షలు మొదలుపెట్టి నాలుగురోజు లయిందప్పటికే. తండ్రిని త్వరలోనే చూడచ్చు....

'ఈసారి రిటైర్ అవుతానుగా?'

ఉద్యోగం నుండి నివృత్తిపొందే తండ్రి.... తన తండ్రి తల్లి-తండ్రులున్న వూరు తునకూరు. అది పాత కథ తండ్రి చదువుకుని ఉపాధ్యాయవృత్తి చేపట్టారు పెళ్ళికి ముందూ. తరువాతా ఊరునుండి ఊరికి బదలీ అవుతూ తన దేశంలోని ఒక భాగాన్నంతా చూపినా తునకూరు వదలి వెళ్ళలేదాయన. అక్కడున్నది అద్దె ఇల్లే అయినా, ఒక

కాలంలో ఎనిమిది రూపాయలున్నది ఇప్పుడు పదిహేడు రూపాయ లయింది. అయినా ఆ చిన్న ఇంటిని ఆయన వదిలిపెట్టలేదు. తుంగమ్మ అక్కడే పుట్టింది. వేరే ఊళ్ళల్లో పెరిగినా, ఆరు సంవత్సరాల తర్వాత తుంగమ్మ తుమకూర్లోనే ఉంది. కొన్ని సంవత్సరాలయ్యాక తల్లి పోవటం....అక్కయ్య పెళ్ళి....తనూ....ఇక రిటైరయిపోతున్న ఉపాధ్యాయుడు తండ్రి....

తనవల్ల ఈ వయసులో తండ్రి మనసుకు పెద్ద దెబ్బే తగిలింది.

తమ్ముడు పాసవుతాడు. ఉపాధ్యాయుల పిల్లలు ఫేలవట మంటూ ఉండదు. తుంగమ్మ పుస్తకాల్లో చదివింది. మగపిల్లాడు వంశోద్ధారకుడు. పుత్రసంతానం లేకపోతే ఇంటికి వెలుగులేదు. తన వల్ల వంశానికి చెడ్డ పేరొచ్చింది. కాని తన సంగతి అందరికీ తెలిసి పోతే, తమ్ముడికి తన కళంకం అంటుకుంటుంది.

తమ్ముడి గురించే ఆలోచించసాగింది తుంగమ్మ. తమ్ముణ్ణి చిన్నప్పటినుండే ముద్దుగా చూసేది. పెద్దక్కకన్నా తనంటేనే ప్రేమ వాడికి....నారాయణమూర్తి ప్రకరణంలో తమ్ముడి కేమర్థమయిందో, ఉత్తరాలేమైనా తనకు తెలియకుండా చదివాడో ఏమిటో?....

మళ్ళీ అదే సంగతి....దాన్ని దూరంగా నెట్టి తమ్ముడి భవిష్యత్తునుగురించి ఆలోచించసాగింది తుంగమ్మ. ఇక మూడేళ్ళలో హైస్కూల్ చదువు అయిపోతుంది. ఆ తరువాత కాలేజీ. ఉద్యోగం. పెళ్ళి.

పెళ్ళి సంగతి....

లేదు. తనకు ఈ ఆలోచనలనుండి విముక్తి లేనే లేదు. ఎంతగా పక్కకి నెట్టివేస్తున్నా పొంచి ఉండి సందు చూసుకుని లోపల దూరుతూ ఉంటాయి.

తుంగమ్మ అటు తిరిగి పడుకుంది... ఆ పత్రిక..., అట్టమీది బొమ్మ భలే తమాషాగా వుంది- సోదిచెప్పే ఆ స్త్రీచేతిలో ఓ పాప బొమ్మ.

మళ్ళీ పురుటిరోజుల జ్ఞాపకం.

జలజ రెండురోజుల క్రిందట సూక్ష్మంగా అంది-

"ఆ సంగతులన్నీ ఆలోచించ కూడదక్కా, నువ్వు."

"ఏం...?"

"నీ ఆరోగ్యం ముఖ్యం కదా?"

అయినా కొంత తెలుసు తుంగమ్మకు. లేడీ డాక్టరు రావటం. . నర్సు తన ముక్కుదగ్గ రేదో పెట్టడం. గుయ్ మంటూ తను ఎక్కడికో లోతుగా ఉన్న ప్రదేశానికి దిగిపోతున్నట్టు అనిపించింది...అదే స్పృహ కోల్పోవటం... ఆ తరువాత...వాళ్లే ఏదో చేసుండాలి...చనిపోయి పుట్టిన పాప...

కళ్ళు భారంగా వున్నాయి. దిండుమీద కళ్ళు అన్చి పడుకుంది. కొద్ది నిమిషాలు. . .

తలుపు దగ్గర కాళ్లచప్పుడు. రెండు పాదాలు కనిపించాయి. వాటిమీద మాసిన చీరె అంచు. వాటిని చూసి అనుకుంది - జలజ వచ్చిందని

"నిద్రపోతున్నావా అక్కా?"

"లేదు ..రా!"

జలజ వచ్చి తుంగమ్మ దగ్గర కూచుంది. ఆమెదృష్టి కొరవంజి మీద పడింది.

"ఇందులో కథ బాగుందా అక్కా?"

"ఆహా, తమాషాగా ఉంది."

"బొమ్మ చూస్తేనే నవ్వొస్తుంది."

"అవును."

వాళ్లు తన నుండి దాచటంలో అర్థం లేదు. తనూ మనిషేగా, తల్లి కదా, ఆమాత్రం తెలుసుకునే అధికారం తనకు లేదా?

"జలజా!...."

"ఏమిటక్కా?"

"నిన్నొక సంగ తడుగుతాను."

జలజకు అర్థమయింది.

"అదొక్కసంగతి వదిలేసి ఇంకేమయినా అడుగక్కా!"

"ఏం? ఎందుకని?"

"దొడ్డమ్మ ఆ సంగతి వూరికే మాట్లాడొద్దన్నారు- నువ్వు లేచి తిరిగేదాకా.

"ఇప్పుడు బాగానే ఉన్నాగా!"

"ఊహుఁ....ఇంకా కొన్నాళ్లు పోవాలి."

"నాకు కష్టంగా ఉంటుంది జలజా! నేను అనుభవించినదాన్నే. నా నుండి దాస్తున్నారు మీరు."

"దొడ్డమ్మ ఏమీ చెప్పలేదా అయితే?"

"చెప్పారు- నీ కదృష్టం లేను తుంగా అన్నారు. నాల్గు రోజు లయ్యాక నేను ఏడుస్తుంటే మరోసారి చెప్పారు. 'ఆడపిల్ల. ముద్దుగా ఉంది. దేవుడు తీసుకెళ్ళాడు' అని."

"అవునక్కా!....ముదుముద్దుగా ఉంది. మాలో పాపను చూసింది నలుగురు మే-దొడ్డమ్మా, లలితా, సావిత్రీ, నేనూ. ఆ పాపను ఆడించే ప్రాప్తం లేదు నాకు. మట్టి చెయ్యటానికి వెళ్ళినప్పుడు దొడ్డమ్మ ఎత్తుకున్నారు."

ఎంతటి కసాయిది ఈ జలజ! పాషాణ హృదయం. తన పాపని గురించి అలాగా....

"చాలు....ఇక ఆపు జలజా!....ఆపు."

తుంగమ్మ కంఠం విని జలజకు దిగ్భ్రమ కలిగింది. ఆ మాట, పెద్ద అలలాగా ఆమె హృదయపు గట్టుకు కొట్టుకుని తునా తునకలయి, చినుకుల్లాగా కన్నీటి రూపంలో ప్రవహించ సాగింది.

"ఏడవకు అక్కా, ఏడవకు."

కాని కాలి మనయిన హృదయ క్షేత్రంలో ఆ చినుకులు ఇగిరి పోవటానికి ఎంతో సేపు పట్టలేదు.

తుంగమ్మ ఏడుపు మానేసినా, జలజ మొహం ప్రసన్నం కాలేదు. అబద్దం చెప్పిం దామె. అందంగా లేదు పాప. ఏ రూపమూ లేదు ఆ నిర్జీవమైన మాంసపు ముద్దకు. కాపీ ముద్దుగా వుందనక ఏం చెయ్యాలి?

"నాకు మెలుకువ వచ్చేసరికి అక్క దేమీలేదు జలజా: మీరు నలుగురైదుగురూ, డాక్టరూ నా చుట్టూ ఉన్నా రంతే."

"అవును."

"పాప?"

"వేరే చోటుకి తీసుకు పోయాం."

"నేను చూసినపుడు మీరంతా ఏడుస్తున్నారు."

"లేదు....అబద్ధాలు!"

"నాకు తెలీదనుకోకు జలజా!"

"అవును. ఏడుస్తున్నాం. ఏమంటా వయితే?"

"ఏం లేదు. ఊరికే అడిగాను."

"సరే, అదంతా మర్చిపో అక్కా!"

"మీరంతా మంచివారు జలజా!"

మంచో-చెడో జలజకు ఆ పదాల నిజమైన అర్థం తెలియదు. కాని తమ మంచితనంవల్ల తుంగమ్మకు ఏవిధమయిన సాయం చేయలేకపోయారు. అది నిజం.

ఆ రోజు చనిపోయిన బిడ్డను మట్టి చేసి వచ్చాక గుడ్డిపిల్ల సుంద్రా అడిగింది-

"వెళ్లొచ్చారా జలజా!"

"ఆ!...."

"బిడ్డ అందంగా వుందా? ఎలా ఉంది చూడ్డానికి?"

ఓ క్షణం జలజ సహనాన్ని కోల్పోయింది. గుడ్డిపిల్ల ప్రశ్నకు అర్థం లేదనిపించింది.

"అందంగా వుంది, వాళ్లమ్మలాగా."

"ఓ...."

జలజ కంఠం ఎప్పటిలా లేదు. కానీ సుంద్రా తుంగక్కకు కలిగిన ఆపదవల్ల జలజ ఏడ్చి కంఠం అలా అయిందేమో అనుకుంది. బిడ్డ బ్రతకలేదని సుంద్రా బాధపడుతోంది.

కాని మరో అమ్మాయి, బ్రతుకులో ఎన్నో కష్టాలు పడ్డ పార్వతి చేదుగా అంది-

"ఆడపిల్లేగా. పోనివ్వు....ఎవరికీ ఏమీ నష్టం లేదు."

ఆ పిల్లల్లో ఎంతోమంది తుంగమ్మను గురించి సానుభూతిగా

మాట్లాడుకున్నారు. ఎంతోమంది మరుసటి రోజుకే అన్నీ మర్చిపోయారు కూడాను.

అంతా తుంగమ్మకు చెప్పాలనిపించింది జలజకు. కానీ మళ్లీ తనే అనుకుంది-అది మంచిది కాదని.

మౌనంగా కూర్చున్న జలజ చేతిమీద చెయ్యివేసి—

"అలా కూర్చున్నావేం జలజా?" అంది.

"ఉట్టినే. ఏమిటో విసుగ్గా వుంది."

విసుగ్గా ఉన్న స్నేహితురాలిని నవ్వించే బాధ్యత తనది అనిపించింది తుంగమ్మకు.

"ఏమయింది నీకు?"

"ఏమిటో మరి."

"చందమామ చదువుతూ అడవిలో రాజకుమారిని వదిలేసి వచ్చావా ఏం?"

జలజ నవ్వింది. ఇప్పుడే ఏడ్చిన తుంగమ్మేనా ఈ ప్రశ్న అడుగుతున్నది?

జలజ మొహంలోని ప్రసన్నతను చూసి తుంగమ్మ సంతోషించింది.

"నువ్వు చదువుతున్న కథ చెబుదూ-నాకు."

"పోక్కా. వూరికే ఏడిపిస్తావ్ నన్ను."

"లేదు. నిజంగా. చెప్పు మరి."

'చెప్పనా, వద్దా? హాస్యం చేస్తే ఏమిటిట- సులభంగా వినేవారు దొరికినపుడు! కాని, ఈ తుంగక్క....'

జలజ కథ చెప్పటానికి ప్రారంభించే లోపల సరసమ్మ లోపల కొచ్చారు. జలజకు ఆశాభంగమయినా, దొడ్డమ్మవేపు చూసి, నవ్వు నవ్విన తుంగక్కను చూసి సంతోషించింది.

"తుంగకు చందమామలోని కథ చెబుతున్నావా?" అన్నారు ఆమెకూడా. అది అవమానం కాదు, గౌరవం అన్న నమ్మకంతోనే లేచి నుంచుంది జలజ. ఆమెకోసం బయట పని కాచుకుంది.

''కత్తిపీటతో వేలు కోసుకుంది అలమేలు. కాస్త అయొడిన్ వేసి గుడ్డ చుట్టాలి జలజా!''

''అలాగే దొడ్డమ్మా!''

జలజ గంభీరంగా, కర్తవ్యాన్ని పాలించే ధీరురాలిలా, బయటకు వెళ్ళింది.

సరసమ్మ ఏదో తొందరలో ఉన్నారు. అభయ ధామంనుండి బయటకు వెళ్లేటప్పుడు కట్టుకునే చీరె కట్టుకున్నారామె.

''బయటికి వెడుతున్నారా దొడ్డమ్మా?''

''చీరె చూసి కనుక్కున్నావ్? కమిటీ మీటింగుంది. దానికి వెడుతున్నా.''

తుంగమ్మకు అర్థం కాలా.

''కమిటీ మీటింగ్ అంటే?''

''అభయ ధామపు సమితి లేదూ? దాని సభ.''

''ఓ....పెద్ద సభా?''

''కాదూ మరి?''

కానీ అది నిజం కాదు. మంచికోసం ఒకోసారి అబద్ధాలు చెప్పటం అవసరమని సరసమ్మ అనుభవంమీద తెలుసుకున్నారు. నిజానికి సమితి సభకు రావలసిన పదకొండు మందిలో అందరూ ప్రతి మారూ వచ్చేవారు కారు. ఎన్నోసార్లు 'కోరం' ఉండేది కాదు. మరెన్నో సార్లు సరసమ్మా, కార్యదర్శిని కూర్చుని, అత్యవసరమయిన తీర్మానాలను చర్చించి వ్రాసి, మిగతా సదస్యులకు పంపి సంతకాలు తీసుకునేవారు. కాని నిజాన్ని అభయ ధామపు పిల్లలకి ఎప్పుడూ తెలియపర్చేవారు కారు. అలా చెబితే ఆ అమ్మాయిలికి అభయ ధామపు నిర్వహణలో ఉన్న నమ్మకం శిథిలమవుతుంది. దొడ్డమ్మ సాధారణంగా వారాని కోసారి మీటింగుకని వెళ్ళేవారు. ఆ సంగతి అందరికీ తెలుసు. ఆ మీటింగు ఓ పెద్ద సభ అని, దొడ్డమ్మ తమకు బాధ్యత వహించిన ప్రతినిధిగా, పరమాన్న భోజనం రోజుచేసే ఉపన్యాసంకన్నా పెద్ద ఉపన్యాసం ఇస్తారనీ అమ్మాయిలు ఊహించుకునేవారు. వాళ్ళు అలా

అనుకోవటంలోనే అభయధామపు మంచి ఉందని సరసమ్మ గ్రహించారు.

తుంగమ్మ కూడా అలాగే చిత్రించుకుంటూ, ఇప్పుడు తనగురించి అక్కడ ఏం జరుగుతుందో నన్న ఆత్రుతతో అడిగింది.

"మీటింగులో ఇక్కడ అమ్మాయిల గురించి చర్చిస్తారట, జలజ చెప్పింది—నిజమేనా దొడ్డమ్మా?"

"అవును."

తన విషయాన్ని చర్చిస్తారయితే. ఆ సభని సినిమాలో చూసిన న్యాయస్థానంలా ఊహించుకుంది తుంగమ్మ. ఎలాటి మాట లొస్తాయో తనగురించి.

తుంగమ్మ మౌనం సైపరానిదైంది సరసమ్మకు.

"ఎందుకు అడుగుతున్నావే తుంగా?"

తుంగమ్మ బదులు చెప్పలేదు. మళ్ళీ ప్రశ్నించింది.

"నా విషయంలో ఏం నిర్ణయానికి వస్తారు దొడ్డమ్మా?

"అంటే?"

"నేను ...ఇక...."

ఇక తట్టుకోవటం అసాధ్య మయింది సరసమ్మకు.

"తుంగా! ఏమిటి నీ ఆలోచన? ఎవరు ఇదంతా నీ బుర్ర కెక్కించింది? ఛా....ఆ జలజ కసలు బుద్ధిలేదు."

"లేదు దొడ్డమ్మా, జలజ ఏమీ చెప్పలా, నేనే...."

సరసమ్మ నవ్వారు.

"బుద్ధి లేకపోతే సరి. మెదలకుండా పడుకో. నీకు ఎక్కువగా పాలూ, పళ్ళూ కావాలని మీటింగులో పాస్ చేయించు కొస్తాను."

ఆ మాటకు బదులు చెప్పలేక తెల్లబోయి చూస్తూ ఉండి పోయింది తుంగమ్మ.

"ఇంకో సంగతి తుంగా!"

"చెప్పండి దొడ్డమ్మా!"

"మీ నాన్నగారి ఉత్తరానికి బదులు రాయాలి. ఆయన కేం తెలీచెయ్యనే లేదు."

"అలాగే."

"రేపు రాయి. నేనూ రాస్తాను."

"సరే దొడ్డమ్మా!"

"ఏం రాస్తావో ఆలోచించు. రేపు మాట్లాడుకుందాంలే ఆ సంగతి."

తరువాత సరసమ్మ తొందర తొందరగా వెళ్ళిపోయారు. కాని ఆమె కొన్నిరోజులు ఆలోచించినా తెగనన్ని విషయాలను తన బుర్రలో పడేసి వెళ్ళినట్టు అనిపించింది తుంగమ్మకు.

మధ్యాహ్నపు ఎండ తగ్గిపోయినా తుంగమ్మ మెదడును కమ్ముకున్న మబ్బు తొలగి పోలేదు.

జలజ, లలిత—ఇద్దరికి నేతపని వచ్చు. కనుకనే మిగతా పిల్లల్లాగా వాళ్ళూ వారంలో ఒకటి-రెండు రూపాయలు సంపాయించేవారు. రెండురోజులక్రితం జలజ, లలితా మార్కెట్‌కి వెళ్ళినపుడు ఇద్దరూ తుంగమ్మకోసం తలా ఓ పావలా ఖర్చు పెట్టారు. జలజ ఓ 'కొరవంజి' పత్రిక కొన్నది. లలిత నాలుగు నారింజపళ్ళు కొంది.

ఆ పళ్ళల్లో ఒక్కటింకా మిగిలే ఉంది. తుంగమ్మ మెల్లిగా గోడ నానుకుని కూర్చుని నారింజపండు చేతికి తీసుకుంది. కొద్దిగా వాడినా, పుల్లగా ఉన్నా ఆ పండు అమృతంలా అనిపించిం దామెకు.

దిమ్ముగా ఉన్న మెదడును చల్లబర్చటానికి ప్రయత్నిస్తూ నారింజ తొనలను ఒక్కొటిగా తినసాగింది తుంగమ్మ.

సంగీతపు మేడం ఆ పూట పాఠం చెప్పలేదు. సరసమ్మ బయటినుండి వచ్చేదాకా అభయధామపు బాధ్యత ఆమెదే. తాళంచెవుల గుత్తిని ఒళ్ళో పెట్టుకుని, పైకి ధైర్యంగా వున్నట్టు మొహంపెట్టి, గంభీరంగా ఆఫీసుగదిలో కూర్చున్నారు. ఇలాటి వేళల్లో ఆమెకు విపరీతమైన భయం వేసేది. ఏ క్షణంలోనయినా అమ్మాయిలు తనమీద పడి తాళం చెవులగుత్తి లాక్కుపోవచ్చని అనిపిస్తూ ఉంటుం దామెకు. పిల్లలెవరైనా తనతో మాట్లాడ్డానికి వచ్చినా, లోపలి పిరికితనాన్ని దాచుకోటానికి మొరటుగా మాట్లాడేవారు.

సరసమ్మ బయటికి వెళ్ళారంటే ఇక అభయధామపు పిల్లలకు పట్టపగ్గా లుండవు.

తుంగమ్మ గది ముందుగానే ఇద్దరు పిల్లలు పరిగెత్తుకుంటూ వెళ్లారు. మరో ముగ్గురు నడుచుకుంటూ వెళ్ళారు.

ఎవరైనా వచ్చి తన దగ్గర కాసేపు కూర్చోకూడదూ అనిపించింది తుంగమ్మకు. కానీ, చాలాసేపు ఎవరూ రానేలేదు.

చీకటి పడుతూ ఉండగా చిన్నపిల్ల వచ్చి మునికాళ్ళమీద నుంచుని స్విచ్ వేసి వెళ్ళింది. దీపం వెలగ్గానే తుంగమ్మవేపు చూపిందా అమ్మాయి. తుంగమ్మ 'రా' అంది. సంకోచంతో ఆ పిల్ల నవ్వి పారిపోయింది.

''ఎక్కడికి కెళ్లారు బాబూ, ఒక్కరూ తిరిగి చూట్టంలా ?'' అని తుంగమ్మ విసుక్కుంటూండగానే లలిత లోపలి కొచ్చింది.

''జలజ ఏది ?''

''అలమేలు వేలు కోసుకుంది....''

''అవును, అయిడిన్ రాయడానికి వెళ్ళి ఓ సంవత్సరం కావస్తోంది.''

''అంతే అనుకున్నావా ? అయిడిన్ రాస్తే అయిపోయిందా ? అలమేలు చెయ్యాల్సిన వంటపనికూడా జలజదే మరి !''

తుంగమ్మ మనసులో జలజమీద పేరుకున్న కోపమంతా మంచులా కరిగిపోయింది.

''బయటికి వెళ్ళాలా ?''

''ఊఁ. కొంచెం ఇలా రా.''

తుంగమ్మ లలిత సాయంతో మెల్లిగా పైకి లేచింది. ఎంత తేలిగ్గా ఉంది ఒళ్ళు !

లలిత భుజాన్ని ఆసరా చేసుకుని నడుస్తూ తను ఇంకా ఎప్పటికి మామూలు మనిషి అవుతానా అనుకుంది తుంగమ్మ.

* * *

మరో పది రోజుల్లోనే తుంగమ్మ తేరుకుని తనంతట తానే

లేచి తిరగసాగింది. నీరసంగా వున్నా చూట్టానికి అందంగా ఉంది తుంగమ్మ.

తుంగమ్మకు బాగా పోషణ జరగాలన్నారు డాక్టరు. ఈ సలహా సరసమ్మగారికి మనసులో బెంగకు కారణమైంది. అభయ ధామపు జమా-ఖర్చుల పట్టీలో మంచి పోషణకు సరిపడే డబ్బు ఎప్పుడూ ఉండేది కాదు. సామాన్యంగా అలాటి సమయాల్లో సరసమ్మ నెలకు వచ్చే ఎనభయి రూపాయల గౌరవ వేతనం నుండి ఖర్చుపెట్టేవారు. అలా ఖర్చు పెట్టటానికి ఆమె ఎప్పుడూ బాధపడేవారు కారు. కాని పుష్టికరమయిన పళ్ళూ పాలూ కొనటానికి ఆ డబ్బూ చాలేది కాదు.... అనివార్య కారణాలవల్ల తుంగమ్మను ఆస్పత్రిలో జేర్చటం కుదర లేదు. అలా జేర్పించివుంటే....తుంగమ్మ వద్దన్నా సరే జేర్పించివుంటే బిడ్డను బ్రతికించటానికి వీలయ్యేదేమో—సరసమ్మ మనసులో ఈ శంక బలంగా చోటు చేసుకుంది. ఈ కారణంవల్ల తుంగమ్మ నెంత బాగా చూసుకున్నా ఆమెకు తృప్తి కలిగేదికాదు.

సరసమ్మ అనుకున్నదానికన్నా ముందుగానే తుంగమ్మ బాగా కోలుకుంది. సరసమ్మ సంతోషించారు.

ఆమెకు పిల్లలంటే ఇష్టం. ఆ సంగతి అందరికీ తెలిసినదే అయినా తుంగమ్మను గురించి ఆలోచించేటపుడు ఆమె కనిపించేది— ఆ పాప చనిపోవటమే మంచి దయిందేమోనని, దాన్ని పీడకలలా విస్మరించి, మళ్ళీ నలుగురిలో మామూలుగా కలిసిపోవటం కష్టసాధ్యం కాదు....

మరుక్షణమే పాప చావులోని లాభ-నష్టాలను బేరీజు వేస్తు న్నందుకు బాధపడేవారు.

సరసమ్మ గదిలో కూర్చుని రాసుకుంటున్నారు. తుంగమ్మ లోపలికొచ్చి—

"దొడ్డమ్మా, తోటలో ఎవరూ పూలు కొయ్యరాదని నియమం వుంది కదూ?" అంది.

"అవును. ఏం? ఎవరైనా కోశారా?"

"లేదు. ఊరికేనే అడిగాను."

"పూలు ఎక్కువగా వున్నపుడు నేనే కోసి అందరికీ ఇస్తు
న్నాగా!"

"అహఁ.... అందుక్కాదు...."

"మరి...."

"ఆఫీసురూంలో టేబిల్ మీద రోజూ కొత్తపూలు పెడితే
ాగుండదూ?"

"ఓ.... బాగుండకేం?"

"మరి పెట్టరేం దొడ్డమ్మా!"

"ఇంతకు మునుపు పెడుతూండేవారం కానీ, ఫ్లవర్ వాజ్ లోంచి
న్ని లాగేసేవారు ఎవరో... అలా చేసినవాళ్ళు దాన్ని తల్లో పెట్టు
ంనేవారుకూడా కాదు-నలిపి పారేసేవారు."

"అలాటివాళ్ళు కూడా ఉన్నారా?"

"ఏం, అందరూ నీలాటివాళ్ళే అనుకుంటున్నావా?"

"ఆఫీసు రూంలో ఎప్పుడూ ఫ్లవర్ వాజ్ లో పూలు ఉంచితే
గుంటుంది దొడ్డమ్మా! ఎవరైనా అభయ ధామం చూడ్డానికొస్తే...."

తుంగమ్మ సగంలో మాట ఆపేసింది. కానీ ఆ మాటకే సర
మ్మ మొహం సంతోషంతో ప్రసన్నమయింది. తుంగమ్మను గురించి
విడ అనుకున్నది అబద్ధంకాదు. అభయ ధామపు మంచి, తన మంచి
క్కటే అన్నట్టు ఆ పిల్ల మాట్లాడేది....

"నువ్వన్నదీ నిజమే తుంగా! కాని ఎంత పనని నేనొక్కదాన్ని
పుకోను చెప్పు?"

"రోజూ శుభ్రం చేసే బ్యాచ్ వుంటుందిగా, వాళ్ళకే అప్పచెబితే
."

"ఆ పనే ఎంత గొడవతో జేస్తారో చూశావుగా?"

"నిజమే దొడ్డమ్మా, కాని...."

అప్పు డనిపించిం దామెకు—'తను ఏమీ తెలియని పసిపిల్లతో
ట్లాటంలేదు. అనుభవం, అనుతాపంగల మనిషితో మాట్లాడు
న్నాను' అని.

"రేపటినుండి అలాగే చేద్దాం తుంగా! ఇవ్వాళ సాయంత్రం

ప్రార్థన సమయంలో ఈ సంగతి అందరికీ చెబుతాను.''

''అలాగే దొడ్డమ్మా!''

తన మాట మన్నించినందుకు తుంగమ్మ సంతోషించింది.

తుంగమ్మ ఇచ్చిన ఈ సూచన వెనుక సరసమ్మకూడా ఊహించలేని మరో కారణముంది. అది, మరో వారం రోజుల్లో వచ్చి చూస్తానని ఆమె తండ్రి రాసిన ఉత్తరం. ఒక వారపు అవధిలో అప్పుడే మూడు రోజులు గడిచిపోయాయి. తండ్రి తనను చూడ్డానికి అభయ ధామానికి రావటం, అక్కడి వాతావరణం అంతా బాగుండాలి. తను మంచి ఆశ్రయాన్ని పొందానని తండ్రి గుర్తించాలి. ఇదో పిల్లల మంద అనుకోరాదు తండ్రి. ఇదీ తుంగమ్మ ఆలోచన.

సరసమ్మ తండ్రీ కూతుళ్ళ సమావేశాన్ని గురించి ఆలోచించటం లేదు. ఆమె ఆలోచన ఆ సమావేశాన్నిదాటి ఆ తరువాతి సంగతి వేపు పయనిస్తూంది....ఆ తండ్రి ఇక తన కూతుర్ని తీసుకొళ్ళచ్చు. జరిగినదానిమీద ఓ తెర వేసి, కొత్త అధ్యాయాన్ని ప్రారంభించవచ్చు.

సామాన్యంగా ఇలాటి సందర్భాల్లో ఆవిడ సంతోషించాలి. కాని ఈసారిమాత్రం ఆమెకు బాధగానే ఉంది.

ఆమె దృష్టిలో అదో ఆశ్చర్యమే. బ్రతుకులో తప్పుదారి తొక్కిన తుంగమ్మ అభయ ధామాన్ని వెతుక్కుంటూ వచ్చిన రోజు నుండే సరసమ్మ హృదయాన్ని ఆకట్టుకుంది. మంచి గుణాన్ని చూడగానే త్వరగా బయటపడే సరసమ్మ ఆత్మీయతాభావం- తుంగమ్మ విషయంలో పొంగులువారి ఆమెను సంతృప్తి పరచింది.

అలాటి మంచిపిల్ల తమవద్దనే తమకు సాయంగా వుండటానికి వీలయితే!....

బ్రతుకునంతా ఈ చిన్న పరిధిలో గడపమని చెప్పటం ఎలా!?

రాస్తున్నదాన్ని ఆపేసి తుంగమ్మను పరిశీలించి చూశా రామె. తుంగమ్మ కట్టుకున్నది సరసమ్మ చీరె. విధవ అయ్యాక తమ జీవితంలో చంద్రోదయం అవుతుందనుకున్న రోజున అలాటి చీరెనే ఆమె కట్టుకున్నారు. కానీ ఆ చంద్రోదయపు కల్పన ఆమె భ్రమగానే

మిగిలి పోయింది. ఆ కల్పనలోని మాధుర్యమే ఆమెకు మిగిలిన స్మృతి. అప్పటినుండి అలాటి చీరెనే అప్పుడప్పుడూ కొంటూ వుండేవారు.

తుంగమ్మ అభయ ధామానికి వచ్చిన మూడవ రోజున ఆమెకు కట్టుకోటానికి మారుచీరె ఇవ్వాల్సి వచ్చింది సరసమ్మ. అప్పుడు తమకు నచ్చిన ఆ చీరెనే ఇచ్చారు. కానీ ఆ చీరెకు సరసమ్మ బ్రతుకులో ఉన్న ప్రత్యేకత ఎవరికీ తెలియదు. సరసమ్మ ఆ రహస్యాన్ని తమ మనసు లోనే భద్రంగా దాచుకున్నారు. ఇవేమీ తెలియని, ఆ చీరె కట్టుకున్న తుంగమ్మను చూసినప్పుడు సరసమ్మకు తమ జీవితంలో గడచి పోయిన అధ్యాయం గుర్తుకొచ్చేది. అప్పుడామె మనసులోనే అను కునేవారు-'తుంగమ్మ జీవితం బాగుపడాలి. ఆమె సుఖంగా బ్రతకాలి. ఆమె జీవితం మూడు పూలూ, ఆరు కాయలుగా ఉండాలి గానీ ఇప్పుడే వాడిపో కూడదు.'

"అలా చూస్తున్నారేం దొడ్డమ్మా.....!"

ఆలోచనల్లోంచి బయటపడ్డారు సరసమ్మ.

"ఉట్టినే చూశాను. చూడకూడదా ఏమిటి?"

'దిష్టి తగుల్తుంది' అన్న మాట తుంగమ్మ నాలుక చివరిదాకా వచ్చింది. కానీ అలా చెప్పేటంత సాహసం కలుగక మాట మ్రింగే సింది. దానికి మారుగా ఆమె పెదవులమీద చిరునవ్వు వెలసింది.

అప్పుడు హఠాత్తుగా, అప్రయత్నంగా సరసమ్మ అన్నారు—

"మీ నాన్నగారు వచ్చాక వెళ్ళిపోతావుటమ్మా తుంగా?"

ఈ ప్రశ్నను ఎదురుచూడని తుంగమ్మకు, ఏం జవాబు చెప్పాలో తోచలేదు. కానీ, తరువాత ఏమిటి? అన్న ప్రశ్న ఆమెని అశక్తు రాలిని చేసింది.

"నాకు తెలియదు దొడ్డమ్మా, నాన్నగారేమంటారో!"

తామలా అడగటమే పొరపాటన్నట్టుగా —

"సరేలే, దాందేముంది? తరువాత చూసుకోవచ్చు" అన్నారు సరసమ్మ.

కాసేపు మౌనంగా ఉన్న తుంగమ్మ "ఇవ్వాళ్టినుండీ నేనూ అందరితోబాటు పడుకుంటాను దొడ్డమ్మా!" అంది.

"ఏం? లోపల ఉక్కగా ఉందా?"

"కాదు దొడ్డమ్మా! ఇప్పుడు నేను బాగానే ఉన్నాగా! అందరిలా బయట పడుకోటం న్యాయం కదూ?"

సరసమ్మ మందలింపుగా "చాల్లే, అంతా నీకే తెలిసినట్టు.... పచ్చి ఒళ్ళు. అప్పుడే...." అన్నారు.

"అది కాదు దొడ్డమ్మా! మిగతా పిల్లలేమన్నా అంటారేమోనని—"

తను అభయధామానికి వచ్చిన మరుసటిరోజు పొట్టిదమయంతి జలజను అన్నమాట తుంగమ్మకింకా గుర్తుంది. కాని సరసమ్మ ఖచ్చితంగా చెప్పేశారు.

"అమ్మాయ్ తుంగా! నేనిక్కడ మేట్రన్‌ని తెలుసా?"

తుంగమ్మ నిరుత్తరురాలైంది.

కాలక్షేపంకోసం ఆమె ఆ గదిలోని చిన్న చిన్న వస్తువులను దుమ్ము దులపసాగింది. సరసమ్మ దానిక్కూడా అభ్యంతరం చెప్పారు. వచ్చేవాళ్ళకోసం వేసిన ఓ కుర్చీ చూపించి, "తుంగా! మెదలకుండా అక్కడ కూర్చో" అన్నారు.

"ఉహూఁ....వాళ్ళంతా ఏమన్నా అనుకుంటారు."

సరసమ్మకు ఒళ్లు మండింది.

"చెప్పినమాట వినమంటూంటే....ఓ పుస్తకం తీసుకుని చదువుకుంటూ కూర్చో."

తుంగమ్మ విధిలేక పుస్తకాల బీరువా వేపు వెళ్ళింది. అప్పుడే తలుపు దగ్గిరనుండి జలజ కంఠం వినపడింది-

"ఓ....ఇక్కడున్నావా? ఆ పిల్లలు అనటానికీ, నువ్వు చెయ్యటానికీ సరిగ్గా ఉంది."

తుంగమ్మ వెనుదిరిగి చూపింది.

సరసమ్మ కనుబొమలు ముడివడ్డాయి.

"ఏమంటున్నారు వాళ్లు?"

"తుంగక్కకు అప్పుడే 'పు-పు' అని పేరు పెట్టేశారు.

"ఓ...." సరసమ్మ నవ్వారు.

తుంగమ్మకేం అర్థం కాలేదు. కాతర్య, కుతూహలాలతో—
"ఏమి టంటున్నారు?" అంది.
"పు-పు. అంటే తెలియదూ?"
"ఊఁ. హూఁ.... తెలియదు."
"పుస్తకాల పురుగు అని. అదేం, తుమకూరు స్కూల్లో ఈమాత్రంకూడా చెప్పలేదూ?"
"అవునవును. ఇలాటివన్నీ చెప్పటానికే వాళ్లు ఉండేది!" సరసమ్మ వెక్కిరించారు.
తుంగమ్మ హాయిగా నిట్టూర్చింది. పుస్తకాల పురుగు అన్నది సిగ్గుపడాల్సిన విషయమేం కాదు.
జలజ పనిమీద వచ్చింది.
"దొడ్డమ్మా, మీ అనుమతి కోసం నన్ను పంపించారు. అనుమతి ఇస్తారా?"
"దేనికి?"
"ఇస్తారా చెప్పండి."
"అసలు సంగతి చెప్పు ముందు—"
జలజ గంభీరంగా అంది—
"ఇవ్వాళ సాయంత్రం సుమతి 'డాన్స్' పెట్టుకుందామనుకుంటున్నాం. దాంతోబాటు సుంద్రా, రాధ పాటలు పాడతారు. తుంగక్కకు నయమయిందని ఈ కార్యక్రమం."
"అంతేకదా! అలాగే. రాత్రి వంటయ్యాక మొదలుపెట్టండి. ఎక్కడ పెట్టుకుంటారు?"
సంతోషంతో జలజ ముఖం విప్పారింది.
"సావిట్లోనే. తుంగక్క గదిలో చోటు సరిపోదు. సావిట్లోనే నయం కదూ దొడ్డమ్మా?"
"అవును. సంగీతం మేడంని కూడా ఉండమంటారా?"
"ఉహుఁ....ఆమె ఉంటే సుమతి డాన్సు చెయ్యదుట."
"సరే. నేను కూడా వెళ్ళిపోవాలా?"
"ఇంకా నయం. మీరుండి తీరాలి."

జలజ మిగతా ఏర్పాట్లకోసం బయటికి వెళ్ళింది.

''నేనూ వెడతాను దొడ్డమ్మా!'' అంటూ తుంగమ్మ జలజను అనుసరించింది.

జలజ— సరసమ్మ నమ్మకానికి పాత్రురాలయిన పిల్ల. స్నేహమయి. సద్గుణాల ఖని. ఆమె అభయ ధామానికి రావటంవల్లనే, అక్కడి వాతావరణంలో తాము చూపించిన ప్రీతి వాత్సల్యాలవల్లనే మంచి పిల్లగా మారిందన్న సత్యం సరసమ్మకు తెలుసు. మొదట జలజలో సందేహ స్వభావం ఉండేది. క్రమంగా దాని స్థానంలో సంకోచం తలెత్తింది. ఆ ఘట్టం త్వరలోనే దాటి ఆమె అభయ ధామపు ఆధార స్థంభాల్లో ఒక్కతిగా అయిపోయింది.

ఎప్పుడో ఓ రోజు ఈ పక్షి గూటిని వదలి పోతుందన్న విషయంలో సరసమ్మకు సందేహం లేదు. ఎవరికైనా నచ్చి, మంచి సంబంధం దొరికితే జలజకు తొందరగా పెళ్ళిచేసి పంపాలన్నదే ఆమె ఉద్దేశం కూడా. జలజ అలా వెళ్ళి అభయ ధామపు కీర్తిని వినబెడుతుందని ఆమెకు నమ్మకమే. జలజ తమ కెంతో ప్రియమైనదైనా ఆమె వెళ్ళిపోవటంవలన తాను దుర్బలురా లవుతానని సరసమ్మకు అనిపించటంలేదు.

కానీ, తుంగమ్మ సంగతి వేరు. భౌతికంగా ఆమెకూ, జలజకూ మధ్య కొలవలేనంత అంతరముంది. జలజలో సరసమ్మకు కనిపించింది ఓ సంసారాన్ని వెలిగించే శక్తి. తుంగమ్మలో అపరిమితమైన గుప్తసామర్థ్య ముందని ఆమె అభిప్రాయం.

సరసమ్మ టేబిల్ క్రిందికి కాళ్ళు చాపి కుర్చీలో వెనక్కి వాలి కూర్చున్నారు.

ఆవరణలోని పూలతోటలో ఓ మూల పొద్దు తిరుగుడు పువ్వు వెడల్పుగా విచ్చుకుని సరసమ్మనే చూస్తూంది.

అభయ ధామంలో సరసమ్మ పని చేయటానికి వచ్చినప్పుడు, ఆమె యౌవనం అడవిలోని పుష్పంలా కళావిహీనంగా ఉంది. మొదట, పొద్దుపోవటానికి, కాస్త సంపాదనకోసం అనుకున్న వృత్తి రాను రాను జీవిత ధ్యేయంగా పరిణమించింది. అప్పుడు అభయ ధామం

ఉన్నది ఇరుకు సందులో. ఏ వసతీ లేదు. వారానికో పిల్లయినా తప్పించుకు పోయేది. కారణం....నిండని కడుపు. ఆ తర్వాత దీన్ని చూస్తున్న సమితి మారింది. ఎవరో కొత్త భవనం కోసం ఇరవై ఐదు వేలు విరాళ మిచ్చారు. సమితి కార్యదర్శినికి ఈ పని కీర్తికోసం పాకులాడే సాధనం కాదు కాబట్టి, ఆమె మతప్రచారకులు కూడా సిగ్గుపడేలా పతితోద్ధరణకోసం శ్రమించారు.

ఆ శ్రమ ఎంతవరకూ ఫలించిందన్న సంగతి వేరు. ఎన్నో సార్లు సరసమ్మ నిరాశా-నిరుత్సాహాలతో బాధపడ్డారు. కాని తాము చేస్తున్నపని మంచిదన్న ఆమె విశ్వాసం అచంచలంగానే ఉన్నది.

సరసమ్మ తలలోని జుట్టు నెరిపింది ఈ బ్రతుకులోనే. ఎంత మందికి ఆమె దొడ్డమ్మ కాలేదు!....జబ్బుతో బాధపడ్డా, మళ్ళీ తాము వచ్చిన చోటుకే పారిపోయినవారూ, పెళ్ళయి వెళ్ళినా పాత జీవితం లోకి తిరిగి వచ్చినవారూ కొంతమంది ఉన్నా, సరైన దారిలో నడచి మంచి అనిపించుకున్నవారి సంఖ్యకూడా తక్కువదేం కాదు. అలాటి వాళ్ళను తలుచుకున్నప్పుడు ఆమె మనసు నెమ్మదించేది.

ఆ పొద్దుతిరుగుడు పువ్వు....పూలతోట!

ఇంతకు ముందు అభయ ధామం ఉన్నచోట పూలతోట ఉండేది కాదు. పూలు కాదు-ఓ తులసిమొక్కకూడా లేదు. ఇప్పుడున్నది ఎనిమి కుంటేళ్ళక్రిందట కట్టించినది. ఈ భవనం నిర్మాణంలో సరసమ్మ చాలా శ్రద్ధాసక్తి వహించారు. అప్పటి దివాన్‌గారి ధర్మపత్ని అమృతహస్తం తోనే కొత్త భవనానికి ప్రారంభోత్సవం జరిగింది.

ఎక కొత్త భవనంతో పాటు క్రొత్త అధ్యాయం మొదలయింది. తాము స్వయంగా వాళ్ళనీ వీళ్ళనీ అడిగి పూలమొక్కలనూ, విత్తనాలనూ తెచ్చివేశారు. పిల్లలతోబాటు చెట్లకు నీళ్ళు పోశారు.

మొదట గులాబిమొగ్గ....మల్లె సౌరభం....మొదటి దినాలు....

ఆ తర్వాత విచ్చుకుంది ప్రొద్దుతిరుగుడు పువ్వు.

"పోస్ట్...."

ఆ మాట సరసమ్మను మేల్కొల్పింది. కిటికీలోనుండి ఏదో వచ్చి క్రింద పడింది. సరసమ్మ లేచి నుంచుని చూశారు.

ఉత్తరాలు లేవు. ఉన్నదొక్కటే పత్రిక. సంపాదకు లొకా యన ఈ వారపత్రికను అభయ ధామానికి ఉచితంగా పంపుతున్నారు.

దాన్ని చేతిలోకి తీసుకుని విప్పారు.

ముఖచిత్రం ముగ్ధతకు ప్రతిమూర్తిగా ఉన్న ఓ విశాల వదనం. దానిక్రింద రాసుంది-

"భారతీయ చిత్రరంగంలో ఉదయిస్తున్న నూతన తార నిమ్మి-"

* * *

సాయంత్రం హార్మోనియం ధ్వని చెయ్యసాగింది. మృదంగం ధం....ధం....అని అందుకుంది. ఘల్....ఘల్ మన్నాయి సుమతి కాళ్ళ గజ్జెలు.

సరసమ్మ అదంతా చూసి ఆశ్చర్యపోయారు. మొహానికి చేతు లకి రాసుకున్న రంగు ఎలా తయారు చేశారో మరి! గోచీ పోసి కట్టు కున్న రంగు చీరె- రెండు నెలలక్రితం వచ్చిన తెలుగుపిల్లదై ఉండాలి. పట్టుజాకెట్టు పొంకంగా ఉన్న కటిప్రదేశానికి పొందికగా అమరింది. సంవత్సరపు మొదట్లో అభయ ధామంనుండి వెళ్ళిపోయిన ధనవంతుల అమ్మాయి ఇచ్చుండాలి దాన్ని.

'ధిమి-ధిమి తక—తక ధకధిమి....తదిగిణతోం....'

సుమతి చేతులు జోడించి వందనం చేసింది. ఖాళీగా వదలిన స్థలంలో వృత్తాకారంగా నర్తించసాగింది.

సరసమ్మకూ తెలుసు, అమ్మాయిలకూ తెలుసు- సుమతి భోగం వాళ్ళపిల్ల. కానీ ఆ జీవితంనుండి పారిపోయి వచ్చిందామె. అర్ధరాత్రి వీధిలో ఒంటరిగా ఉన్న సుమతిని పోలీసులు పట్టుకున్నప్పుడు, సుమతి ప్రతిఘటించలేదు. పారిపోవాలన్న ప్రయత్నమూ చెయ్యలేదు. అభయ ధామంలో చేర్పించినప్పుడు ఆమె సంతోషానికి అవధి లేదనిపించింది.

ఆ నృత్యం పూర్వాశ్రమంలో ఆమె నేర్చుకున్న విద్య.

ఝణక్....ఝణక్....జణిక్....జణిక్....ఐ....ఝణక్....

ఆ నాద మాధుర్యపు మత్తులో తుంగమ్మ, జలజ, లలిత— అందరూ కూర్చుని వింటూ, చూస్తూ తన్మయులై పోయారు చిరు నవ్వులతో....

శాస్త్రీయం కాని నృత్యం నిజమే కాని, చూస్తున్న ప్రియ తమ్ముణ్ణి, విటుణ్ణి, పిచ్చివాడిని చేసే శక్తి వుం దానృత్యానికి.

నృత్యం చూస్తూ, సుమతి పాదాల చలనాన్ని గమనిస్తూ కూర్చున్నారు సరసమ్మ.

తరువాత గుడ్డి సుంద్రా పాడింది-

"ఎక్కడున్నావయ్యా, రంగయ్యా, రావయ్యా..."

రాధ పాడింది-"నేను నీ దాసుడను....నీవు జగదీశుడవు..."

మళ్లీ సుమతి వేటగత్తె నృత్యం...

వేటగాడు లేడు నిజమే కాని, సుమతి లలితవేపు వాలుచూపులు విసురుతూంది. లలిత నిశ్చలంగా కూర్చుంది. కానీ దీన్ని గమనించిన కొంతమంది మొహాలు ఎర్రబడ్డాయి.

ఆఖరి నృత్యం...సుమతి కృష్ణ నృత్యం చేసింది. పిల్లనగ్రోవి నూదే కృష్ణుడు...ఆ కృష్ణుని బాల్యక్రీడలు 'అద్భుతం'. వెన్న దొంగ కృష్ణుడు. రాధా మనోహరుడు కృష్ణుడు...

మొదటి నృత్యం అవుతూండగానే ఎవరో లేచి దీపం వేశారు. విద్యుద్దీపాల వెలుగులో నర్తిస్తున్న కృష్ణుడు అక్కడున్న గోపికా స్త్రీల మీద తన మాయాజాలాన్ని విసిరాడు.

కార్యక్రమం పూర్తయ్యేసరికి బాగా చీకటి పడింది.

జలజ లేచి నుంచుని "కార్యక్రమం పూర్తయింది...అందరికీ వణక్కం" అంది.

పిల్లలంతా గుంపుగా 'కృష్ణుణ్ణి' చుట్టుముట్టారు. తుంగమ్మ కూడా సుమతి దగ్గరకి వెళ్ళి 'చాలా బాగుంది' అని అభినందించింది.

మూగ కల్యాణి సిగ్గుతో ముడుచుకుపోయింది. లలిత అటు వేపు తిరిగి చూడలేదు.

సరసమ్మ అందరివేపు చూసి నవ్వి తమ గదిలోకి వెళ్ళి పోయారు. కానీ ఒక్కరే కూర్చున్నప్పుడు ఆమె మొహంలో నవ్వు లేదు.

ప్రార్థన...ఆఫీసు గదిలో పూలవాజ్ పెట్టే విషయం...భోజనాలు...నిద్ర...

సరసమ్మకు చాలాసేపు నిద్రపట్టలేదు. విపరీతంగా ఉక్క పోస్తూంది.

లేచి బయటికి వచ్చారు. అరుగుమీదా, సావిట్లో పడుకున్నా రందరూ. వెన్నెల సావిట్లో ఓ వేపు పడింది.

సరసమ్మ చూశారు. సుమతి పక్క ఖాళీగా వుంది.

ఆమెను వెతకటం కష్టమేం కాదు. లలిత పక్కలో వుందామె. ముడుచుకుని లలితను తాకుతూ పడుకుం దామె.

సరసమ్మ ఊహ అబద్ధం కాదు.

వాడిన మొహంతో లోపలి కెళ్ళా రామె.

* * *

నోట మాటరాక మూగవాడిలా కూర్చున్న తండ్రి, ప్రేమతో తదేకంగా అక్కవేపే చూస్తున్న తమ్ముడూ, కళ్ళల్లోంచి ప్రవ హిస్తున్న కన్నీటిని తుడుచుకోకుండా నుంచున్న తుంగమ్మ....

ఇది సరసమ్మకు కొత్తేమీ కాదు. అలాటపుడు ఎలా ప్రవర్తిం చాలో కూడా ఆమెకు తెలుసు.

తండ్రినీ-పిల్లలనూ ఏకాంతంగా వదిలి బయటికి వచ్చా రామె.

"బాగున్నావా అమ్మా?"

"ఉన్నా నాన్నా!..."

"ఒంట్లో ఆరోగ్యం. ."

"బాగుంది నాన్నా! దొడ్డమ్మ బాగా చూసుకున్నారు."

తండ్రికి సరసమ్మ అంతా వివరించి ఉత్తరం రాశారు.

ఆయన తీసుకున్న జాగ్రత్త ఫలితంగా తుంగమ్మ తమ్ముడి కేం వివరాలు తెలియవు. "ఏదో జరిగింది. నారాయణమూర్తి వెళ్ళి పోవటం వలన అక్క బాధపడుతూంది. అందుకనే బెళగాలి కవి బయలుదేరిన అక్క బెంగుళూరు వచ్చి హాస్టల్‌లో చేరింది" అను కున్నా డతను.

"పద్దక్క ఉత్తరం రాసిందా నాన్నా?"

"ఊఁ... రాసిందమ్మా!"

"అక్కకు తెలుసా నాన్నా?"

తమ పక్కనే కూర్చున్న కొడుకు వేపే చూస్తూ-

''లేదమ్మా, నీ అనారోగ్యం సంగతి పద్మకు రాయనే లేదు. జూన్ నెలలో నేనే వెడదా మనుకుంటున్నా''అన్నా రాయన.

అయితే అక్కయ్యకు జబ్బు చేసిం దన్నమాట! ఇప్పుడు నయంగా ఉన్న అక్కయ్య నోసారి తాకాలనిపించింది తమ్ముడికి.

''రిటైరయ్యారుగా. ఇక ఏం చేద్దామని?''

కూతురిని ఆ మాట అడగాలనే వచ్చా రాయన. కాని తమ కన్నా ముందు ఆమే ఆ ప్రశ్న అడిగింది.

కానీ ఆ ప్రశ్నకు సూటిగా బదులు చెప్పటం అంత సులభం అనిపించటం లేదు.

''తుమకూరు వదిలేద్దామా తుంగా?''

తుంగమ్మకు తెలుసు. తనవల్లనే ఆ తీర్మానానికి వచ్చా రాయన. అందులో సందేహ మేమీ లేదు.

కానీ తమ్ముడికి ఆ మాట అత్యాశ్చర్యం కలిగించింది. అతను తాము వెళ్ళే కొత్త ఊరిని గురించి ఊహించుకో సాగాడు.

''ఎందుకు నాన్నా?''

''ఏమిటో...రిటైరయ్యాక అక్కడ ఉండా లనిపించటం లేదు.''

ఆ మాట నిజమే. కానీ అసలు కారణాన్ని ఆయన చెప్పక పోయినా తుంగమ్మ గ్రహించింది.

''ఎక్క డుందామని?''

''ఎక్కడో ఓ చోట... బాబు చదువుకు ఇబ్బంది లేకుండా హైస్కూలుంటే సరి.''

''బెళగాలి వెళ్ళి పద్దక్కదగ్గ రుంటారా?''

బహుశః తను వెళ్ళలేనన్న భావం ఆమె మనసులో ఉందేమో- అలా మాటల రూపంలో బయట పడింది. అది విన్న తండ్రి నుదిటి మీద గీతలు స్పష్టంగా కనిపించాయి.

''మరి నువ్వో?''

తుంగమ్మ ఆ విషయం పూర్తిగా ఆలోచించి ఓ నిర్ణయానికి

రాలే దింకా. సరసమ్మ ఏమీ సలహా ఇవ్వలేదు. జలజ అడిగినప్పుడు కూడా "మా నాన్నగార్ని రానీ, అప్పుడు చూద్దాం" అంది. ఇప్పుడు తండ్రి రావటం అయింది. ఆమె మనసులో దాగిన కొత్త ఆశలు మాటల రూపంలో బయటికి రావటానికి ప్రయత్నిస్తున్నాయి.

అయినా వెంటనే ఏమీ చెప్పలేకపోయింది. మెల్లిగా తడబడుతూ అంది-

"నాన్నా! నువ్వేం అనుకోకు. నేను...రాను."

"తుంగా!"

"అవు న్నాన్నా! ఏదైనా పనిలో చేరతాను."

"పనా!"

"ఊఁ... అందులో తప్పేమిటి నాన్నా?"

"త ప్పేమి టని న న్నెందు కడుగుతా వమ్మా?"

ఆ ప్రశ్న వెనుక వద్దన్నా కటువైన వ్యంగ్యం అస్పష్టంగా తన మొహం చూపించింది. అప్పుడు, తన నెత్తిమీద తనే రాయి వేసుకున్నప్పుడు, 'అందులో తప్పేమిటి' అని అడిగిందా?

గత స్మృతిలోని తేలు తన విషపు కొండెంతో తుంగమ్మను బలంగా కుట్టి మంటలు రేపింది. అప్పుడప్పుడే ఆగిన కన్నీరు మళ్ళీ నే నున్నా నంది.

కంపిస్తున్న కంఠంతో తండ్రి అన్నారు.

"ఎందు కేడుస్తావ్ తుంగా...ఏడవకు."

ఇంత జేసి ఇంకా ఏడు పెందుకూ అన్న భావం బయటపడి, అసలే బాధ పడుతున్న కూతుర్ని మరింత బాధ పెడుతుం దేమోనని వూరుకున్నా రాయన.

తుంగమ్మ మనసులోనూ అదే ఆలోచన మెదిలింది.

"మిమ్మల్ని ఇప్పటికే చాలా హింస పెట్టాను. ఇంకా మిమ్మల్ని ..."

"చెప్పమ్మా, నీ మనసులో ఏముందో చెప్పు."

"మీ రింక నాకోసం ఏమీ బాధ పడొద్దు."

"అంటే....?"

"నా కాళ్ళమీద నేను నిలబడతాను."

"అమ్మా!"

"నాకు జరగాల్సిన వైభవమంతా జరిగిపోయింది. ఇక ఈ బ్రతుక్కి ఏమీ అక్కర్లేదు నాన్నా....ఏమీ అక్కర్లేదు."

పెళ్ళి అన్నమాట అనకపోయినా దాన్ని గురించే ఆమె మాట్లాడుతూందని గ్రహించిన తండ్రి మొహం నల్లబడింది. పెళ్ళి కావాలనుకున్నా అదేమంత సులువైన సంగతి కాదు. అయినా....ఆయన ఆలోచనల్లో... దూరపు వూళ్ళో, బెళగాలిలోనో మరెక్కడైనానో, కొత్త వాతావరణంలో పెళ్ళి వీలయితే....అలా ఆశించటమూ దుస్సాధమే. తాను చనిపోయే లోపల కొడుకు కోదారిలో పడాలి. కూతురి బ్రతుకు బాగుపడాలి. ఇంత జరిగితే హాయిగా, నిశ్చింతగా ఊపిరి వదిలేయవచ్చు.

కానీ ఇప్పుడా కూతురే తనకేమీ అక్కర్లేదంటూంది.

"అలా అనకూడదమ్మా తుంగా. అంత నిరాశ చెందితే ఎలా?"

"నిరాశ కాకపోతే ఏమిటి నాన్నా? నా కింకా ఏంకావాలి?"

ఆ మాటకి సమాధానం ఏం చెప్పగలరాయన? ఏమిటుంది అసలు?

తండ్రి సాయం కోసం కొడుకువేపు తిరిగాడు.

"చూడరా బాబూ....మీ అక్కయ్య మనతో రాదుట."

"రావా అక్కా?"

తుంగమ్మ బదులు చెప్పలేదు. ఆయనే మళ్ళీ అన్నారు-

"ఇక మీ అక్క మనల్ని వదిలేసి ఇక్కడే ఉండిపోతుందిట."

వ్యధతో ఆయన కంఠం వణికింది. కొడుకు కళ్ళల్లోనూ నీరు తిరిగింది.

"పోనీ, మనం కూడా ఇక్కడే ఉండి పోదామా నాన్నా?"

ఎంత సులువైన పరిష్కారం!

మౌనంగా దుఃఖాన్ని దిగమింగుకున్నా రాయన.

ముగ్గురికీ వూపిరి పీల్చలేనంతటి బాధాకరమైన సన్నివేశం. పరసమ్మ తలుపు దగ్గర కనిపించారు. ఈపాటికి వెళ్ళటానికి

తీర్మానించుకుని తండ్రీ-కూతుళ్ళు తమకోసం ఎదురుచూస్తూ ఉంటారనుకొన్నా రామె. తుంగమ్మను మధ్యాహ్నపు భోజనానికి ఉంచుకోవాలి. వీళ్ళోక్కలు సమారంభంకోసం ఏదైనా వంట చేయించాలి—అని ఆలోచిస్తున్నా రామె. కాని ఆమె కళ్ళబడిన దృశ్యం ఆమె ఊహకి భిన్నంగా ఉంది.

సరసమ్మ రాక అందరికీ ఓ విధంగా ఊపిరి పీల్చుకోనిచ్చింది. కాని వాళ్ళని చూసి విజయం పొందిన మౌనం వెక్కిరించింది.

ఇలా బయట పడిపోవటం రిటైరయిన హైస్కూల్ మాస్టారయిన తమకు తగదని నిర్ణయించుకున్న తుంగమ్మ తండ్రి, గొంతు సవరించుకుని, సంభాషణకు ఉపక్రమించారు.

"అమ్మా! మీరు మా అమ్మాయికి ఆశ్రయమిచ్చి ఎంతో ఉపకారం చేశారు. ఈ జన్మలో మీ ఋణం తీర్చుకోలేను."

సరసమ్మ తమ మంచంమీద కూర్చున్నారు.

"ఇందులో ఉపకార మేముందండి? మా కర్తవ్యం మేము చేశామంతే!"

అభయ ధామంనుండి వెళ్ళిపోతూ ఆ సంస్థ మంచి చెడ్డలను గురించి ప్రస్తావిస్తున్నారు అనుకున్నారు సరసమ్మ. ఇప్పటిదాకా అభయ ధామం చేసిన సేవనుగురించి వివరించటానికి ప్రయత్నించారు.

కానీ తుంగమ్మ తండ్రి ఆ విషయాలు వినటానికి కుతూహలం చూపించలేదు. నిరాశతో అన్నారు-

"మా అమ్మాయి రానంటోంది. ఇక్కడే ఉంటుందిట."

సరసమ్మ చకితులయ్యారు. ఆనందమూ కలిగింది. కానీ మొదటి భావాన్ని మాత్రమే బయటపెడుతూ—

"నిజమా తుంగా, నాతో చెప్పనే లేదేం?" అన్నారు.

కూతురి నిర్ణయానికి బహుశః ఈ సరసమ్మ కారణమయి ఉంటుందని ఊహిస్తున్న తుంగమ్మ తండ్రి సూక్ష్మంగా ఆమె మొహాన్ని పరిశీలించి చూశారు. అక్కడ కృత్రిమత కనిపించలేదు. మొహంలోనూ, మాటల్లోనూ నిజాయితీయే స్పష్టంగా కనిపిస్తూంది.

తుంగమ్మ మాట్లాడలేదు. సరసమ్మ మళ్ళీ అడిగారు-

"ఏమిటమ్మా, నీ మనసులో ఏముంది? ఎందుకు వెళ్ళనంటు న్నావ్? చెప్పు తుంగా!"

"నా కిష్టం లేదు దొడ్డమ్మా! నే నిక్కడే ఉంటాను. చదువు కుంటాను. ఏదైనా ఉద్యోగం చేస్తాను....కాని వెనక్కి వెళ్ళను."

'నన్నెవరూ అపార్థం చేసుకోకూడదు. దయచేసి నా మాట కాదనకండి. నా నిర్ణయాన్ని మార్చుకోమనకండి' అన్న వేడుకోలూ- వ్యగ్రతా ఉన్నా యామె కంఠంలో.

తుంగమ్మ తండ్రి ఆశ్చర్యపోయారు. ఆ మాటల్లోని పట్టు దలా, దృఢత్వం...తుంగమ్మేనా అలా అన్నది? తనలోనూ, ఆమె తల్లిలోనూ లేని స్వభావ మిది. తను ఎత్తుకుని పెంచి, పెద్దజేసిన కూతురేనా ఈమె?

అలా ఆలోచిస్తూ, అందులో లీనమయిన క్షణంలోనే ఆయన మనసు తేలికయింది. సమస్యలన్నీ ఒక్కసారిగా పరిష్కారమయి నట్టుగా, దిమ్మెక్కిన తల తేలికయినట్టుగా అనిపించింది.

"సరే, తుంగ ఇష్టప్రకారమే కానివ్వండి" అన్నారు.

సరసమ్మ తమను తామే నమ్మలేని వారిలా ఆశ్చర్యంగా చూశారు.

తండ్రి బలవంతం, కూతురు ఎదురు తిరగటం, గొడవ, సమితి ముందు పంచాయతి...ఏమి చేవిటో ఆలోచిస్తున్నా రామె. ఈ ఒక్కసారీ ఆమె ఊహ ఒక్కటీ నిజం కాలేదు.

"మీ రేం బాధపడకండి. మీ అమ్మాయి బాధ్యత నాది. నా కెవరూ పిల్లల్లేరు. నా కూతురిలాగే చూసుకుంటా!"

హృదయపు లోతుల్లోనుండి వెలువడిన ఆమె మాటలు తండ్రీ కూతు ళ్ళిద్దర్నీ చలింప చేశాయి.

కృతజ్ఞతతో దొడ్డమ్మవేపు చూసింది తుంగమ్మ.

సరసమ్మ-"తుంగా, నీ తమ్ముడికి లోపల అంతా చూపించి రా అమ్మా!" అన్నారు.

తుంగమ్మ కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ, తమ్ముడి చెయ్యి పట్టుకుని, స్నేహితురాళ్ళ దగ్గరకి బయలుదేరింది.

పెద్దవా రిద్దరూ అరమరికలు లేకుండా మాట్లాడుకోవటానికి ఎంతోసేపు పట్టలేదు...మామూలు విషయాలు...అభయ ధామానికి గవర్నమెంటూ, పురజనులూ అందిస్తున్న సహకారం...సమాజంలో అధోగతికి దిగజారుతున్న నీతి.

ఏ విషయం మాట్లాడుతున్నా తమ సంగతే మళ్ళీ మళ్ళీ తుంగమ్మ తండ్రి కళ్ళముందు నిలుస్తూంది.

''ఇలా జరుగుతుం దనుకోలేదమ్మా, నేను.''

ఆ ఆడపిల్లను కన్న తండ్రి మనసును ఓదార్చేలా ఏమైనా చెబితే బాగుండు ననిపించింది సరసమ్మకు.

''మీరు మరోలా అనుకోకపోతే-నా ఉద్దేశంలో మీ అమ్మాయి మంచిదే. జరిగిందానికి సంజాయిషీ అని కాదుగానీ, నమ్మకద్రోహానికి ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?....కానీ ఇది మాత్రం నిజం. తుంగమ్మ గుణవంతురాలు. ఆమెను కన్న తల్లి-తండ్రులు దురదృష్ట వంతులు కారు.''

''భలేగా చెప్పారు'' అన్నారు తుంగమ్మ తండ్రి, శుష్క-హాసంతో.

సరసమ్మ స్వాభిమానం దెబ్బతింది.

''అలా అంటారేం? సభ్య గృహస్థు లనుకుంటున్న వంద కుటుంబాల్లోని వెయ్యి రంకులు చూపించమంటారా? డబ్బు, హోదాల చాటున ఎన్నయినా దాచవచ్చు గాని....''

తుంగమ్మ తండ్రి తల ఆడించారు, ఒప్పుకొంటున్నటుగా. సరసమ్మ మాటల్లో నిజం ఉంది.

....తన కూతురి జీవితంలో ఆ ఘటాన్నికూడా అలాగే దాచేయడానికి వీలయ్యుంటే....

''అమ్మా, ఏం జరిగిందో తుంగ అంతా చెప్పిందామ్మా?''

''చెప్పింది.''

''పురుడు....''

''మామూలుగా అవలేదు. మాకు చేతనయినంతా చేశాం. కాని బిడను బ్రతికించలేక పోయాం.''

తుంగమ్మ తండ్రి మనసులో మెదులుతున్న భావాలు భగ్గున మండాయి. నారాయణమూర్తిని సరసమ్మ చూడలేదు. కానీ ఆయన చూశారు. ఎటువంటి నీచ మనస్తత్వం అతనిది!....ఆ బిడ్డ....చని పోయి పుట్టిన బిడ్డ ...

'ఏం కొంప మునిగి పోలేదు' అనుకుంది, ప్రపంచాన్ని చూసి, చేదు తిన్న ఆయన మనసు.

"ఆ తరువాత పెళ్ళి ఆలోచ నేమైనా చేశారా?" తుంగమ్మ భవిష్యత్తును గురించి అడిగారు సరసమ్మ.

"లేదు. ఎలా వీలవుతుంది చెప్పండి? ఈ సంగతి ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడ్డాను—మా కుర్రాడికూడా. మావళ్ళిలో ఆ దంపతులకు తెలుసంతే. అయినా, వరుణ్ణి వెతకడానికి వెళ్ళే సాహసం కలుగలేదు నాకు. రేపు ఎవరైనా వేలెత్తి చూపితే పడద్దూ?"

"కానీ, అలాగని వదిలెయ్యలేం కదా! నేనూ చూస్తూ వుంటాను మంచి సంబంధం కలిపి వచ్చేలా ఉంటే మీకు రాస్తాను. అలా జరిగితే నా కెంతో సంతోషంగా ఉంటుంది."

"ఆమాత్రం చేసి పుణ్యం కట్టుకోండి. నా కూతురు వీధిన పడకుండా కాపాడండి."

"అన్నిటికీ ఆ దేవుడే ఉన్నాడు. మంచివారి నెప్పుడూ దేవుడు మర్చిపోడు."

ఇది ఎప్పుడూ ఆఖర్లో సరసమ్మ ఉచ్చరిస్తున్నదే.

తుంగమ్మ తండ్రి కూడా ఓ క్షణం దేవుడిచ్చే అభయం గురించి ఆలోచించ బోయారు.

"నేను ప్రయత్నించి సమితివారికి చెప్పి, ఇంకా 'అ, ఆ'లు మొదలుపెట్టని వారికి చదువు చెప్పే పని తుంగమ్మకు ఇప్పిస్తాను. ఇప్పుడు అందర్నీ ఒకే బ్యాచ్ చెయ్యటంవల్ల ఇబ్బందిగా ఉంది."

"ఓ.... తుంగ ఈ పని చెయ్యగల దంటారా?"

"ఏం? ఏమనుకుంటున్నారు మీరు, తుంగమ్మ గురించి? ఆమె చాలా తెలివిగలదండీ!"

ఆ వాతావరణంలో ఆ పొగడ్త బడిపంతులికి తియ్యగా విని పించింది.

అంతలో తుంగమ్మ తమ్ముడితో అక్కడి కొచ్చింది.

"అన్నీ చూశావా బాబూ?" అన్నారు సరసమ్మ.

కుర్రాడు సంకోచంతో "ఊఁ...." అన్నాడు తండ్రివేపు తిరిగి "ఇక్కడ 'క్లాస్' జరుగుతుందట నాన్నా! కాస్సేపట్లో టీచర్ వస్తారట."

"ఇకమీదట మీ అక్కకూడా మొదటి తరగతికి పాఠం చెబు తుంది బాబూ!" అన్నారు సరసమ్మ.

తుంగమ్మ నోట మాట రాక తండ్రివేపూ, దొడ్డమ్మ వేపూ మార్చి మార్చి చూసింది. కుర్రాడు ఆశ్చర్యంతో అక్కవేపు తిరిగి—

"నాకు చెప్పనే లేదేమిటక్కా?" అన్నాడు.

తుంగమ్మ తండ్రి—

"అవును బాబూ, ఇక మీ అక్కయ్య టీచర్ పని చేస్తుం దట!" అన్నారు. కుర్రాడు నవ్వాడు.

ఉదయం రైలు దిగగానే తండ్రీ-కొడుకులు ఉడిపి హోటల్లో కాఫీ-ఫలహారం సేవించి, కొంత దూరం నడిచి, కొంత దూరం జట్కాలో వచ్చారు-అభయ ధామానికి.

మాట్లాడుతూ ఉండగానే పొద్దు పోయింది. ఆ సంగతి గమ నిస్తూ తుంగమ్మ తండ్రి అన్నారు-

"నాదో చిన్న కోరిక."

"చెప్పండి."

"అమ్మాయిని తీసుకుని బజారు వేపు వెళ్ళి రానా?"

ఆయన అడుగుతూండగానే 'అలాగే' అన్నట్టు తలవూపుతూ-

"వెళ్ళిరండి. భోజనాల టైముకు తీసుకొచ్చి వదిలేస్తే చాలు. మిమ్మల్నెలాగూ పిలిచే స్థితిలో లేము మేము" అన్నారు సరసమ్మ.

"మీరు ఏరేవనంటే పిల్లలతో కలసి హోటల్లో భోంచేద్దామను కుంటున్నాను."

"అలాగే కానివ్వండి" అన్నారు సరసమ్మ నవ్వుతూ.

అరక్షణం. బయట వెళ్ళిన తుంగమ్మ మళ్ళీ వస్తుందో లేదో నన్న సంశయం ఆమెను వేధించింది. వ్యథాభారంతో క్రుంగిపోయినా నిజాయితీని ప్రతిబింబిస్తున్న ఆ ముసలి బడిపంతులి మొహం చూసి, 'ఛ! పాడు ఆలోచన' అని మనసులోనే సిగ్గుపడ్డారు.

అవ్వాళ తుంగమ్మ తన చీరె కట్టుకుంది. సరసమ్మ "నాన్న గారితో వెళ్ళొస్తావుటమ్మా?" అన్నప్పుడు సంతోషంతో తలాడించింది. క్షణంలో మొహం కడుక్కుని తయారయింది. జలజ ఆమెకు ముడి వేసింది.

సైగజేసి సరసమ్మను బయటికి పిలిచింది జలజ.

"ఏమిటి?"

"ఓ గులాబి కోసి తుంగక్క తల్లో పెట్టనా?"

"దానిక్కూడా అడగాలా?"

వీపు వెనక దాచిన చేతిని ముందుకు చాచింది జలజ. అందులో ఎర్రటి గులాబి నవ్వుతూంది.

"చూశారా దొడ్డమ్మా. మీరెలాగూ కాదనరని ముందే తెలుసు నాకు. అందుకే ముందే...."

"కిలాడీ...." మనఃస్ఫూర్తిగా నవ్వారు సరసమ్మ.

తుంగమ్మ తండ్రి బయటికి వెళ్ళటానికి లేవగానే, సరసమ్మ సూచనమేరకు జలజ తలుపు తీసి ఉంచింది. బయటనుండి వచ్చినవారు, అస్తమానం తలుపుకు తాళం వేసి ఉండటాన్ని చూడటం ఆమె కిష్టంలేదు.

తలుపు దగ్గర నుంచుని, వెడుతున్న తండ్రి-పిల్లల్ని చూస్తూ సరసమ్మగారన్నారు-

"సాయంత్రం ఐదు గంటల్లోపల వచ్చేయండి."

"అలాగే దొడ్డమ్మా!" తుంగమ్మ జవాబు చెప్పింది. అలా చెప్పటానికి వెనుదిరిగి చూసినపుడు అభయధామంలోని అందరికళ్ళూ తనువేపే చూస్తున్నట్టనిపించింది.

జలజ రెప్ప వెయ్యకుండా తుంగమ్మని, ఆమె తండ్రిని, తమ్ముడినీ చూస్తూంది. తుంగమ్మ తిరిగి చూడగానే-

"తుంగక్కా, తొందరగా వచ్చేయ్ అన్నది."

"ఊఁ-అలాగే."

తలుపులు మూసుకున్నాయి.

బయట రోడ్డుమీది కొచ్చాక కూడా తుంగమ్మ తిరిగి చూసింది. అభయ ధామపు ఆఫీసు గదిలోని కిటికీ కనిపించింది. అందులో జలజ మొహం కనిపిస్తూంది....ఆ మొహంలో నవ్వు లేదు....

* * *

హై హై....చల్ చల్....జా....జా....ఇలాటి చప్పుళ్ళేమీ లేకుండా నిర్జనంగా ఉన్న ఆ వీధిలోకి గుర్రపుబండి వచ్చి నేరుగా అభయ ధామం ముందు నిలిచింది.

జలజ కిటికీలోనుండి చూస్తూనే ఉంది. పారేసుకున్న ఆట వస్తువు మళ్ళీ దొరికితే పసిపిల్లకు కలిగేలాటి ఆనందం కనిపిస్తూం దామె మొహంలో.

అక్కడి నుండే "తుంగక్క వచ్చింది దొడ్డమ్మా, తుంగక్క వచ్చింది" అని కేక పెట్టింది.

బండిలోనుండి ముందు తుంగమ్మ తమ్ముడు దిగాడు. తరువాత తుంగమ్మ, ఆ తరువాత నిండుగా వున్న ఓ సంచి, చిన్నమూటా వాళ్ళ చేతిలో కొచ్చాయి. బండివాడి కివ్వాల్సిన కిరాయి ఇచ్చేసి తుంగమ్మ తండ్రి మెల్లిగా బండి దిగారు.

తుంగమ్మ చేతి స్పర్శతో చిన్నగేటు 'కిర్రు' మంది.

ఈసారి ఆమె తలుపుమీద కొడుతూ 'అమ్మా, అమ్మా' అని పిలవాల్సిన అవసరం లేకపోయింది. అభయ ధామపు తలుపులు తెరిచే ఉన్నాయి. చిరునవ్వు నవ్వుతూ ఆహ్వానించారు సరసమ్మ. ఆమెను అనుకుని నిలబడ్డారు జలజ, లలిత, ఇంకా కొంతమంది పిల్లలు.

చావడిలోనుండి హార్మోనియం కర్కశంగా వినిపిస్తోంది. ఆ మోత మధ్యలోనుండి ఓ మధుర మయిన కంఠం పాడుతూంది.

"నీ మాయ యాళగో. నిన్నోళో మాయయా" (మాయ నీలో ఉన్నదా? నువ్వు మాయలో ఉన్నావా?)

"రండి" అన్నారు సరసమ్మ. పాట వినిపిస్తున్నందుకు వివరణగా—

"సంగీత పాఠం జరుగుతోంది" అన్నారు.

ఆ సంగతి చెప్పాల్సిన పనే లేదు. ఆయన కుతూహలంతో పాఠం నేర్పుతున్న అధ్యాపకురాలివేపు చూశారు. కొద్దిగా జీతం తీసుకొంటూ అభయధామంకోసం, తమ అమూల్యమయిన సమయంలో ఒక్క అంశాన్ని దానం చేస్తున్న ఆ సంగీత విదుషీమణి ఓ పదిమంది పిల్లలముందు చాపమీద కూర్చునుంది—గంభీరంగా.

సరసమ్మ ముందుకు నడిచి వారిని ఆఫీసుగదిలోకి తీసికెళ్ళారు. బయటినుండి వచ్చిన సంచీలలో ఏముందో చూడాలన్న కుతూహలముగ్నా, అభయధామపు శిష్టాచారాన్ని అనుసరించి, అక్కడినుండి వెళ్ళిపోయారు, మిగతా పిల్లలు.

ఉల్లాసంగా ఉంది తుంగమ్మ. పాలిపోయిన మొహంలోకి రంగువచ్చి, ఆమె అందం ఇనుమడించింది. తుంగమ్మ ప్రియమైన తండ్రినీ, తమ్ముడినీ మళ్ళీ కలుసుకున్న ఆనందంలో మునిగి తేలుతూంది. జన సందడిగా ఉన్న వీధుల్లో తిరిగి, ఇంద్ర భవనంలో భోజనం....గాజులకొట్టు.... గుడ్డలకొట్టు... పూలు.... పళ్ళు తను వద్దన్నా ఖర్చు పెట్టారు తండ్రి తండ్రినుండి డబ్బు అడిగి తీసుకుని, బిస్కెట్ రంగులో తమ్ముడికోసం బుష్‌కోటు కొంది తుంగమ్మ ... ఒంటరిగా జలజల ధుకుంపుడిన తలపెట్టుకుని. నవ్వుతూ కన్నీరు పెట్టుకునేటంత ఆనందంగా వుంది తుంగమ్మ.

వేడికోలు కంఠంతో తుంగమ్మ తండ్రి అన్నారు-

"ఇక్కడి కోసమని ఏదో కొంత తెచ్చాం. మీరు కాదనకూడదు."

సరసమ్మ ఆలోచనల్లో పడ్డారు. "అరెరె, ఎందుకు తెచ్చారు? బయటినుంచి తెచ్చిన తినుబండారాలేవీ తీసుకో కూడదని నియమం వుందే? తుంగా! చెప్పలేదూ నువ్వు?"

"చెప్పాను దొడ్డమ్మా!" తనదేం తప్పు లేదన్నట్టుగా అంది తుంగ.

"చెప్పింది. చెప్పింది....కాని ఈ ఒక్కసారికి క్షమిస్తారన్న ఆశతో తెచ్చాను. అదీకాక....అంత చెప్పుకోతగ్గ పదార్థాలేం కాదు."

ఈ చిరుతిండి కథ చిన్నదేంకాదు. తుంగమ్మకూ ఆ సంగతి తెలియదు. వెనకోసారి అభయ ధామాన్ని వదలి బయటకు రావటానికి ఇష్టపడని ఓ పిల్లమీద కసితో ఆమె పాత విటుడు తెచ్చి ఇచ్చిన పదార్థం తిని ఆ పిల్ల మరణయాతన అనుభవించింది. ఆ పిల్లను హాస్పిటల్‌లో చేర్పించాల్సి వచ్చింది. అక్కడినుండి ఆ అమ్మాయిని తీసికెళ్ళాలని ప్రయత్నించి అతను విఫలుడయ్యాడు గాని, మళ్ళీ ఆ పిల్ల మామూలు ఆరోగ్యం పొందటానికి దీర్ఘకాలమే పట్టింది. అప్పటినుండి బయటినుండి వచ్చిన ఆహార పదార్థాలను అభయ ధామం నిషేధించింది.

తుంగమ్మ తండ్రి నిండుగా వున్న సంచిని, సరసమ్మకు అప్ప చెబుతున్నట్లుగా, మంచానికి అన్చి ఉంచారు.

"ఏముంది అందులో ?"

నాల్గు డజన్ల కమలాఫలాలు, మూడు పౌన్ల బిస్కెట్స్, అరటి ఆకులో కట్టిన పొట్లంలో, తుంగమ్మ సూచించినట్టుగా కొన్న నాల్గు పేర్ల మల్లిమొగ్గలు.

కాని ఆయన అలా వివరించలేదు.

"ఏవో కాసిని పళ్ళూ, బిస్కెట్లూ...."

"బాబుకు కొన్ని ఉంచుకోండి."

"ఉన్నాయి. ఉన్నాయి. కావాలంటే మళ్ళీ తీసుకుంటాం."

ఇంకో పేకెట్‌ని చేతులతో పట్టుకు నుంచుంది తుంగమ్మ.

నేరస్థుడిలా ఆమె తండ్రి అన్నారు-

"అమ్మాయికి ఓ చీరె కొన్నాను. తరువాత తనే ఏవో తీసుకుంది. చూపించమ్మా తుంగా !"

తుంగమ్మ సిగ్గుపడింది. దొడ్డమ్మ ఏమంటారోనని గుండె వేగంగా కొట్టుకుంది. మెల్లిగా పేకెట్ విప్పింది.

....అందులో ఉన్నవి పన్నెండు రూపాయల ఓ ప్రింటు చీరె.

ఆకుపచ్చరంగు జాకెట్ గుడ్డ. అవికాక ఆరు రవికల గుడ్డ లున్నాయి. ఆ గుడ్డలను తీసి బల్లమీద పెడుతూ—

"ఇందులో ఒకటి మీకు దొడ్డమ్మా!" అంది తుంగమ్మ.

"నాకా?"

దొడ్డమ్మ వద్దంటారేమోనని తుంగమ్మ చిన్నబుచ్చుకుంది. కాని సరసమ్మ మొహంలో చిరునవ్వు వెలిసింది.

"నాకోసం ఎందుకు తెచ్చావమ్మా?"

కూతురికి మారుగా తండ్రి బదులు చెప్పారు-

"గురుదక్షిణ అంటారే, అలాగా...."

"ఓ....ఇప్పు డలాటివాటిని లంచం అంటారు."

దొడ్డమ్మ కాదంటే ఏడవటానికి సిద్ధంగా ఉన్న తుంగమ్మ—

"మీరు తీసుకోవాలి దొడ్డమ్మా!" అంది.

"సరేనమ్మా, మిగతావి?"

"జలజ, లలిత, సావిత్రి, కళ్యాణి, సుంద్రాలకోసం తీసుకున్నా."

"సుంద్రా-గుడ్డిపిల్ల, కళ్యాణి మూగది. మిగతా ముగ్గురూ తుంగకు సేవలు చేసినవారు." వివరిస్తున్నట్టుగా అన్నారు సరసమ్మ.

"తుంగ చెప్పింది....అందుకనే...." అన్నారు ఆమె తండ్రి.

"ఇలా కొంత మందికే ఇస్తే మిగతా పిల్లలు ఏమైనా అనుకుంటారు."

"అవును, నాకూ అలాగే అనిపించింది."

సరసమ్మ మళ్ళీ ఓ క్షణం ఆలోచించారు. గుడ్డిపిల్లకూ, మూగపిల్లకూ ఇస్తే ఎవరూ ఏమీ అనరు. తుంగమ్మ అనారోగ్య సమయంలో శుశ్రూష చేసిన మిగతా ముగ్గురికీ ఇవ్వటంకూడా తప్పు కిందికి రాదు....

సరసమ్మ తీర్పు ఇస్తున్నట్టుగా అన్నారు-

"సరే, ఇద్దాం."

ఈ బహుమతులను చూస్తుంటే సరసమ్మకు హఠాత్తుగా ఓ

ఆలోచన వచ్చింది....తుంగమ్మ మనసు మార్చుకుని వెళ్ళిపోవటానికి నిశ్చయించుకుం దేమో!

అనుమానిస్తూనే అడిగారు—

"ఏం నిశ్చయించుకున్నారు?"

"ఇవ్వాళ రాత్రికే బయల్దేరుదామని."

"ఓ...."

ఒక్క క్షణం చుట్టూరా అంతా శూన్యంగా ఉన్నట్టు తోచింది సరసమ్మకు.

తండ్రి కూతుర్ని అడిగారు-

"ఏమంటావమ్మా? రాత్రిబండే నయం కదూ?"

"అవున్నాన్నా. పన్నెండింటికల్లా ఇంట్లో ఉంటారు."

సరసమ్మ తమ మౌఢ్యానికి నవ్వుకున్నారు. రాత్రిబండికి వెళ్ళేది తండ్రీ-కుర్రాడు. వాళ్ళిద్దరే.

తుంగమ్మ తండ్రి జేబులోంచి పాత పర్సు బయటికి తీసి అందులో ఉన్న నోట్లు తీశాడు. పదిరూపాయల ఐదునోట్లూ, ఐదు రూపాయల ఒక నోటూ ఉంది. పదిరూపాయల ఐదునోట్లను బల్లమీ దుంచా డాయన.

డబ్బుమాత్రం ఎప్పుడూ వద్దనరు ఆ దొడ్డమ్మ. అభయ ధామం ఊపిరి పీల్చుకోవాలన్నా డబ్బు కావాలి.

"ఇది అభయ ధామానికి బీదవాని కానుక."

ఏదో లోకంలోని దృశ్యాన్ని చూస్తున్నట్టుగా తుంగమ్మ తమ్ముడు అక్క దగ్గర నుంచుని చూస్తున్నాడు. తండ్రి ఔదార్యాన్ని చూసి తుంగమ్మ సంతోషించింది. తాను మరీ అంత బీదవారి కడుపున పుట్టిన అనాథేం కాదు. కానీ, తండ్రికి ఇంత డబ్బెక్కడిది? కనీసం ఓ వంద రూపాయలన్నా అప్పు చేసుండాలి.

"సరే, దీన్ని వద్దనటానికి వీల్లేదు కదా?"

సరసమ్మ కుర్చీమీద కూర్చుని డ్రాయర్లోంచి రసీదు పుస్తకం తీసి రాశారు. రసీదు చింపి ఇచ్చారు.

అప్పు డనిపించిం దామెకు-

తుంగమ్మకు ఇచ్చిన కొన్ని మందులకు ఆమె చేతివి ముప్పయి రూపాయలు ఖర్చుపెట్టారు. అవి తీసేసుకుంటే! తప్పేమిటి? అలా అనిపించింది ఓ క్షణం మాత్రమే. మళ్లీ అదబ్బులోనుండి తాము ఏమీ తీసుకో కూడదనే నిశ్చయించుకున్నారు.

"ఇది అభయ ధామానికి మీరు ఇచ్చే మొదటి కానుక- ఆఖరి కానుక కదూ?"

"ఏం?"

"అంతే మరి. ఇక తుంగ ఇక్కడ అనాధగా ఉండబోదు. సమితి ఒప్పుకున్నాక, ఆమె 'స్టాఫ్'లో ఉంటుంది. ఉపాధ్యాయిని గానో, నాకు అసిస్టెంట్‌గానో. అప్పుడు తనే సంపాయిస్తుంది. ఏం తుంగా?"

బ్రతుకు నిరాశామయమైనదని ఎప్పుడూ అనుకోనే లేదేమో నన్నంతగా భ్రమ కలిగిస్తున్నా యామె మాటలు.

అంత సేపూ ముందుకు వంగి కుంచించుకుని కూర్చున్న తండ్రి సరిగ్గా నిటారుగా కూర్చున్నారు. కూతురివేపు చూశారు. ఎంత నిర్మలంగా, నిష్కపటంగా ఉందా మొహం! కళ్ళు మెరుస్తున్నాయి. నిన్నటిదాకా జరిగిందంతా అబద్ధం అయి, ఇవ్వాళ్టిది మాత్రమే నిజమయ్యుంటే!....

"సరే అయితే, అమ్మాయికి ఉత్తరం రాస్తూండండి. తనూ రాస్తుంది."

ఇక వెళ్ళాలి-పొద్దు పోయిందన్న సూచన.

తుంగమ్మ తండ్రి లేచారు. సరసమ్మ కూడా లేచారు.

తుంగమ్మ తనకు తెలియకుండానే తండ్రి దగ్గరకొచ్చి నుంచుంది.

"సరసమ్మగారూ...."

అది తండ్రి గొంతు. అకస్మాత్తుగా పేరుపెట్టి సంబోధించా రాయన.

"ఇక బ్రతికి ఉన్నన్నిరోజులూ కన్నీటితో కాలం గడపాల్సి ఉంటుంది అనుకున్నాను. మీరు దాన్ని అబద్ధం చేశారు. చావే శరణం

అనుకున్న వాడికి మరో రెండు రోజులు బ్రతికే ఆశ కలిగించారు."

కన్నతండ్రి మనసులోని ఆవేదన సరసమ్మకు అర్థమవుతూంది. అయినా ఆమె అన్నారు :

"అలా అనకూడదు మీరు. మనిషి చేతిలో ఏముంది?"

"నేను ఈ ఆరేడు నెలలూ ఎలా గడిపానో మీకు తెలిస్తే...."

తుంగమ్మ కొంగుతో మొహం తప్పుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. తనకు అర్థంకాని మాటలను వింటూ దిక్కుతోచని తమ్ముడు కంగారు పడ్డాడు.

"అక్కా!"

కాని ఏడుస్తున్నది ఆమె ఒక్కతే కాదు. తండ్రి కళ్లనుండి కూడా అశ్రువులు ధారగా ప్రవహిస్తున్నాయి.

"నాన్నా!"

తండ్రి కిటికీనుండి బయటికి చూశారు. ఆయన చెయ్యి కొడుకు తల నిమిరింది. త్వరగా ఆ పరిస్థితినుండి తేరుకున్నారు. తుంగమ్మ కూడా కళ్లు తుడుచుకుని మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తూంది.

........నల్లటి మబ్బు వచ్చి రెండు జల్లులు కురిసి గాలిలో తేలిపోయింది ....

బయట ఎంతసేపటినుండి నుంచుందో కాని, జలజ లోపలికొచ్చింది.

"ఈమే నాన్నా, జలజ...."

తండ్రీ, తమ్ముడూ జలజ వేపు చూశారు. 'నిన్ను గురించి అంతా విన్నాం' అన్నట్టున్నాయి వారి చూపులు.

"ఉదయమే చూశాను నిన్ను" అన్నా రాయన. "ఏమిటమ్మా జలజా, బాగున్నావా?"

"బాగున్నాను సార్...."

తన్ను పలకరించారన్న సంతోషంతో ఠీవిగా బదులు చెప్పింది జలజ.

తుంగమ్మ తండ్రి, చిన్న సంచిని చేతిలోకి తీసుకుని కొడుకు చెయ్యి పట్టుకుని, వెళ్ళటానికి సిద్ధమయ్యారు.

"సెలవు. నా దొక్కటే మనవి. మిమ్మల్ని దొడ్డమ్మా అని పిలవటం ఇక్కడ పద్ధతిట! తుంగకూడా మిమ్మల్ని దొడ్డమ్మా అనే పిలుస్తూంది. దానికి తల్లి లేదు. మీరే నిజమైన దొడ్డమ్మ దానికి. ఇంకేం చెప్పను!"

సరసమ్మ "అలాగే, మీరు నిశ్చింతగా వెళ్ళిరండి. దేవుడున్నాడు" అన్నారు.

ఆ క్షణం.... వీడ్కోలు చెప్పే ఆఖరి క్షణం....

మార్కెట్‌దాకా నడిచే వెళతామన్న తండ్రీ కొడుకులను పంపటానికి దొడ్డమ్మ, తుంగమ్మ, జలజ, చిన్న గేటుదాకా వచ్చారు. లలిత నిశ్చలమైన మొహంతో తలుపుదగ్గిర నుంచుంది ద్వారపాలకురాలిలా. అభయ ధామపు పిల్లలంతా ఆమె వెనుక నుంచుని, వృద్ధుడయిన ఓ పురుషుడు, చిన్న కుర్రాడితోబాటు నడిచి వెళ్ళటాన్ని కుతూహలంతో చూస్తున్నారు.

* * *

తండ్రి, తమ్ముడు వెళ్ళిపోగానే తుంగమ్మకు అంతా శూన్యంగా కనిపించింది.

కాని, జలజ తన తుంగక్క ఆత్మీయులను గురించి ప్రశ్నిస్తూ ఆ శూన్యాన్ని మధురమయిన స్మృతులతో నింపింది.

"నీ తమ్ముడు నీలాగే ఉన్నాడు తుంగక్కా!"

"ఉహూఁ...."

"నిజం. అదే ముక్కు, నోరు. కళ్ళు. అచ్చం నీలాగే...."

"పోమ్మా. హాస్యం చేస్తున్నావ్!"

"అతడేనా తుంగక్కా, చందమామ చదివేది?"

"అవును. భలే. ఎప్పుడో చెప్తే ఇప్పటిదాకా గుర్తుందే?"

"మరవటానికి నాకే రోగం?"

తుంగమ్మకు మాట్లాడకుండా మౌనంగా ఉండటమే బాగుంటుం దనిపిస్తూంది. కాని జలజ వదిలిపెడితేగా!

"అక్కా, నే నెంత భయపడ్డానో తెలుసా?"

"ఎందుకూ?"

"నువ్వు ఇక్కడినుంచి వెళ్ళిపోతావనే అనుకున్నా!"

"నాన్నగారు రమ్మని బలవంతం పెట్టారు...."

తనవారు తనను వద్దనుకోటం లేదని చెప్పాలన్న ఆత్రం.

"జలజ గుర్తొచ్చి రాననేశావా?"

"అవును మరి...."

"ఏం కాదు. నాకంతా తెలుసులే. దొడ్డమ్మ ముందే చెప్పారు. లేకపోతే నేను చేతులు ముడుచుకుని కూర్చునేదాన్నా?"

"మరేం చేసేదానివి?"

"ఓహో! ఏం చేసే దాన్నా? మీ నాన్నగారి కాళ్ళు పట్టుకుని తుంగక్కను ఇక్కడే వదిలి వెళ్ళండి అని వేడుకునే దాన్ని."

"పిచ్చి పిల్ల....!"

పిచ్చిపిల్లకు రెండు నిమిషాలు మౌనంగా ఉండాలనిపించింది. రెండే నిమిషాలు.

"మీ నాన్నగారు మంచివారు కదూ?"

తుంగమ్మ గొంతులో ఏదో అడ్డుపడినట్లయింది. ఆమె బదులు చెప్పలేదు. జలజ ఒళ్ళో తలపెట్టుకుని ముడుచుకుని పడుకుంది.

.... .... .... .... ....

ఆ సాయంత్రం సరసమ్మ ఉల్లాసంగా ఉన్నారు. పిల్లలతో కలిసి తామూ మొక్కలకు నీళ్ళు పోశారు.

చీకటి పడ్డాక భోజనాలు అయ్యాయి.

సంవత్సరంలో అన్ని రోజులూ ఇలాగే ఉండకూడదూ! అని పించింది సరసమ్మకు.

ఆమె జలజ, లలిత, సావిత్రి, సుంద్రా, కల్యాణులను తమ ఆఫీసు గదిలోకి పిలిపించి జాకెట్ గుడ్డ లిచ్చారు.

కల్యాణి తనకు అర్థమయిం దన్నట్టుగా సైగచేసింది.

సుంద్రా అడిగింది_

"ఇదెందుకు దొడ్డమ్మా?"

"తుంగమ్మ తండ్రి వచ్చారుగా ఇవ్వాళ...."

"అవునట. పార్వతి చెప్పింది."

"వారిచ్చింది."

"తుంగక్క ఇప్పించిం దన్నమాట."

గుడ్డిపిల్ల సుంద్రా వేళ్ళు జాకెట్టు గుడ్డమీది పూలను ప్రత్యేకంగా గుర్తించటానికి ప్రయత్నిస్తున్నాయి.

ఆ తరువాత సరసమ్మ. పిల్లలందర్నీ ఒక్కొక్కరిగా పిలిచి ఒక్కో కమలాఫలం, రెండు బిస్కెట్ల చొప్పున ఇచ్చారు. ఓ పిల్ల మాత్రం రెండోసారి తీసుకోవటానికి ప్రయత్నించి దొరికి పోయింది. సరసమ్మ కోప్పడలేదు. 'కొంటెపిల్ల' అంటూ తరిమేశారు.

భోజనాలకు కూర్చున్నప్పుడు కల్యాణి వచ్చి గొడవ చేసింది. 'ఇవ్వాళైనా చెబుదూ' అన్నట్టుంది, ఆమె జలజ ముందు చేసిన అభినయం.

"ఏమిటిట?" తుంగమ్మ అడిగింది.

"అదే, కంచం సంగతి."

తుంగమ్మ మొహం ముడుచుకుంది. ఎన్ని రోజులుగా అడుగుతున్నా జలజ చెప్పటమే లేదు.

"పోనీ, చెప్పు" అంది.

జలజ నవ్వాపుకుంటూ అంది-

"వెనుక కమలాక్షి అని ఒక అమ్మాయుండేది."

"ఊఁ...."

"పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయింది."

"అయితే?"

"తరువాత విశాలాక్షి అని ఒక అమ్మాయొచ్చింది."

"ఊఁ...."

"తనూ పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయింది."

"సరే, వాళ్ళ పెళ్ళికీ ఈ కంచానికీ ఏం సంబంధం?"

"వాళ్ళిద్దరూ-ఇదిగో, ఈ నీ కంచంలోనే భోంచేసేవారు."

"ఛా...."

చూస్తూ నుంచున్న కల్యాణి పడీ పడీ నవ్వింది.

* * *

"అమ్మా, ఓ అమ్మా!"

ఎవరో గట్టిగా తలుపు మీద బాదుతున్నారు. పిలుస్తున్నది మగ వాని కంఠం.

అందరిలాగానే చాపమీద చీర మడత పెట్టి వేసుకుని పడుకుని నిద్రపోవటానికి ప్రయత్నిస్తూంది తుంగమ్మ. ఆమె పడుకున్నది అరుగుమీద. జలజ పక్కన. వాళ్ళిద్దరూ చాలాసేపటిదాకా కబుర్లు చెప్పుకుంటూనే ఉన్నారు. అలా మధ్యలోనే జలజ నిద్రపోయింది. తుంగమ్మకు చాలాసేపటిదాకా నిద్ర పట్టలేదు.

ఆమె నిద్రలోకి జారుకుంటూండగా తలుపు కొట్టిన చప్పుడు.

"అమ్మా, అమ్మా!"

—మళ్ళీ అదే పిలుపు. మగ గొంతు విని తుంగమ్మ భయ పడింది.

ఆమె లేచి కూర్చుని జలజను తట్టి లేపింది. జలజ కంగారుగా లేచి కూర్చుంది.

"ఏమిటక్కా, ఏమయింది?" అంది.

"ఎవరో తలుపు కొడుతున్నారు."

జలజ చెవులొగ్గి విని "అవును" అంది.

"మగ గొంతు కాదూ?"

జలజ నవ్వింది.

"ఏం, మగవాళ్ళు తలుపు కొట్టకూడదా? భయపడకక్కా! మగవారు అభయం యాచిస్తూ రా రిక్కడికి. వాళ్ళ కెందుకూ అభయం? పోలీసయ్య వచ్చుంటాడు, ఏ భోగంవాళ్ళనో పట్టుకుని. పద, దొడ్డమ్మను లేపుదాం."

వాళ్ళిద్దరూ లేచి నుంచునేసరికి సరసమ్మగారి గదిలో లైటు వెలిగింది. చప్పుడు విని ఆవిడా లేచారు.

పిలుస్తున్న గొంతు కిటికీ దగ్గరకు వచ్చింది.

"తలుపు తియ్యండమ్మా, ఇద్దరమ్మాయి లున్నారు. అడ్మిట్ చేసుకోండి."

అతని వెనుక ఇద్దరు అమ్మాయిలు కనిపించారు. ఒకమ్మాయి

కుడిచేతిని, ఇంకో అమ్మాయి ఎడంచేతిని కలిపి జేబు రుమాలుతో కట్టారు. వాళ్ళ వెనుక మరో పోలీ సతను ఉన్నాడు.

పోలీసులు అప్పుడప్పుడు వీధిలో తిరిగే అమ్మాయిలను తెచ్చి అప్పజెప్పే వారని వింది తుంగమ్మ. ఇప్పుడు మొదటిసారిగా కళ్ళతో చూస్తూంది.

తలుపు తెరుచుకుని ఆ నలుగుర్నీ లోనికి రానిచ్చింది,

పోలీసువాడి ఆకలికళ్ళు ఆ చీకట్లో చాపిట్లోకి చూట్టానికి ప్రయత్నిస్తున్నాయి. ఏమీ కనిపించక దొడ్డమ్మ దగ్గర నుంచున్న జలజ తుంగమ్మ వేపు తిరిగాయి. కానీ వాళ్ళిద్దరి చూపులూ కొత్తగా వచ్చిన అమ్మాయిలమీదున్నాయి. ఒకమ్మాయికి ఇరవై ఏళ్ళుంటాయి. యౌవనం కొట్టొచ్చినట్టు కనిపిస్తూంది. పాత వాయిల్ చీరె కట్టుకుంది. కళ్ళు క్రోధంతో అందర్నీ కాల్చేసేలా ఉన్నాయి. ఇంకో అమ్మాయికి పదిహేనేళ్లుకూడా ఉన్నట్టు లేవు. వెక్కి వెక్కి ఏడుస్తూంది. అలా ఏడవటం తన కవమాన మన్నట్టుగా ఆ పిల్లనూ కోపంగా చూస్తూంది పెద్దమ్మాయి.

సరసమ్మ టేబిల్‌మీదినుండి చిన్న పుస్తకం తీసి రాయటానికి ఉపక్రమిస్తూ—

"వీళ్ళిద్దరి పేర్లూ చెబుతారా?" అన్నారు.

ఆ చీకటి వాతావరణాన్ని చీల్చేలా, వికటంగా గర్జించింది పోలీసువాడి కంఠం-

"ఏమిటే, మీ పేర్లు చెప్పండి."

వాళ్ళిద్దరూ బదులు పలకలేదు.

సరసమ్మ వాళ్ళవేపు తిరిగి—

"మీ పేర్లు చెబుతా రామ్మా? ఇక్కడ రాసుకోవాలి." అన్నారు. వాళ్ళిద్దరూ నోరు మెదపలేదు.

ప్రశ్నోత్తరాలకు తగిన వాతావరణం ఏర్పడాలన్న ఆలోచనతో, "ఇదేం పోలీసు స్టేష ననుకున్నారా? వాళ్ళ చేతికట్లు విప్పండి ముందు" అన్నారు సరసమ్మ కరుగ్గా.

వయసు మీరిన మరో పోలీసతను జేబు రుమాలు విప్పాడు.

పెద్దది చెయ్యి లాక్కుని నిటారుగా నుంచుంది. చిన్నది రెండు చేతుల తోనూ కొంగును ముందుకు లాక్కుని మొహం కప్పుకుంది.

మరోసారి పేర్లడిగారు సరసమ్మ. ఆ యువతు లిద్దరూ మాట్లాడే దారి కనిపించలా.

గడుసు కంఠంతో మాట్లాడుతున్న పోలీసువాడు మళ్ళీ అన్నాడు వ్యంగ్యంగా—

"పోలీసు స్టేషన్లో అయితే నోరు విప్పుతారు."

సరసమ్మకు ఈ పోలీసులతో గొడవ నచ్చలేదు.

"వీళ్ళను ఇక్కడి కెందుకు తీసుకు వచ్చారు?"

"అలా అడుగుతా రేంటమ్మా? ఇది కొత్త కాదుగదా! ఊఁ.... పోనీ, ఏదో పేరు రాసుకోండి, మాకు పొద్దు పోతూంది."

సరసమ్మకు ఒళ్ళు మండింది.

"ఏదో పేరు రాసుకోవటం ఇంకెక్కడన్నా వీలుపడుతుం దేమో గాని, ఇక్కడ కుదరదు."

ఆడదాని ముందు అవమానం జరిగినందుకు పోలీసువాడూ సహనం కోల్పోయాడు.

"అలా అయితే ఇక్కడ చేర్చుకోమని రాసివ్వండి. జైల్లో పడేస్తాము."

సరసమ్మ అతని దర్పానికి లొంగదలుచుకోలేదు.

కానీ జైలు పేరు వినగానే పెద్దమ్మాయి ఉలిక్కిపడింది. చిన్నమ్మాయి ఏడుపు ఎక్కువయింది.

దృఢంగా అంది పెద్దమ్మాయి-"నా పేరు జానకి. దీని పేరు కావేరి."

అనివార్యమైన గొడవ పరిహార మయినట్టుగా అనిపించింది అందరికీ.

పుస్తకంలో పేర్లు రాసుకుని సరసమ్మ పోలీసువాడితో,

"ఇదిగో, ఈ పేజీలో వీళ్ళిద్దర్నీ అభయ ధామంలో అప్పజెప్పా మని రాసి సంతకం పెట్టండి, ఇవ్వాళ్టి తేదీ వెయ్యండి. టైము పన్నెండున్నర అయిందని రాయండి," అన్నారు.

"అవన్నీ రాయను."

"అయితే వీళ్ళని తీసికెళ్ళొచ్చు."

"ఇంతకు ముందు వచ్చినప్పుడు అలా రాపివ్వలేదే నేను?"

"అందుకే ఈసారి రాయమంటున్నా. పోయినసారి ఏం జరిగిందో నా నోటివెంట చెప్పించాలనుందా? డి. ఎస్. పి.గారు చెప్పారు. మీరు రాపి సంతకం పెడితేనేగాని ఎవర్నీ అడ్మిట్ చేసుకోం."

డి. ఎస్. పి. అన్న పేరు వినగానే పోలీసువాడి నల్లటి మొహం మరింత నల్లబడింది. మాటల జోరు తగ్గింది. ఏదో గొణుక్కున్నాడు. సరసమ్మ చెప్పినట్టు రాపి సంతకం పెట్టాడు.

పోలీసువాళ్ళతో మాట్లాడిన కంఠానికి మారుగా, చిరపరిచితమయిన దొడ్డమ్మ మృదు కంఠమే వినిపించింది-

"జలజా! లోపలగదిలో రెండు చాపలు వేసి, వీళ్ళిద్దర్నీ అక్కడ వదిలెయ్యమ్మా!"

"అలాగే దొడ్డమ్మా!"

"మీ రెక్కడ పడుకున్నారు?" అన్నారు సరసమ్మ, తుంగమ్మ వేపు చూస్తూ.

"అక్కడే, గది ముందరే దొడ్డమ్మా!"

"సరే, అయితే."

పోలీసువాడు మరోసారి తుంగమ్మ, జలజలవేపూ, తను తెచ్చి వదలిన 'వేట' వేపు చూసి, తన సహోద్యోగితోబాటు బయటికి వెళ్లాడు. సరసమ్మ తలుపు మూసి తాళం వేశారు.

ఆ తరువాత ఆమె గదిలో దీపం ఆరటానికి ఎక్కువసేపు పట్టలేదు.

కొత్త అమ్మాయిలను లోపల వదిలి, తలుపు ముందుకు లాక్కుంది జలజ ఈ చప్పుడుకు కొంతమంది నిద్ర లేచినా-మళ్లీ వెంటనే నిద్రపోయారు.

జలజ_తుంగమ్మలకు మాత్రం నిద్ర పట్టలేదు. గొంతు తగ్గించి జలజ పోలీసువాళ్ళ సాహస చరిత్ర వివరించింది.

"డీ. ఎస్. పీ, గీయప్పీ అని గట్టిగా మాట్లాడారే దొడ్డమ్మ. ఎందుకో తెలుసా?"

"తెలియదే? ఎందుకూ?"

"అయ్యో! కొన్నిమాట్లు ఏమయిూదంటే...."

ఒకమాటు అర్ధరాత్రి ఇద్దరు, ముగ్గురు అమ్మాయిల్ని తీసుకొచ్చారు పోలీసులు. పుస్తకంలో సంతకం పెట్టలేదు.

మరుసటిరోజు వాళ్ళలో ఒక పోలీసు వచ్చి అమ్మాయిల్ని వెనక్కి తీసికెడతా నన్నాడు.

"వీళ్ళ నేం చేస్తారయ్యా?" దొడ్డమ్మ అడిగేవారు.

"స్టేషన్‌కు తీసుకు వెళ్ళి, అక్కడినుండి న్యాయాధీశులముందు హాజరు పరుస్తాం."

"అక్కడేం జరుగుతుందో వచ్చి చెప్పాలి నాకు."

"అలాగేనమ్మా!"

కానీ ఏం జరిగిందో ఎవరూ చెప్పేవారు కాదు. ఎన్నోమార్లు అలాటి పిల్లలను కోర్టులో నిలబెట్టటం జరిగేది. మరెన్నో మార్లు, వాళ్ళని అభయ ధామంనుండి బయిటికి తీసుకుపోగానే, పోలీసువారే వాళ్ళకు తగిన శిక్ష విధించేవారు.

అలాటి శిక్షలు వాళ్ళ రూప లావణ్యాలను బట్టి ఉండేవి.

"ఛా...." అంది వింటున్న తుంగమ్మ.

"ఇదంతా చూసి దొడ్డమ్మ చాలా విసుక్కునేవారు."

"కాదూ మరి! ఎలాటివాళ్లు!!"

"అదీ కాకుండా వీళ్ళు తీసుకొచ్చేదంతా బీదవారినే. వృత్తి చేసుకుంటూ బోలెడు డబ్బు చేసుకున్నవారిని తీసుకురారు. వాళ్ళని పట్టుకుంటే వెంటనే వీళ్ళ జేబులు గలగల్లాడ్తాయి. వదిలేస్తారు."

"ఇలాటి ఉద్యోగాల్లో ఉన్నవారే ఇలా చేస్తే!"

"అందుకే దొడ్డమ్మ అంటున్నది. పోయినసారి బాగా గొడవ చేశారు దొడ్డమ్మ. రిపోర్టు చేశారు. డి. ఎస్. పీ. దాకా వెళ్ళారు. రాత్రివేళ పోలీసులు తీసుకొచ్చే అమ్మాయిల గతేమవుతుందో అభయ ధామానికి తెలిపితీరాలని పట్టుపట్టారు."

"దొడ్డమ్మనుకూడా గౌరవంగా చూడలేదా పోలీసు....మనల్ని అదోలా చూడసాగాడు కదూ?''

''గమనించా వన్నమాట."

ఏడుపు-దాంతోబాటు 'పడుకోవే ముండా' అన్న గద్దింపూ వినిపించి తుంగమ్మ-జలజల సంభాషణలకు అంతరాయం కలిగింది.

''పాపం! చిన్నది ఏడుస్తున్నట్టుంది కదూ జలజా?''

''అవునక్కా!''

''ఎందుకో చిన్నమ్మాయిని చూస్తే 'అయ్యో' అనిపించింది నాకు.''

''నాకూ అంతే.''

''ఎందుకు దిగిందో ఈ వృత్తిలో?''

''నేను చెప్పనా అక్కా? ఇలాటివి చాలా చూశాను. పెద్దది వృత్తి మనిషి. అనుమానం లేదు. చిన్నదాన్ని ఇదే మొదటిసారి బయటికి తీసుకొచ్చి ఉంటుంది. తప్పక వేరే ఇంటిపిల్ల అయ్యుండాలి!''

జలజ ఊహ సరైనదే కావచ్చు ననుకుంది తుంగమ్మ. జలజ సూక్ష్మబుద్ధిని మెచ్చుకుంది.

''రేపేం చేస్తారు వీళ్ళని?"

"దొడ్డమ్మ రాయించుకోకుండా ఉంటే, పోలీసులు వీళ్ళిద్దర్నీ ఇక్కడినుండి తీసుకెళ్ళి, దగ్గరున్నది లాక్కుని, ఏదో చేసి వదిలేవారు. కాని ఇప్పుడు...."

దొడ్డమ్మ పేర్లురాసి, సంతకం పెట్టింమకోకుండా ఉంటేనే బాగుండేదేమో అనిపించింది తుంగమ్మకు. అలా అయితే ఆ చిన్నమ్మాయి ఉదయం ఇంటికి వెళ్ళటానికి వీలుగా వుండే దనుకుంది.

"ఆ చిన్నమ్మాయిని విడిపించటానికి అవదా జలజా?"

క్షణం ఆగి అంది జలజ-

"రేపో పని చేద్దాం తుంగక్కా! దొడ్డమ్మకు చెపుదాం. ఈ అమ్మాయి సంగతి ఇన్స్పెక్టర్‌కి ఆవిడేమన్నా ఓ రిపోర్టు వ్రాసి ఇవ్వగలిగితే...."

"అలాగే చేద్దాం."

ఆ అమ్మాయిని - కావేరిని - తను విడిపించినట్టు సంతోషించింది తుంగమ్మ.

కాసేపట్లో నిద్రకూడా వచ్చింది.

.... .... .... .... ....

గంట చప్పుడు విని అందరితో బాటు లేచారు తుంగమ్మ, జలజ.

ఇవ్వాళ్టినుండి తుంగమ్మ అభయ ధామపు అతిథికాదు. అక్కడ నివసిస్తున్నవారిలో తనూ ఒక్కతి. తండ్రితోబాటు వెళ్ళకుండా, తనకు తానై కోరుకుని, ఆ విచిత్ర కుటుంబంలో చేరిన సభ్యురాలు.

లేవగానే తుంగమ్మకు రాత్రి గదిలో వదిలిపెట్టిన అమ్మాయిలు గుర్తుకొచ్చారు. ఆమె తలుపుతోసి చూసింది. పెద్దమ్మాయి లేచి కూర్చుంది. చిన్నమ్మాయి కింకా మెలుకువ రాలేదు.

వరనమ్మ అటు వస్తూ—

"వాళ్ళ కేం కావాలో చూడండి" అన్నారు. తనక్కూడా ఓ పని అప్పచెప్పినందుకు పొంగిపోయింది తుంగమ్మ.

జలజ పెద్దమ్మాయిని తీసుకుని నీళ్ళగదివేపు వెళ్ళాక, తుంగమ్మ చిన్నమ్మాయితో మాట్లాడింది. అన్ని ప్రశ్నలకూ ఒక్కటే సమాధానం-

"నేనేం తప్పు చెయ్యలేదు, నన్ను వదిలెయ్యండి."

"మరి దాంతో ఎలా వచ్చావ్ ?"

బదులు లేదు.

"నువ్వు ఏమీ చెప్పకపోతే ఎలాగమ్మా ! నీ కేమైనా సాయం చేద్దామని కదా అడుగుతూంట."

తుంగమ్మ మాటని నమ్మటానికి ప్రయత్నిస్తూ, ఆ పిల్ల వణుకుతున్న కంఠంతో చెప్పింది:

"ఇది మా పక్కింట్లో వుంది. మా కులం కాదు. శివాజీ టాసుకు వెళ్ళి సాయంత్రం సినిమా చూసివద్దాం రమ్మన్నది. సినిమాలంటే ఇష్టం నాకు. స్నేహితుల ఇంటికి వెళ్తానని చెప్పి దీంతో వచ్చాను. సినిమా వదిలాక వస్తూండగా త్రోవలో ఎవరో ఒకతనితో మాట్ల

డుతూ నుంచుంది జానకి. పొద్దుపోతుంది రమ్మన్నా వినిపించుకోలా ...
తరువాత ఎటో తీసికెళ్ళి 'దోవ తప్పాం' అంది. అప్పుడేమో...."

కావేరి ఏడ్చింది.

"ఏడవకమ్మా! నేను దొడ్డమ్మకు చెబుతాను. నిన్ను ఇంటికి పంపటానికి సాయం చేస్తారు."

తుంగమ్మ ఆత్మీయతా, దొడ్డమ్మతో చెబుతా ననటమూ కావేరికి ధైర్యం కలిగించాయి. సరసమ్మ జలజదొడ్డమ్మ అని తా ననుకున్నట్టుగానే, ఇప్పుడు కావేరీ అనుకుంటూందని ఊహించుకుని తుంగమ్మ మనసులోనే నవ్వుకుంది.

"ఎలాగైనా నన్ను వదిలిపెట్టండి. మీకు నా చేతి గాజులు ఇస్తాను. ఏం కావాలన్నా ఇస్తాను. మీరు చెప్పినట్టు వింటాను."

తుంగమ్మ నవ్వింది.

"లంచం ఇవ్వక్కర్లేదమ్మా!"

కావేరికి తనలా అనటం తప్పనిపించింది.

సులువుగా కావేరి విశ్వాసాన్ని సంపాదించిన తుంగమ్మ మరో ప్రశ్న అడిగింది.

"మీరు ఎవ రెవరున్నారు ఇంట్లో?"

"మా అమ్మా-నాన్నా, అన్నయ్యా, అక్కయ్యా, ఇద్దరు తమ్ముళ్ళూ. వచ్చేనెలలో మా అక్కయ్య పెళ్ళికి ముహూర్తం పెట్టుకున్నారు కూడా."

అలా చెబుతూనే ఏడుస్తూంది కావేరి.

తుంగమ్మ నిట్టూర్పు విడిచింది. సరసమ్మ గదివేపు బయల్దేరింది. జలజ వచ్చేదాకా ఆగలేకపోయింది.

అంతా విన్న సరసమ్మ అన్నారు—

"నాకూ అలాగే అనిపించింది తుంగా! ఏమైనా చేద్దాం. ఈ పాటికి వాళ్ళ నాన్నగారు పోలీసు రిపోర్టు ఇచ్చే ఉంటారు."

"వాళ్ళ నాన్నగారికి తెలియకుండానే కావేరి ఇంటికి వెళ్ళేలా చూడలేమా దొడ్డమ్మా?"

ఆ ప్రశ్న సరసమ్మకు నచ్చలేదు.

"వద్దు తుంగా! అది సరికాదు. తండ్రి కూతురిని తీసికెళ్ళటమే మంచిది. ఏమంటావ్?" అన్నారు.

తన ఆలోచన సరయినది కాదని తుంగమ్మకూ అర్థమయింది.

"అవును దొడ్డమ్మా! మీరు చెప్పింది నిజం."

"పోలీసు ఇన్‌స్పెక్టర్‌కి ఉత్తరం రాస్తాను. అభయ ధామపు ముద్ర వేద్దాం. పోలీసువాడే తీసుకెళ్తాడు."

సరసమ్మ మాట పూర్తి కాకమునుపే జలజ పరుగెత్తు కొచ్చింది. "దొడ్డమ్మా! దెబ్బలాడ్తున్నారు. జనవరిలో తమిళుల అమ్మాయిలు ఇద్దరు రాలేదూ? వాళ్ళకి జానకి తెలుసుట. జానకిమీద పడి పోట్లాడుతున్నా రిద్దరూ...."

తుంగమ్మ, జలజతోబాటు పరుగెత్తారు సరసమ్మ.

తమ బ్రతుకులు నాశనం చేసిందన్న కోపంతో జానకిని పట్టుకుని వదిలి పెట్టలేదు వాళ్ళిద్దరూ. అభయ ధామపు పిల్లలంతా దూరంగా నుంచుని చోద్యం చూస్తున్నారు.

సరసమ్మ కల్పించుకుని వాళ్ళని విడదీశారు. అందర్నీ కలిపి తిడుతూ, తమ తమ పనుల్లోకి వెళ్ళమని గద్దించారు.

తొమ్మిదింటికి పోలీసువాడు వచ్చాడు. అతడు మొరటుగా మాట్లాడక పోయినా సరసమ్మమీద అతనికున్న ద్వేషం మొహంలో కనిపిస్తూనే ఉంది.

సరసమ్మ ఇచ్చిన ఉత్తరం తీసుకుని—

"ఇది నా మీద కంప్లెయింటా?" అన్నాడు.

"నీ మీద కంప్లెయింటు ఎందుకూ? ఈ అమ్మాయిల గురించి రాశాను."

"ఏమని?"

"ప్రతిమారూ ఇలాటి పిల్లలగురించి ఇన్‌స్పెక్టర్‌కి వివరాలు ఇవ్వాలని డి. ఎస్. పి. గారు చెప్పారు."

మళ్ళీ డి. ఎస్. పి. గారు! పోలీసువాడు ఊరుకున్నాడు.

"స్టేషన్నుండి వచ్చాక అక్కడేం జరిగిందో చెబుతారా?"

అతడు జవాబు చెప్పలేదు. బూటుకాళ్లతో జోరుగా చప్పుడు చేసుకుంటూ వెళ్లిపోయాడు.

పోలీసువాడు ఏమీ చెప్పటానికి మళ్ళీ రాలేదు.

సరసమ్మే స్టేషన్‌కి వెళ్లి కనుక్కున్నారు. కావేరిని వాళ్ల నాన్నగారు తీసికెళ్ళారు. జానకిని హెచ్చరించి వదలిపెట్టారు.

తుంగమ్మ సంతోషించింది.

జలజ "ఆ జానకిని ఇక్కడికి పంపలేదు. మన అదృష్టం!" అంది.

* * *

ఓ రోజు సమితి సభనుండి తిరిగివచ్చిన సరసమ్మ ఎప్పటి కన్నా ప్రసన్నంగా ఉన్నారు. వెళ్ళేటప్పుడే చెప్పారు- ఇవ్వాళ సమితి సభలో తుంగమ్మ సంగతి చర్చిస్తారని. ఆ కారణంచేతనే ఆమె రాక కోసం ఎదురు చూస్తూంది తుంగమ్మ. దొడ్డమ్మ మొహం చూడగానే సమితిలో ఏం నిర్ణయం తీసుకుని ఉంటారో ఊహించటం తుంగ మ్మకు కష్టం కాలేదు. అయినా, పరీక్షా ఫలితం తెలుసుకోటానికోసం నుంచున్న తెలివైన విద్యార్థినిలా, దొడ్డమ్మ ముందు నుంచుంది విన యంగా.

కానీ వాళ్లిద్దరిలో ఎవరినీ ముందు మాట్లాడ నియ్యకుండా జలజ అడిగేసింది:

"ఏమిటి తీర్మానించారు దొడ్డమ్మా?"

సరసమ్మ వెంటనే మొహం వేలాడ వేసుకుని, నీరసంగా-

"తుంగమ్మ ఇక ఇక్కడ ఉండకూడదుట!" అన్నారు.

తుంగమ్మ గుండె గుభిల్లుమంది. జలజ మొరాయిస్తూ గట్టిగా అరిచింది-

"అబద్ధాలు! దొడ్డమ్మా, అబద్ధాలు చెబుతున్నారు మీరు!"

సరసమ్మ నవ్వారు.

"మరి అంత తెలిసినదానివి ఎందు కడిగావే 'ఏం తీర్మానించు కున్నారూ' అని?"

నెమ్మదిగా ఊపిరి పీల్చుకుని అడిగింది తుంగమ్మ-

"అక్కడ ఏంవన్నారు దొడ్డమ్మా?"

"సరే, అన్నారు."

"ఓ!...."

'ఓ' అన్నది ఇద్దరు. తుంగమ్మ-జలజ. ఆ స్నేహితురాళ్ళు సంతోషంతో ఒకర్నొకరు చూసుకున్నారు.

"నువ్వు చెయ్యాల్సిన పనేమిటో తెలుసా తుంగా? ఏమీ చదువురాని వారికి ఓనమాలు నేర్పాలి. ఆఫీసు చూసుకోవాలి. లెక్కలు సరిగ్గా ఉండేలా చూడాలి. మొత్తంమీద చెప్పాలంటే, నువ్వు మూడు: అధ్యాపకురాలు, గుమాస్తా, నా సహాయకురాలు. ఏమంటావ్?"

తన చెవులను తనే నమ్మలేక పోయింది తుంగమ్మ.

"మీ దయ ఇదంతా దొడ్డమ్మా!"

"అలా అనకూడదు తుంగా!"

"నేనూ ఓ మాట అనొచ్చా?" అంది జలజ మధ్యలో. ఆ కంఠం ఎప్పటిలా లేదు.

సరసమ్మ—"ఏమిటి?" అన్నారు.

"ఇవ్వాళతో ఆఖరు- తుంగక్క ఇక నాతోబాటు పడుకో కూడదు."

"ఎందుకలా అంటావ్?" అంది తుంగమ్మ నొచ్చుకుంటూ.

"కాదూ మరి! తుంగక్క ఇక మేడం. మాతో ఎలా ఉండటం?"

ఆ కంఠంలోని బాధకు కారణం వెతికారు సరసమ్మ. తుంగమ్మకన్నా ముందునుంచీ ఉంటున్న తనకు కాక తుంగమ్మకు ఆ హోదా దొరకటం జలజకు అసూయగా ఉందా? అలాటిభావం జలజ మనస్సులో అరక్షణం తలెత్తినమాట నిజమే! కాని, ఆ నిర్మల మైన మనసులో అది తిష్ఠ వెయ్యలేక పారిపోయింది.

అక్కడున్నది ఒక్కటే భయం. తమ ఇద్దరి స్నేహానికీ తుంగమ్మ కొత్త ఉద్యోగం అడ్డుగా నిలుస్తుందేమో అన్నదే. అదే ఆ పిల్లను తొలుస్తున్న వ్యధ అని గ్రహించారు సరసమ్మ.

అందులో యథార్థం లేకపోలేదు.

"తుంగా! అదీ ఆలోచించాల్సిందే. నీకు పడుకోవటానికి ఆఫీసు గది ఉంది. పక్క, గుడ్డలు కావాలంటే కొనుక్కోవచ్చు."

"చెప్పలా నేను?" అంది జలజ వెక్కిరిస్తూ.

"మా మేడంగారికి జీతం ఎంతిస్తారు దొడ్డమ్మా?" అంది మళ్ళీ.

"ఆరునెల్లదాకా ముప్పైఐదు ఇస్తారు. ఆ తరువాత నలభై. భోజనానికి-ఉండటానికి తుంగ ఏమీ ఇవ్వక్కర్లా."

తుంగ-జలజ ఇంత అదృష్టానికి ఎదురు చూడలేదు.

"ఇక ఈ బీద జలజ తుంగక్కకు గుర్తు ఉంటుందో లేదో?"

"చాలు. ఊరుకుందూ!"

"కాదు దొడ్డమ్మా! ఇక నేను తుంగక్కని వారు, వీరు అనాలి కదూ?"

"చూడండి దొడ్డమ్మా, ఎలా ఏడిపిస్తుందో నన్ను!"

సరసమ్మ నవ్వేసి గదిలోకి వెళ్లిపోయారు. చీరె మార్చుకున్నారు. ఒక వారగా గోడమీదున్న చిన్న అద్దంలో మొహం చూసుకున్నారు. ఆమె జీవితంలో ఆ రోజుకు చాలా ప్రాధాన్యం ఉంది. సహాయకురాలు ఒకామె కావాలని చాలా రోజులుగా అడుగుతున్నారామె. ఆ కోరిక ఇవ్వాళ్టికి తీరింది. అందులో ఎలాటి సహాయకురాలు దొరికిం దామెకు!-ఎప్పుడో చేసుకున్న పుణ్యం ఫలం.

తమకు తోడు దొరికిందన్న స్వార్థపు టాలోచనకన్నా ఎక్కువగా, తమకు ప్రీతిపాత్రురాలైన అమ్మాయి బ్రతుకు ఓ దారిలో పడిందన్న విషయం ఆమెకు ఎక్కువ ఆనందాన్నిచ్చింది.

బయటకు వెళ్ళిన జలజ ఊరుకోలేదు. పరుగున వెళ్ళి నాలుగు మూలలా ఈ వార్త చెప్పి వచ్చింది. కొంతమంది సంతోషించారు. మొహం ముడుచుకున్నారు కొందరు. జలజ మనసులో ఆశ్రయం పొందని అసూయ వేరు వేరు హృదయాల్లో పలురకాలుగా బుస్సుమని లేచింది.

"కిలాడీరకం. దొడ్డమ్మను బుట్టలో వేసుకుంది."

"ఇంత చలాకితనం కలది బయటే ఉండి 'బేరాలు' చూసుకోకూడదూ?"

"ఇక దీనిచేత పాఠాలుకూడా చెప్పించుకోవాలి."

అలా కొందరుంటే-

"తుంగమ్మ మంచిది నిజంగా!"

"ఆ రాజమ్మలాంటి మొద్దుల్ని రప్పించకుండా మన తుంగమ్మనే వేశారా? మంచిపని చేశారు!"

అని కొంద రన్నారు.

కొంతమందికి తమాషాగా అనిపించింది.

"అయితే ఇకమీదట తుంగమ్మని 'మేడం' అని పిలవాలా మనం?"

"అయ్యో, నాకన్నా చిన్నది తుంగమ్మ."

ఇలా తలోరకంగా వ్యాఖ్యానించారు.

సమితి తీర్మానం విషయంలో అభయ ధామపు పిల్లలందరికి ఏకాభిప్రాయం లేకపోవటాన్ని గ్రహించింది తుంగమ్మ. ఆమె మనసులో తుఫాను చెలరేగింది.

రాత్రి భోజనాలప్పుడు సరసమ్మ మాట్లాడారు.

"ఏదో విశేషం ఉందటగా? చెప్పండి" అని కొంతమంది అడిగారు.

"అవునవును, చెప్పండి." కొన్ని కంఠాలు ఉత్సాహంగా అరిచాయి.

"రేపటినుండి తుంగమ్మ ఒకటో తరగతి పిల్లలకు పాఠం చెప్పాలని సమితి తీర్మానించింది."

"సంతోషం" అంది వ్యంగ్యంగా ఓ కంఠం.

కాని మిగతా పిల్లలంతా నిజమైన సంతోషంతోనే చప్పట్లు కొట్టారు.

"అంతే కాకుండా, ఆఫీసు పనుల్లోకూడా నాకు సాయం చేస్తూంది."

మరోసారి చప్పట్లు.

మాటరాని కల్యాణి తుంగమ్మ దగ్గరకొచ్చి 'ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసు.' అన్నట్టుగా సైగలు చేసింది.

సుంద్రా కూర్చున్నచోట ఉండే మొహంలో సంతోషం నింపు కుంది.

ఎవరో అన్నారు :

"తుంగమ్మ మిఠాయి పంచిపెట్టాలి !"

తుంగమ్మ కడుపు పంట బాగుంటే, అప్పుడే మిఠాయి పంచాల్సి ఉండేది. కాని అలా అయ్యింది. తర్వాత ఇదే తగిన అవ కాశం వాళ్ళకి.

సిగ్గుతో ముడుచుకు పోయిన తుంగమ్మ తరఫున సరసమ్మ బదులు చెప్పారు-

"దానికేం ? నెల కానివ్వండి. జీతం వచ్చిన రోజున విందు భోజనం పెట్టిస్తుంది."

ఆ క్షణం నవ్వుల వెన్నెలలో వాతావరణం నిర్మలంగా అవి పించింది.

భోజనాలయ్యాక సరసమ్మ తుంగమ్మని తమ గదిలోకి తీసి కెళ్ళారు.

"రా తుంగా!" అంటూ మంచంవేపు చూపించారు. తుంగమ్మ కూర్చుంది.

"ఇక నిన్ను గౌరవంగా బహువచనంలోనే పలకరించాలి కదూ ?"

"దొడ్డమ్మా! దయచేసి ఆ పనిమాత్రం చేయకండి. ఇదివరకు ప్రేమగా ఎలా పిలుస్తున్నారో అలాగే పిలవండి."

మరో రకమయిన జవాబుకు ఎదురుచూడని సరసమ్మ తమ అనుభవాలు చెప్పుకుంటూపోయారు—"నువ్వు విన్నావనుకుంటాను : అభయ ధామాన్ని ఈ స్థాయికి తేవటానికి చాలా శ్రమపడ్డాం. ఇంతకు ముందు ఎలా ఉండేదని !........" అంటూ.

ఆమె అభయ ధామానికి సహాయకురాలుగా వచ్చినప్పు డున్న మేట్రన్ వయసుమళ్లిన ఆవిడ. ఆ రోజుల్లో వస్తున్న పిల్లల ఒంటి మీద ఆభరణాలు 'జబ్బు, కాంక్ష'-ఇవే. మేట్రన్ వారిని కొట్టి బుద్ధి చెప్పేవారు. తమకు చేతకాకపోతే పోలీసుల్ని పిలిపించి కొట్టించేవారు.

అప్పుడు సహాయకురాలిగా వచ్చిన ఓ ఆవిడ ఒక్కవారం కూడా ఉండలేకపోయారు. ఓ పిల్ల ఆమె అందమయిన చేతిని మాంసం వెలికి వచ్చేలా కొరికేసింది ఆస్పత్రిలో కట్టు కట్టించుకున్న ఆవిడ మళ్లీ అభయ ధామపు మొహం చూడలేదు.

ఆ తరువాత సహాయకురాలిగా సరసమ్మ చేరారక్కడ. సంఘ సేవిక అవాలన్న ఆమె ప్రబలమైన ఆకాంక్ష ఓ నెలరోజుల్లోనే కరిగి పోయింది. ఆ బ్రతుకు మీద విసుగు కలగసాగింది.

ఇలా ఉండగా మేట్రన్ పదవినే నిర్వహించాల్సిన పరిస్థితి ఏర్పడింది సరసమ్మ. అక్కడున్న ఒకరిద్దరు మంచి పిల్లలమీద ఆధారపడి, అక్కడే స్థిరపడటానికి నిశ్చయించుకున్నారు.

సంవత్సరాలు దొర్లిపోయాయి. సంస్థ పెద్దదయింది. కొత్త భవనం వచ్చింది. రకరకాల మానవ జీవితాలను సూక్ష్మంగా పరిశీలిస్తూ, పరీక్షిస్తూ, సరసమ్మ మనఃశాస్త్ర పారంగతురాలయారు.

లోపల చిన్నచిన్న దొంగతనాలు జరిగేవి.

ఓసారి సరసమ్మ చేతి గడియారం పోయింది.

అప్పుడు ఏం చెయ్యాలో తోచక దిగ్భ్రమతో సరసమ్మ అసహాయురాలై అటునుం డిటు కాలుగాలిన పిల్లిలా తిరగ సాగారు.

"ఉన్న దొక్కటే మార్గం. పోలీసుల్ని పిలిపించి తలా నాలుగు తగిలించండి. వాళ్ళే నోరు విప్పుతారు" అన్నాడు మగ్గం నెయ్యటం నేర్పటానికి వచ్చే మనిషి.

సరసమ్మ అలా చెయ్యలేదు. అప్పుడు అభయ ధామంలో ఉన్నది ఆమె కాక పన్నెండు మంది. వారిలో గడియారం దొంగిలించినవా రెవ్వరు?

అందర్నీ మంచి మాటల్తో అడిగి, లాభంలేక, విసిగి సరసమ్మ తాము భోజనం చేయనని పట్టుబట్టారు. ఒక్క పిల్ల తప్ప, మిగతావా రెవరూ సరసమ్మ బెదరింపును లెక్క చెయ్యలేదు. నవ్వుతూ తమ పాటికి తాము భోంచేసి హాయిగా పడుకుని నిద్రపోయారు. ఆ ఒక్క పిల్ల మాత్రం సరసమ్మ దగ్గరకి వచ్చి ఏడుపు మొహంతో—

"మీరు భోం చేయండమ్మా! వాళ్ళంతా చెడ్డవాళ్ళు. పోయిన

గడియారం దొరుకుతుందా? లేవండి, భోం చేద్దురుగాని" అంది.

సరసమ్మ మనసు ద్రవించి, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దిగ మ్రింగుకుని భోజనానికి లేచారు. కాని భోంచెయ్యనని సాయంకాలమే చెప్పి ఉండటంచేత, పిల్లలు ఆమెకోసం ఏమీ మిగల్చలేదు!

సరసమ్మ తమ గది తలుపులు మూసుకుని, పడుకుని బావురు మని ఏడ్చారు.

మరునటి రోజు, వంటసామగ్రి ఇవ్వకుండా, ఆ పిల్లలంతా ఉప వాసం ఉండేలా చెయ్యాలని సరసమ్మ కనిపించింది. కానీ అలా చెయ్యలేక పోయారు.

జరిగిం దిది అందులో ఉన్న ఒకమ్మాయిని చూట్టానికి వాళ్ళ అమ్మ ప్రతివారం వస్తూండేది. గడియారం పోయినరోజు సాయంత్రం కూడా ఆవిడ వచ్చింది. అప్పుడు తాను సంపాయించిన వస్తువును తల్లికి అప్పచెప్పింది ఆ పిల్ల. ఆ తల్లి దానిని వెంటనే అమ్మేసింది.

జరిగింది తెలిసాక కూడా సరసమ్మ ఏమీ చేయలేక పోయారు.

అప్పు డామెను సానుభూతితో చూసిన పిల్ల, తరువాత పెళ్ళయి వెళ్ళిపోయింది.

ఇంకో కథ— పోలీసులు వేశ్యాగృహంనుండి తీసుకొచ్చిన పిల్లను గురించి.

వాళ్ళు అప్పచెప్పి వెళ్ళిన పిల్ల అందమైంది.

మరునటిరోజు మధ్యవయస్కురా లొకామె వచ్చి తలుపుకొట్టి, సరసమ్మగారి కాళ్ళమీదపడి ఏడ్చింది.

"నా కూతురా....ఒక్కతే కూతురు నాకు....మంచి పిల్లమ్మా! ఈ సంవత్సరమే పెళ్లి చేద్దామనుకుంటున్నా. ఎవరో అబద్ధాలు చెప్పి తీసుకొచ్చారు, విడిచి పెట్టండమ్మా...."

సరసమ్మ ఆ పిల్లను పిలిచి అడిగారు-

"ఈమె మీ తల్లా?"

ఆ పిల్ల కాదనలేదు.

"రా తల్లీ, వెళ్ళిపోదాం...." ప్రేమ ఒలకబోస్తూ పిలిచింది.

ఇందులో ఏదో మోసం ఉన్నట్టు ఊహించి—

"రేపు, పోలీసుల దగ్గర్నుంచి చీటీ పట్టుకురా. నీ కూతుర్ని వదిలేస్తాను!" అని ఆవిడను బయటకు పంపేసరికి తలప్రాణం తోకకి వచ్చినంత పనయింది-సరసమ్మకు.

కాని ఆవిడను బయటకు పంపించి తలుపు వెయ్యగానే ఆ పిల్ల సరసమ్మ కాళ్ళమీదపడి, భయంతో కంపించి పోతూ, పసిపిల్లలా ఏడవసాగింది.

"నన్ను పంపించకండి దొడ్డమ్మా, నన్ను పంపించకండి..."

అసలు సంగతి బయటపడిం దప్పుడు. ఆ అమ్మాయిని పెడత్రోవ పట్టించింది తల్లే! ఇప్పుడు తన సంపాదన పోతోందన్న బాధతో కూతుర్ని తీసికెళ్ళి మళ్ళీ మామూలుగా సంపాయించాలని ప్రయత్నిస్తోందా మహాతల్లి....

సరసమ్మ కళ్ళ నిప్పులు కురిశాయి.

"భయపడకు. నే నున్నాను" అన్నారు.

మరునటి రోజూ వచ్చింది ఆ తల్లి—చీటీ లేకుండానే. సరసమ్మ ఆమెను లోపలకు రానివ్వలేదు.

"ఎందు కిలా చేస్తున్నారమ్మా! మీకు పిల్లల్లేరూ?" అంది దొంగ ఏడుపు ఏడుస్తూ.

"నాకు పిల్లల్లేరు. వెళ్లిపో. ఇంక రాకు ఇక్కడికి."

"కన్నతల్లి కడుపు మండించకండి."

"వెడతావా, పోలీసులకు కబురంప మంటావా? చాలించు నాటకం...." అని గద్దించారు సరసమ్మ.

పోలీసుల పేరు విని ఆ ఆడది గయ్యిమని లేచింది. కూతుర్ని నానా మాటలతో శపించింది.

"నా కూతుర్ని బేరం పెట్టి సంపాయించాలని నీ ఎత్తు" అని సరసమ్మగారినే ఆడిపోసింది!

ఇంకా కొన్ని సందర్భాల్లో అమ్మాయిలే పారిపోవటానికి ప్రయత్నించటం జరిగింది. వాళ్ళ ప్రియులు రాత్రిళ్ళు బయటనుండి చిత్రంగా ఈలలు వేసేవారు. అలాంటపుడు సరసమ్మ కళ్ళల్లో వత్తులు వేసుకుని కాపలా కాసేవారు. దీపాలన్నీ వెలిగించి ఉంచేవారు.

ఆ తరువాత ఆహారంలో విషం కలిపి ఇచ్చి ఆ అమ్మాయి జబ్బు పడి ఆస్పత్రిలో ఉంటే ఎత్తుకు పోవటానికి ప్రయత్నించటం...

తుంగమ్మ, ఆసక్తికరమైన కథ వింటూన్నట్టు. 'ఊ' కొడుతూ కూర్చుంది. జలజ ఈ సంఘటనలు కొన్ని చెప్పింది నిజమే కాని, సరసమ్మ నోటినుండి వాటిని వినే అదృష్టం లభించింది ఇవ్వాళ.

సరసమ్మ ఊరుకోవటాన్ని చూసి కథలు అయిపోయాయేమో అనుకుంది.

అలా కాకుండా ఉండాలని ఓ ప్రశ్న వేసింది-

"ఓసారి అందరూ కలిసి పారిపోవటానికి ప్రయత్నించారుట కదూ?"

"అవును. జలజ చెప్పిందా?"

"ఆఁ....జలజ రాక మునుపో, వచ్చిన కొత్తలోనో... "

సరసమ్మ ఆ సంఘటన తల్చుకుని నవ్వారు. చెప్పసాగారు:

"ఓ రోజు............"

అవ్వాళ నిర్వాహక సమితి సభకు వెళ్ళారు సరసమ్మ. అలా వెళ్ళేటప్పుడు బయటినుండి తాళం వేసేవారు. వెనక్కి వచ్చేసరికి చీకటి పడేది.

ఈ విషయాలన్నీ బాగా తెలిసిన కొంతమంది పిల్లలు లోలోపలే ఓ పథకం వేసుకున్నారు. సరసమ్మ లోపలికి రాగానే ఆమె కళ్ళల్లో కారం చల్లాలి. అరవకుండా నోట్లో గుడ్డలు కుక్కాలి. గదిలోకి లాగి గొళ్ళెంపెట్టి అందరూ బయటపడాలి!

చాలా రోజులబట్టి వాళ్ళ మనసులో ఉన్నది అవ్వాళ చెయ్యటానికి నిశ్చయించుకున్నారు. వంటింట్లోనుండి కారం కొంచెం చిప్పలో తెచ్చి పెట్టుకున్నారు. ఈ పథకం వేసిన నలుగురు పిల్లలూ సంగతంతా రహస్యంగా ఉంచుకున్నారు.

అభయ ధామానికి కొత్తవారైన జలజ, లలితలకు ఏమీ తెలియదు.

ఒక్క పిల్లకు మాత్రం సందేహం వచ్చింది. ఆమె- మూగపిల్ల కల్యాణి,

గుమ్మం ఇవతల పూలచెట్టుక్రింద ఉన్న కారం ఆమె కళ్ళ పడింది. ఆ నలుగురిలో ఒకమ్మాయిని పిలిచి "అదెందుకూ?" అడిగింది సైగతోనే. "నోర్మూసుకో. లేకపోతే చంపేస్తాము" అన్న జవాబు వచ్చింది-అదే భాషలో.

చేతులూ కాళ్ళూ ఆడలేదు కల్యాణికి. నోరెలాగూ లేదు. కాని మనసు పని చేసింది. కూచికలూ, తీసివేతలు, భాగారం, గుణకారం చేసేసరికి ఆ కారం అక్కడెందుకుంది అన్నదానికి అస్పష్టంగా కారణం కనిపించింది. కల్యాణికి భయంతో వొళ్ళంతా చెమట పట్టింది. వణికిపోయింది ఎవరికీ ఏమీ చెప్పలేక భయంతో వణుకుతూ దొడ్డమ్మ ఆఫీసుగదిలో ఓ మూలలో ఒదిగి కూర్చుంది.

సరసమ్మ వచ్చే వేళ అవుతూంది. పారిపో దల్చుకున్నవాళ్ళకి ముళ్ళమీద ఉన్నట్టుగా ఉంది. కల్యాణి గొడవ చెయ్యక పోవటం వాళ్ళకు నిశ్చింతగా వుంది.

దొడ్డమ్మ వీధిలోనుండి కాంపౌండ్ లోపలికి అడుగుపెట్టారు. లోపలింకా దీపాలు వెయ్యలేదు. నలుగురు పిల్లలూ పిడికిళ్లలో కారంతో తలుపు దగ్గర నుంచున్నారు సిద్ధంగా.

సరసమ్మ తలుపు దగ్గర కొచ్చారు.

ఆ పిల్లలు- ఇంకేం, తమ పథకం నెరవేరబోతూం దనుకుంటూండగా, ఓ వికారస్వరం వినిపించింది. మూగపిల్ల కల్యాణి వికారంగా, విచిత్రంగా అరుస్తోంది. పిల్లలంతా గది ముందు గుమిగూడారు. సరసమ్మ గాభరాగా లోపలి కొచ్చారు.

ఈ హడావుడిలో ఆ నలుగురు పిల్లలూ వీళ్ళ గదివేపు పరుగు తీయటం ఎవరి కంటా పడలేదు.

కల్యాణి దొడ్డమ్మను వాటేసుకుని వణికి పోతూంది. మూగ పశువు రోదనలా ఉంది.

ఇదేం జబ్బో అని కంగారు పడ్డారు సరసమ్మ.

కల్యాణిని ఓదార్చటానికి చాలాసేపు పట్టింది ఆవిడకు. ఏడుపు ఆపి సమాధాన పడ్డాక కూడా కల్యాణి ఏమీ చెప్పలేదు. వేలెత్తి ఎవర్నీ చూపించలేదు.

తరువాత ఎవరో తోటలో ఉన్న కొబ్బరి చిప్పనూ, అందులో మిగిలిన కారాన్ని చూశారు. అందరికీ తెలిసింది. అర్థమయింది.

నేరస్థులను కనిపెట్టటం కష్టం కాకపోయినా, ఎవరూ మాట్లాడ లేదు.

ఆరాత్రి పడుకున్నప్పుడు సరసమ్మ భయంతో వణికిపోయారు.

ఇప్పుడు ఈ కథ విని వణికిపోయింది తుంగమ్మ. ఎలాటి ఆపదనుండి తప్పించుకున్నారు దొడ్డమ్మ ! అది ఎప్పటి కథో కాదు కూడా- నాలుగేళ్ళ క్రిందటే జరిగింది.

ఆ అమ్మాయిల్లో ఇద్దరు నర్సు కోర్సుకు వెళ్ళారు. మిగతా వాళ్ళు మంచివాళ్ళు అయారు. చాలా రోజుల తర్వాత వాళ్ళే వచ్చి తప్పొప్పుకున్నారు. దానికి కారణం- మిగతా పిల్లలు వాళ్ళను పెట్టిన హింస.

పెద్దవారు మంచివా రయ్యారు.

అలా అవటానికి సాధ్య మయింది.

అదే తల్చుకుని చిరునవ్వు నవ్వింది తుంగమ్మ.

"అందులో ఒకమ్మాయి నీకు బాగా తెలుసు."

తుంగమ్మ కనుబొమలు ఆశ్చర్యంతో పైకి పోయాయి.

"ఎవరు దొడ్డమ్మా !"

"నువ్వు చెప్పుకో చూద్దాం."

తుంగమ్మ ఆలోచించింది. కనుక్కోలేక పోయింది.

"తెలీదు దొడ్డమ్మా !"

"సావిత్రి."

"నిజంగానా దొడ్డమ్మా ? !"

తమ దొడ్డమ్మకంట కారంచల్లి పారిపో దల్చుకున్న అమ్మాయి సావిత్రి ! ఇవ్వాళ అదే సావిత్రి దొడ్డమ్మ మెచ్చుకుని అభిమానించే పిల్లల్లో ఒకతి.

మౌనంగా గడిచింది కాసేపు.

ఒళ్ళు విరుచుకుని ఆవలించారు దొడ్డమ్మ.

సూక్ష్మంగా అంకురించి, శతకోటి ప్రాణులను కలుపుకుని,

ఆకారం దాల్చి, మహావృక్షంలా విస్తరిల్లిన అభయ ధామపు చరిత్ర అది!

తుంగమ్మ మనసంతా ఆ కథల మధ్యే విహరిస్తూంది.

"పొద్దుపోయింది. ఇక పడుకుందాం. పూర్తయ్యే కథ కాదిది."

అవునన్నట్టు తలూపి లేచింది తుంగమ్మ.

లేచి నుంచుని కిటికీనుంచి బయటికి చూసింది. దూరంగా ఓ ఇంటిలో వెలుగుతున్న ఒకే ఒక్క దీపం ఆరిపోయింది. ఇంటి యజమాని, లేక యజమానురాలు ఆర్పి ఉండాలి. చీకటి....

గదిలో వెలుగుతున్న ఎలక్ట్రిక్ లైటు వెలుగులో తుంగమ్మ చూరువేపు చూసింది. దూలం. మేకు....

నవ్వొచ్చింది తుంగమ్మకు.

"ఎందుకూ నవ్వు?"

'ఏం లేదు' అనలేదు తుంగమ్మ. "నేను ఇక్కడి కొచ్చినప్పుడు ఓ ఆడ పిచ్చుక అక్కడ కూర్చుని నిద్రపోయేది- ఆ మేకు మీద" అంది.

"ఫరవాలేదే, నువ్వూ చూశావన్నమాట!"

"ఆఁ. తన గూడు తయారవగానే వెళ్ళిపోయింది."

'అందరూ అంతే' అని నాలుక చివరిదాకా వచ్చిన మాటని ఆపుకున్నారామె.

తుంగమ్మ నీళ్ళగదికి వెళ్ళి వచ్చింది. తాను పునర్జన్మ పొందిన గది ముందు జలజ పడుకుని ఉంది. ఆమె పక్కనే తన చాప వేసి ఉంది- ఎప్పటిలా, జలజ వేసుంటుంది

నిద్రపోతున్న జలజ పక్కన చాపమీద పడుకుంది తుంగమ్మ.

"ఇంత సేపయిందా టీచర్?"

జలజ కంఠం! దొంగ! నిద్ర పోవటం లేదన్నమాట! కాని, ఆ సంబోధన ఏమిటి? అందుకనే "ఏమన్నావ్?" అంది తుంగమ్మ.

"మేట్రన్ గారితో మాట్లాట్టానికి ఇంత సేపు పట్టిందా టీచర్' అని అడుగుతున్నా!"

"జలజా, కొడతాను నిన్ను. అలా పిలువకు ఇంకోసారి!"

ప్రేమతో గద్దించిన ఆ మృదుకంఠం వాతావరణంలోని విశ్రాంతికి గిలిగింతలు పెట్టింది.

"వెయ్యిసార్లంటాను. టీచర్! టీచర్! టీచర్!"

తుంగమ్మ చప్పున లేచి కూర్చుని, జలజ చెవి పట్టుకుని వదల్లేదు.

"అయ్యో. వదులు. అక్కా! వదులు."

"ఆఁ. అలా దారికి రా!"

• • •

ఉదయం లేస్తూండగానే తుంగమ్మకు ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న తండ్రి గుర్తుకొచ్చారు. వెనుక తనకూ, తరువాత తమ్ముడికీ ఆయన పాఠాలు చెబుతున్న దృశ్యాలు కళ్ళకు కట్టాయి. అలాగే, తను అభిమానించే అధ్యాపకులొకాయన పాఠం చెబుతున్న పద్ధతి....

మెల్లమెల్లగా తెల్లవారింది.

తుంగమ్మ చాపమీద కూర్చుని తాను తరగతిలో పిల్లలకు పాఠం చెప్పాల్సిన సంగతి గురించి ఆలోచిస్తూంది.

ఒకసారి, ఈ ఉద్యోగం కాకపోయినా బాగుండేది అనిపించింది.

విధిలేక ప్రమాదాన్ని ఎదుర్కొంటున్న దానిలా మొహం వేలాడేసుకుని కాలకృత్యాల మీదకు దృష్టి పోనిచ్చింది.

కాని తుంగమ్మ మనసులోని కలతని సూక్ష్మగ్రాహి అయిన దొడ్డమ్మ కళ్ళు కనిపెట్టేశాయి. తుంగమ్మని గదిలోకి పిలిచారామె.

"పాఠం చెప్పగలనా, లేదా అని భయపడుతున్నావా తుంగా!"

మనసు లోపల దూరి గ్రహించే శక్తి దొడ్డమ్మది

ఆవిడనుండి ఏదీ దాచటం అసాధ్యం. ఆమె ఊహ సరైనదే. కానీ తుంగమ్మ ఒప్పుకోటానికి సిగ్గుపడింది.

"మొదట ఇక్కడికొచ్చిన రోజున నాకూ అలాగే అనిపించిందమ్మా! అది సహజం."

"ఏమిటో దొడ్డమ్మా! పిల్లలు అల్లరి చేస్తే...."

"పిచ్చి పిల్ల. ఎవరూ అల్లరి చెయ్యరు. నువ్వు బాగానే పాఠం చెప్పగలవు. నాకు తెలుసు."

"ఏం చెబుతానో...."

"మేస్టారి కూతురివి తుంగా, నువ్వు...."

మళ్లీ తండ్రి జ్ఞాపకాలు. ముప్ఫయ్యేళ్ళ అధ్యాపక వృత్తిలో ఆయన దగ్గిర ఎంతోమంది ఓనమాలు నేర్చుకున్నారు. విద్యావంతు లయ్యారు. తరువాత పట్టా పుచ్చుకున్నవా శ్శెంతమందో! తను! ఏమీ తెలియని పిల్లలచేత ఓనమాలు దిద్దించాలి. దానికే ఇంత బెరు కయితే!

సరసమ్మ మాటల్తో ధైర్యం తెచ్చుకున్న తుంగమ్మ మొహంలో వికాసం వచ్చింది.

....ఆ రోజు, అభయ ధామాని కొచ్చిన రాజమ్మగారికి సమితి తీర్మానం సంగతి తెలిసింది. విశాలికి తమ బరువు కాస్త తగ్గినందు కామె సంతోషించాల్సింది. కాని అలా జరుగలేదు.

"చాలా సంతోషం" అని ఆమె నోటితో అన్నా, మొహం ముడుచుకుంది.

లలితకు ఆవిడను చూపిస్తూ—

"చూశావా, ఎలా మొహం ముడుచుకుందో! మన తుంగక్క ఇంకాస్త ఇంగ్లీషు నేర్చుకుని, ఓ రెండేళ్ళు పోతే, ఈ మేడంని తరి మెయ్యొచ్చు కదూ లలితా!" అంది జలజ.

లలిత 'అవు' నన్నట్టు తల వూపింది.

రాజమ్మ సాయంతో సరసమ్మ పిల్లల్ని రెండు తరగతులుగా విడదీశారు. చెరిసగం మంది పిల్లలున్నా రాజమ్మ తరగతి విశాలంగా ఉన్న వసారాలోనే జరిగింది. తుంగమ్మ-పిల్లలు మగ్గం ఉన్న మూల కూర్చున్నారు.

జలజా లలితలన్నా తనదగ్గర ఉంటే అనిపించింది తుంగ మ్మకు. కాని వాళ్ళిద్దరూ పాఠాలు నేర్చుకుని కథల పుస్తకాలు చదివే దాకా వచ్చేశారు. వాళ్లు తుంగమ్మ క్లాసుకు వచ్చే అవకాశమే లేదు.

రాజమ్మ కంఠం అధికారంగా పలికింది.

"ఏమైనా తెలియకపోతే వన్నడగండి."

ఆ బహువచనపు సంబోధనలో వ్యంగ్యం కనిపిస్తుంది. కాని తుంగమ్మ దాన్ని గమనించ దల్చుకో లేదు.

తుంగమ్మ తన విద్యార్థినుల ఎదుట కూర్చున్నప్పుడు వాళ్లంతా ముసిముసి నవ్వులు నవ్వారు.

సరసమ్మ తుంగమ్మకు సహాయంగా వచ్చారు.

"అందరూ లేవండి."

తుంగమ్మతో సహా అందరూ లేచి నుంచున్నారు. ఒక్కరి చేతిలోనూ పలకా-బలపం లేదు.

"ఎందుకర్రా, ఒట్టి చేతులతో వచ్చారూ?"

పిల్లలెవరూ మాట్లాడలేదు. ఓ అమ్మాయి మాత్రం కిసుక్కున నవ్వింది. ఓ అమ్మాయి ధైర్యంతో జవాబు చెప్పింది- "తుంగమ్మ గారి క్లాసుకు పలకా-బలపం అవసర ముంటుందో లేదో నని తేలేదు దొడ్డమ్మా!"

గద్దించాలా, నవ్వి ఊరుకోవాలా అని ఓ క్షణం ఆలోచించారు దొడ్డమ్మ. తరువాత నవ్వేసి "కిలాడీలు? వెళ్ళండి. పలకా-బలపం తెచ్చుకోండి" అన్నారు.

పిల్లలంతా గబగబా లేచి వెళ్ళి పలకలు తెచ్చుకున్నారు.

ఆ తరువాత క్లాసు మొదలయింది

సరసమ్మ చెబుతుండగా, గోడకు అర్చిన బోర్డుపైద సుద్ద ముక్కతో తుంగమ్మ ఓనమాలు రాసింది.

"ఓం నమః శివాయ .. "

ఆ తర్వాత ఒక్కొక్కటిగా అక్షరాలు.

పిల్లలు ఇంతకు మునుపు ఎన్నో మార్లు వ్రాసిన అక్షరాలనే మళ్లీ రాసుకున్నారు. తరువాత దిద్దటం.

చూస్తూ నుంచున్నారు సరసమ్మ. తుంగమ్మ సమర్థత విష యంలో ఆమె కెటువంటి సందేహమూ లేదు.

అభయ ధామం ఏం సాధించింది? అని ఎవరైనా అడగ్గానే,

ఇక సరసమ్మ గర్వంతో, నిటారుగా నుంచుని. తుంగమ్మవేపు చూపించి చెప్పగలరు-

"మాశారా? ఈ తుంగమ్మని- నా అసిస్టెంటు. ఒకప్పుడు అభయం యాచిస్తూ ఇక్కడికి కొచ్చారు...."

అలా ఆలోచిస్తూ క్లాసును గమనించటం మర్చి పోయారు సరసమ్మ. నుంచున్నచోటునుండి కదలి తమ గదివేపు వెళ్లిపోయారు.

అభయ ధామపు నిర్వాహక సమితి కొత్త సెక్రటరీ నెన్నుకున్నాక. సరసమ్మ పాత కోర్కెలు మళ్లీ తలెత్తాయి. సంఘంలోని ధనవంతులూ, దానశీలురూ అయినవారిని ఆశ్రయించి డబ్బు సేకరించటం ఇబ్బందనిపించేది కాదు. ధన సహాయానికి లోపం లేదు. కానీ. జనసహాయం- నమ్మకంగా నిజాయితీగా, ఉత్సాహంగా పని చేసే కార్యకర్తల సహాయం లేదు ఆమెకు. కనుకనే తలెత్తుతున్న కోర్కెలనూ అదిమి ఉంచక తప్పలేదామెకు.

ఇప్పుడు మళ్ళీ ఆ కోర్కెలు తలెత్తాయి.

అభయ ధామపు కార్యక్రమాలను అధికం చెయ్యాలి. గుడ్డలకు రంగు లెయ్యటం, చీరెలమీద అద్దకం వెయ్యటం లాటి వృత్తులను ప్రవేశపెట్టాలి. కొంతమంది పిల్లలకన్నా పై చదువులు చెప్పించాలి. వీలయినంత తొందరగా అభయ ధామంనుండి ఒక్క పిల్లచేతనైనా స్కూల్ ఫైనల్ పరీక్షకు కట్టించాలి. ఎప్పటి కయినా అభయ ధామపు అమ్మాయిలు పట్టా కూడా పుచ్చుకోవాలి.... ఎన్ని గాలిమేడలు!

అవన్నీ భవిష్యత్తులో జరగాల్సిన కల లయితే, ప్రస్తుతం జరగాల్సిన విషయం మరొకటుంది. అభయ ధామపు అంతను పురుడు పోసుకున్నప్పుడల్లా పుట్టిన పిల్లలని అనాథాశ్రమానికి పంపటం అలవాటు అలా పంపించవలసి వచ్చినపుడు ఆమెకు చాలా బాధగా ఉండేది. దానికి బదులు అభయ ధామానికి అనుబంధంగా ఓ బాల విహారం కూడా వుంటే! అది వీధిలో దిక్కు లేకుండా తిరిగే పిల్లలకూడా ఆశ్రయమవుతుంది. అభయ ధామం చుట్టూవున్న ఖాళీ ప్రదేశంలో మరో భవనం సులువుగా కట్టించొచ్చు.

అంతకన్నా ముఖ్యంగా జరగాల్సింది ఆవరణలో కూరల

పెంపకం. ఇప్పుడున్న చిన్న గోడమీద కనీసం ఎత్తుగా ముళ్ళ కంచెన్నా వేస్తేగానీ అది కుదరేలా లేదు. దానివల్ల అభయ ధామానికి కావల్సిన కూరల ఖర్చు తగ్గటమే కాక, వాటిని అమ్మించటం వల్ల ఆదాయమూ ఉంటుంది.

—సరసమ్మ ఆలోచనల్లో ఉండగానే కిటికీలో నుండి 'పోస్ట్' అన్న కంఠం వినిపించింది.

దాంతో బాటే ఓ కవరూ గదిలో పడింది

తప్పుల తడక ఇంగ్లీషులో ఆ కవరు మీద ఆమె పేరే ఉంది. కవరు మీద ఆ ఊరి పోస్ట్ ఆఫీసు ముద్ర వుంది.

'ఈ ఊరి నుండే రాశా రెవరో' అనుకున్నారు సరసమ్మ ప్రతిసారి కుతూహలంతో కవరు చింపడం ఆమె కలవాటు. ఈసారి కూడా అలాగే ఆత్రుతతో కవరు చింపారు.

వ్రాసినతని సంతకం చూసి, మొదటి వాక్యం చదివి చిరునవ్వు నవ్వా రామె.

అలాటి మంచిరోజున స్వారస్యమయిన కబురు ఆశించటంలో అసహజ మేమీ లేదు.

అందులో ఇలా ఉంది-

"తమరు పోయిన డిశంబర్‌లో సెలవిచ్చిన మేరకు ఇప్పుడు మళ్లీ రాస్తున్నాను. నా కోరిక మీరే నెరవేర్చాలి. మీరే శరణు నాకు. మా ఆఫీసరుగారూ అదే మంచి దంటున్నారు. కనుక తమరు నా యందు దయవుంచాలి. ఈసారి నిరాశ పర్చకూడదు. ఎల్లుండి మంచి రోజని సిద్ధాంతిగారు చెప్పారు. ఎల్లుండి వస్తాను.

ఇట్లు,
సేవకుడు
మహాబల."

సంతకం మటుకు ఇంగ్లీషులో చేసిన మహాబలుడు చిత్రమైన మనిషి. ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసులో బంట్రోతుపని చేస్తున్నా డతడు. అతడి పెళ్ళాం సంవత్సరం క్రిందట పుట్టింటికి పారిపోయింది మళ్ళీ రాలేదు. ఆమెను తల్లి తండ్రులు పంపనూ లేదు. పిలవటానికి వెళ్ళిన

మహాబలుణ్ణి 'మా పిల్లకు వేరే సంబంధం చూశాము. అలాంటి రత్నాన్ని పెళ్ళాడ్డానికి అదృష్టం ఉండాలి. పో-పో....'' అని తిట్టి తరిమేశారు.

'పెద్ద ఆఫీసరుగారి దగ్గర బంట్రోతుగా వున్న తనకు ఇంత అవమానమా?'

ఆఫీసరుగారి ముందూ, అమ్మగారి ముందూ మహాబలుడు తన గోడు చెప్పుకుని 'నా కెక్కడైనా ఓ పిల్ల నిప్పించండి' అని వేడుకో సాగాడు. ఆ సాయంతం అమ్మగారు 'క్లబ్బు'లో తమ స్నేహితు రాళ్ళముందు సరదాగా బంట్రోతు కథ చెప్పారు. అందరూ పడీ పడీ నవ్వారు.

అందులో ఓ యువతీ మణికి ఓ ఆలోచన స్ఫురించి ''ఐస్'' అంది. చుట్టూరా వున్న అందరి కనుబొమలూ ప్రశ్నార్థకంగా పైకి లేచాయి.

''ఈ బంట్రోతుకు మనం సాయం చేసి తీరాలి. ఇది మన అభిమాన విషయం. ఏమంటారు?''

''ఎవరి కూతురు సిద్ధంగా ఉంది?''

''మన కమలమ్మ గారికి చెబుదాం. సంఘసేవకోసం మన క్లబ్బుకు రావటం మానేశారు కదా? వాళ్ళ అభయధామంనుండి ఓ పిల్లని ఇప్పించమందాం''

ఈ ఆలోచన బాగానే వున్నట్టనిపించింది.

''అభయ ధామంలో అలా జరుగుతూ వుంటుందట. ఎన్నో పెళ్ళిళ్ళు జరిగాయట కూడాను.''

''అవునవును.''

అందులో ఒకరు అనుమానిస్తూ ప్రశ్నించారు-

''అక్కడి వాళ్ళు పరిశుద్ధంగా వుంటారా? ఛ?''

ఇలాటి ప్రశ్న వచ్చినప్పుడల్లా గయ్యమని లేచే అలవాటున్న మహిళ ఒకరు గొంతెత్తి అరిచారు:

''అదేం ప్రశ్న? మగవాళ్ళంతా పరిశుద్ధంగా వుంటారా?''

''అలా కాదు. రోగాలూ పాడు ఏవైనా....''

"అయ్యో పాపం—మగవారికీ రోగాలకీ సంబంధం లేదన్న మాట!"

'రోగం' అంటూండగా క్లబ్బు సభ్యురాలు లేడీ డాక్టరు లోపలికి ప్రవేశించారు.

"డాక్టర్నడగండి మీ సందేహాలు." ఎవరో సూచించారు.

రోగాల సంగతి విని డాక్టరమ్మ నవ్వారు.

"మే ముండేది ఎందుకూ మరి? ఏం భయపడక్కర్లా—ఎలాటి రోగమయినా నయం చేసేస్తాం!" అన్నారు.

అలా అని ఊరుకో లేదామె. కొంటెగా నవ్వి, అందర్నీ ఓసారి పరీక్షించి చూసి—

"ఇప్పుడు చెప్పండి. ఎవరికి? ఎలాటి రోగం?"

ఆ మహిళా మణుల మొహాలు ఎర్రబడ్డాయి. అందులో ఒకరు నవ్వి అన్నారు:

"డాక్టర్! డోంట్ బి సిల్లీ!"

ఆ రాత్రి అమ్మగారు, "అభయ ధామంలో పిల్ల దొరుకుతుంది, ఖర్చు ఎక్కువ అవదు. చేసేసుకో"మని మహాబలుడికి సలహా ఇచ్చారు.

మహాబలుడు అభయ ధామం ఎక్కడుందో కనుక్కొని ప్రదక్షిణాలు చేశాడు గానీ, తరువాత ఎలా ముందుకు వెళ్ళాలో తెలియక మళ్ళీ అమ్మగారినే ఆశ్రయించాడు.

ఆమె అభయ ధామపు కార్యదర్శిని కమలమ్మగారికి ఉత్తరం రాపిచ్చారు. తరువాత నెలరోజులకి డిశంబర్‌లో మహాబలుడు అభయ ధామాన్ని దర్శించాడు.

"ఈసారి ఊరికే చూసి వెళ్ళండి. అమ్మాయిలూ మిమ్మల్ని చూస్తారు" అన్నారు సరసమ్మ.

అభిమానం దెబ్బ తినగా మహాబలుడు—

"వాళ్ళు నన్ను చూసేదేమిటి? నేను ఒప్పుకుంటే చాలదూ?" అన్నాడు.

సరసమ్మ నవ్వాపుకుని మెల్లగా అతన్ని వదిలించుకున్నారు.

మళ్ళీ ఈ ఉత్తరం!

జిడ్డులా పట్టుకునే స్వభావ మతనిది. ఆ రోజు అతను వచ్చి వెళ్ళాక, అతని రాకలోని ఉద్దేశం తెలుసుకున్న పిల్లలంతా హాస్యం చేస్తూ పడీ పడీ నవ్వారు. కాని ఒకమ్మాయి— కనకలక్ష్మి మాత్రం వాళ్ళలా నవ్వక మౌనంగా ఉండిపోయింది. అది చూపి మిగతా పిల్లలంతా ఆమెను ఏడిపించి, నానా గొడవ చేసి ఆమెను మహాబలుడి భార్యగా నిర్ధారించారు కూడా.

అవమానంతో ఏడ్చింది కనకలక్ష్మి.

కాని ఆమె కళ్ళకు మహాబలుడు బాగానే కనిపించాడు. అతడు తన భర్త అని వాళ్ళు వేళాకోళం చెయ్యటం ఆమెకు హాయిగానే ఉంది.

సరసమ్మ సూక్ష్మబుద్ధి ఆ సంగతి గ్రహించింది.

తమను నమ్ముకుని కూర్చున్న మహాబలుడిని నిరాశ పరచటం ఆమె కెంతమాత్రం ఇష్టం లేదు. పెళ్ళి కుదర్చమంటే ఎవరి కిష్ట ముండదు? అందులో అభయ ధామపు అమ్మాయికి పెళ్ళి అవుతుం దంటే ఆమె కెంతో సంతోషంగా ఉంది.

అవ్వాళ సాయంత్రం ఆమె కనకలక్ష్మిని ప్రత్యేకంగా పిలిచి మాట్లాడారు.

"అవ్వాళ 'మహాబల' అని ఒక రొచ్చారు గుర్తుందా?"

ఆమెకు గుర్తుంది. కాని అలా ఒప్పుకోటానికి సిగ్గేసింది.

"ఎవరు దొడ్డమ్మా? ఎప్పుడు?"

"అంత తొందరగా మర్చిపోయావా? ఊఁ....డిశంబర్‌లో వచ్చారు చూడు, ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసులో పని...."

కనకలక్ష్మి మొహం సిగ్గుతో ఎర్రబడి పోయింది.

"ఊఁ...."

"ఎల్లుండి వస్తారట."

'అయితే?' అన్నట్టు దొడ్డమ్మ వయిపు చూపింది కనక.

"ఏం జవాబు చెబుదాం?"

తననే ఎందుకు అడుగుతున్నారా అని ఆమె ఆశ్చర్యపడినా, తన్నొక్కతినే అడగడం ఆమెకు సంతోషమే కలిగించింది.

సరసమ్మ మృదువుగా భుజంమీద తట్టి ఆమెను బెంచిమీద కూర్చోపెట్టారు. 'ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసులో పని' అన్నారు. బంట్రోతు అనలేదు. అయినా మహాబలుడి అసలు ఉద్యోగ మేమిటో కనకలక్ష్మికి తెలియక పోలేదు.

కులం గొడవ లేదు. ఇదరిదీ ఒకే కులం. మహాబలుడికి ఏం తక్కువయింది? తగినంత చదువు, సంపాదన ఉన్నాయి. మొదటి పెళ్ళానికి అదృష్టంలేక వెళ్ళిపోయింది. ఇప్పుడు....

— మెల్లిగా వివరించారు సరసమ్మ.

రెండేళ్ళ క్రిందట జబ్బు మనిషిగా అభయ ధామంలో ప్రవేశించింది కనకలక్ష్మి. 'అరసికెరె' గ్రామం ఆమెది. చితికిపోయిన రైతు కుటుంబానికి చెందినది. చిన్నప్పుడే పెళ్ళయిందామెకు. ఏదో చిన్న గొడవ పెద్దదయి అత్తారింటవాళ్ళకు కోపాలొచ్చాయి. వాళ్ళు పిల్లను తీసుకెళ్ళలేదు. అతనికి మళ్ళీ పెళ్ళి చేశారు. కనకలక్ష్మి ఇల్లు వదిలి బెంగుళూరు చేరింది. కూలిపని చేసుకు బ్రతుకుతూంది. అందులో వయసులో ఉన్న పిల్లను తప్పనిసరైన బ్రతుకు....'అడ్డత్రోవ' అన్నారు దాన్నే. రోగంతో బాధపడుతున్న ఆమెకు ఎవరో అభయ ధామం పేరు చెప్పారు. ఒళ్ళంతా రోగాలతో ఇక్కడికొచ్చి చేరిందామె.

సరసమ్మ శ్రద్ధగా చికిత్స చేయించారు. ఆరేడునెలల్లో కనకలక్ష్మికి పూర్తిగా ఆరోగ్యం చేకూరింది.

ఇపుడు ఆమె ముందు జీవిత మహాదుర్గపు తెరచిన తలుపులు. లోపలికి ప్రవేశించనా-వద్దా అని శంకిస్తూంది మనసు.

ఆమె ఓ నిర్ణయాని కొచ్చేలా అన్నారు సరసమ్మ-

"చూడు తల్లీ, ఇదీ పరిస్థితి. నన్నడిగితే నువ్వు ఒప్పుకోవటం మంచిది. ఎన్నాళ్ళని ఇలాగే ఉంటావ్? ఆలోచించు."

ఎంతో సేపు మౌనంగా ఉన్న తరువాత కనకలక్ష్మి అంది-

"మీరు చెప్పినట్టు చేస్తాను దొడ్డమ్మా!"

"అయ్యో పిచ్చిపిల్ల. పెళ్ళి చేసుకునేది నువ్వమ్మా? నేను కాదు...."

"....    ....    ...."

"పోనీ, ఈ సంబంధం నీ కిష్టమేనా? అదైనా చెప్పు."

"ఊం ...."

ఆ మాట అన్నాక కనకం మనసు తేలిక పడింది.

సరసమ్మగారి మనసూ తేలిక పడింది.

తుంగమ్మను పిలిచి సంగతంతా వివరించా రామె.

"ఈ సంగతి అందరికీ చెబుదామా దొడ్డమ్మా?"

"ఇప్పుడే వద్దు తుంగా! ఉట్టినే ఏడిపించి వదులుతారు కనకని."

కానీ ఆవిడ తీసుకున్న జాగ్రత్తవల్ల ఏమీ లాభం కలుగలేదు. సరసమ్మ కనకలక్ష్మితో ఏకాంతంగా మాట్లాడుతున్నారనగానే ఊహాగానాలు ప్రారంభమయ్యాయి. కనకం బయటికి రాగానే మంచిమాటలతో వంటగదిలోకి లాక్కెళ్ళి ఆమెను చుట్టుముట్టి ప్రశ్నలతో వేధించసాగారు.

"ఏమిటది? చెప్పు. చెప్పుమరి" అని గొడవపెట్టి ఆమెకళ్ళల్లో నీళ్లు తెప్పించారు.

"నాకు తెలుసులెద్దూ, పెళ్ళి! అందుకే ఆ పొగరు!!" అని ఒకి రంటే_

"మహాబలయ్య వస్తున్నాడోచ్!" అని మరొకరు అందుకున్నారు.

కాని, అలా ఏడిపిస్తున్నప్పుడు కూడా ఆమె మనసులో తృప్తి నిండుగా ఉంది. ఇం కెన్నిరోజులు ఏడిపిస్తారులే అన్న ధీమా ఉంది.

'ఆ పుణ్యాత్ముడికి నచ్చకపోతేనో' అన్న భయమూ ఉంది.

మరుసటిరోజు ఆదివారం. క్లాసుల్లేవు. భోజనా లయ్యాక ఎండలోనే సరసమ్మ సెక్రెటరీ గారింటికి వెళ్ళారు. అసిస్టెంట్ తుంగమ్మ తాళపుచెవుల గుత్తి ఒళ్ళో దాచుకుని అభయధామపు రక్షణ భారాన్ని వహించింది.

సరసమ్మ తిరిగి వచ్చేసరికి చీకటి పడింది. వస్తూ దారిలో 'అభయ ధామంలో ఏం జరిగిందో' నన్న భయం ఎప్పటిలా ఆమెను పీడించింది. కానీ అంతా బాగానే ఉందక్కడ. ఆమె వచ్చేసరికి భజన జరుగుతూంది.

తుంగమ్మ 'పనయిందా' అని అడగాలనుకుంటూండగానే, పొట్టి దమయంతి, పరిగెత్తుకుంటూ వచ్చి, ఆయాసంతో రొప్పుతూ-

"దొడ్డమ్మా, పెళ్ళిరోజు నిశ్చయమయిందా అని అడుగుతూంది కనకం'' అంది.

అదంతా దమయంతి కల్పన అని ఆమెకు తెలుసు. నవ్వు ఆపుకొని, లేనికోపం నటిస్తూ—

''నిశ్చయిస్తా నుండు. ఇప్పుడే. భజన జరుగుతూండగా లేచి వస్తావా? ఊఁ....పద'' అన్నారు.

దమయంతి మొహం వేళ్ళాడేసుకు నీరసంగా వెనుదిరిగింది. అంతలో మంగళం వినిపించింది.

''చూశారా దొడ్డమ్మా, భజన ఐపోయింది'' అంది దమయంతి- తాను తప్పు చెయ్యలేదన్నట్టు.

''అయితే?''

''ఇప్పుడు చెబుతారా, నే నడిగినదానికి?''

''వెడతావా? నీ చెవులు మెలెయ్యనా?''

దమయంతి నవ్వుతూ పారిపోయింది.

''సెక్రెటరిగార్ని ఒప్పించి వచ్చానమ్మా! రేపు అత నొస్తాడు. మొత్తంమీద ఈ సీజన్‌లో మన అభయ ధామంలో ఓ పెళ్ళి జరుగుతుందన్నమాట!'' తుంగమ్మతో అన్నారు సరసమ్మ.

మరుసటిరోజే అత నొచ్చాడు. పిల్లను చూట్టానికి సెలవుపెట్టి వచ్చాడతడు. దుబ్బుక్రాపు, మాసిన కాకీ ప్యాంటు, తెల్లషర్టు, ఎప్పటిదో బహుమతిగా పుచ్చుకున్న పాత వులెన్‌కోటు, కాళ్ళకు చెప్పులు. తన మోటుతనాన్ని మరుగుపర్చటానికి తగినంత శ్రద్ధ తీసుకున్నాడతడు.

అత నక్కడికి రాగానే నవ్వులతో వాతావరణం అదిరిపోవా

ల్సిందే. కానీ దొడ్డమ్మ గొడవ చెయ్యకూడదని హెచ్చరించటంవల్ల అందరి నోళ్లకూ తాళం పడింది. మౌనంగానే కొంతమంది పిల్లలు ఆఫీసు గదిముందు ఇటునుంచటు పని ఉన్నవాళ్లలా తచ్చాడుతున్నారు. తమకు కనిపించినంతవరకూ చూసి, వంటగదిలో ఒదిగి నుంచున్న కనకలక్ష్మి ముందు వర్ణిస్తున్నారు.

ఎవరైనా పిల్ల తలుపువేపు వచ్చేసరికి చీమకుట్టినట్లవుతూంది మహాబలుడికి.

"నా ఉత్తరం తమకు అందిందనుకుంటా?"

"ఆ....వచ్చింది."

"తమరు....ఏమైనా...."

అంతకన్నా మాట్లాడటం అతనికి చేతకాలేదు.

"ఏదైనా చేద్దాం. అంటే, ఎప్పుడు పెళ్ళి చేసుకుందామనుకుంటున్నారు మీరు?"

"ఇప్పుడే....ఈ సీజనులోనే."

"ఓ....!"

"పెళ్లిళ్లసీజన్ మొదలయినప్పటినుంచీ ఇదే ఆలోచన నాకు. మా ఇళ్ళదగ్గర ఓ పెళ్లికూడా అయిపోయింది."

"సరే...."

మళ్ళీ ఊరుకున్నా డతడు.

సరసమ్మ పురమాయించినట్టుగా, అభయ ధామానికి వచ్చిన అతిథికి ఓ గ్లాసులో కాఫీ తీసుకొచ్చింది- కనకలక్ష్మి. తలవంచుకు నుంచుంది.

నల్లటి కాఫీ. కానీ కనకలక్ష్మి తెల్లగా ఉంది.

కాఫీ గ్లాసు బల్లమీ దుంచింది.

"కాఫీ తీసుకోండి" అన్నారు సరసమ్మ. కనకవేపు తిరిగి— "వెళ్లిపోకు-ఇక్కడే ఉండు కనకలక్ష్మీ!" అన్నారు.

కనకలక్ష్మి అన్నపేరు నెమరువేసుకుంటూ, మహాబలుడు కాఫీ గ్లాసు చేతికి తీసుకున్నాడు. ఆ నల్లటి పానీయాన్ని చప్పుడు చేస్తూ త్రాగాడు.

"ఎలా ఉంది?" అన్నారు దొడ్డమ్మ. పిల్లనుగురించి అడుగుతున్నారేమోనని కంగారు పడ్డాడు మహాబలుడు.

"కాఫీ ఎలా ఉందండీ?"

"బాగుంది."

"పిల్ల ఎలా ఉంది?"

"ఊఁ....ఆఁ...."

"ఈ అమ్మాయే. పేరు కనకలక్ష్మి. నువ్వూ చూడు తల్లీ!"

కనకలక్ష్మి, మహాబలుల మొహాలు సిగ్గుతో ఎర్రబడ్డాయి.

సరసమ్మ కనకం గురించి సూక్ష్మపరిచయం చేశారు. ఆమె అబద్ధాలు చెప్పలేదు. కాని ఈ పరిస్థితిలో ఎబ్బెట్టుగా అనిపించకుండా జాగ్రత్త వహించారంతే.

మహాబలుడు కనకలక్ష్మివేపు దొంగచూపులు చూస్తున్నాడు. ఆ పిల్ల తనది కాబోతూందని పొంగిపోయాడు.

ఓ పిల్ల అభయ ధామానికి వచ్చినప్పుడు, ఎరుపు, ఆకుపచ్చ పూలున్న వాయిల్ చీరె కట్టుకుంది. దాన్ని ఈవేళ 'వధువు'కు కట్టారు. తలదువ్వి ముడివేశారు. ఉద్యాన వనంలోని పూలదండతో అలంకరించారు. మొహానికి పౌడరు కోటా కాస్త ఎక్కువగానే పడింది.

ముఖ్యంగా వయసులోని అంగసౌష్ఠవం, అలంకారంతో కలిసి మహాబలుడిని ఆకర్షించింది.

"పిల్ల నచ్చిందా మీకు?"

"మీ రెలా చెప్తే అలాగే."

"అదేం మాట, స్పష్టంగా చెప్పండి. ఈమాత్రం బదులు చెప్పలేనివారు ఇక్కడికి రావటం ఎందుకు?"

తన్నెక్కడ వెళ్ళిపొమ్మంటారోనని మహాబలుడు త్వర త్వరగా తల వూపుతూ "నా కిష్టమే" అన్నాడు.

"సరే అయితే- పెళ్ళికి మంచిరోజు చూడండి."

"అదప్పుడే చూపించాను. వచ్చే గురువారం మంచి లగ్నం ఉంది."

"పెళ్ళి ఏర్పాటు ఎక్కడ చేద్దామనుకుంటున్నారు?"

"బళ్ళాపురం దగ్గిర ఘాటి సుబ్రహ్మణ్యం లేదూ, అక్కడ."

"పెళ్ళిఖర్చు మీరు పెట్టుకోవాలి."

"అలాటి ఖర్చేం ఉండదన్నారు అమ్మగారు?"

"ఖర్చంటే.... చిల్లరఖర్చులు. పెళ్ళికూతురుతో నేనూ, ఇంకోరూ వస్తాం. మాకు రైలు–బస్ ఛార్జీలు ఇవ్వాలి కదా?"

"అవునవును. ఇవ్వాలి మరి."

"మేము బీదవాళ్ళం. మీకు తెలుసు. అయినా ఆడపిల్లని ఇలాగే పంపలేం కదా?"

"అవును."

సరసమ్మకు ఒళ్ళు మండింది.

"అవును సరే, దానికేం చేస్తారో చెప్పండి."

"మీరే చెప్పండి."

"బాగానే ఉంది. అయితే వినండి. పెళ్ళికూతురికి మంచి చీరె, జాకెట్ గుడ్డ, మీ శక్తికి తగ్గట్టు ఏదైనా నగ కొనిపెట్టండి."

"అలాగే."

మహాబలుడికి ఆ క్షణంలో తనని వదిలిపెట్టి పుట్టింటికి పారిపోయిన పెళ్ళాం గుర్తొచ్చి వొళ్ళు మండిపోయింది. ఆమె తెచ్చుకున్న వాటితోబాటు తను చేయించిన నగలుకూడా తీసికెళ్ళిపోయింది.

ఆ సంగతి ఇక్కడ చెప్పాలనిపించింది మహాబలుడికి. కాని సరసమ్మ ఏమనుకుంటుందోనన్న శంకతో వూరుకున్నాడు.

"ఇంకో విషయ ముంది."

"ఊఁ...."

"ఇంతవరకూ కనకను అభయధామం తల్లిలా చూసుకుంది. ఇక ఆమె బాధ్యతంతా మీదే."

"అలాగే!"

"అభయధామాన్ని మీరు మర్చిపోకూడదు."

"ఖచ్చితంగా మరువను."

"పెళ్ళిసమయంలో వధూవరులు అభయధామానికి తృణమో పణమో కానుకగా ఇవ్వాలి."

అనుకోని ఖర్చు సంగతి వినేసరికి అతని బుర్ర తిరిగింది. అయినా తనను పెళ్ళాడాలని నుంచున్న పిల్లముందు గీసి గీసి బేరా లాడ్డం ఇష్టంలేక "అలాగే" అన్నాడు.

"అంతే. మీరిక వెళ్ళొచ్చు" అన్నారు దొడ్డమ్మ.

అతను లేచి నుంచున్నాడు.

"వరునికి దండం పెట్టమ్మా!" అన్నారు సరసమ్మ కనకతో. కనక ముందుకువచ్చి వంగి అతని పాదాలను కళ్ళకద్దుకుంది.

"ఛ! ఛ!" అన్నాడు మహాబలుడు. ఆమె రెండు భుజాలనూ పట్టి లేవనెత్తా లనిపించిం దతనికి. కాని సరసమ్మ ఎదుట అంత సాహసం చెయ్యలేకపోయాడు.

గురువారం రానే వచ్చింది. ఘాటి సుబ్రహ్మణ్యస్వామి సన్నిధిలో కనకలక్ష్మి - మహాబలుల వివాహం జరిగింది.

అవాళ సాయంత్రమే తిరిగివచ్చిన వాళ్ళని అభయ ధామంలో సత్కరించారు. సమితి కార్యదర్శిని తమ పరంగా పదిహేను రూపాయల చీరె వధువుకు చదివించారు. సరసమ్మ రెండు రవికల గుడ్డలు ఇచ్చారు.

అభయ ధామపు పిల్లలంతా తుంగమ్మా లలితల ఆధ్వర్యంలో కనకలక్ష్మికి వీడ్కోలు చెప్పారు.

పెళ్ళయిన పిల్ల భర్త ఇల్లు జేరింది.

పెళ్ళికి సరసమ్మతో వెళ్ళిన జలజ చెప్పిన స్వారస్యమయిన కబుర్లు విని పిల్లలంతా హాయిగా నవ్వుకున్నారు.

సంతోషంగా ఉన్న తుంగమ్మకు ఆ రాత్రి చాలా సేపటిదాకా నిద్రరాలేదు. అలసిపోయిన సరసమ్మ, జలజ త్వరగా నిద్రపోయారు.

అరుగుమీద పడుతున్న వెలుగులో కూర్చుని తుంగమ్మ తండ్రికి ఉత్తరం రాసింది.

అన్ని విషయాలనూ వివరంగా రసవత్తరంగా రాసుకుంటూ పోయింది తుంగమ్మ కలం. పేజీలు నిండిపోయాయి.

ఓ చోట్లో ఆమె ఇలా రాసింది- "ఇవ్వాళ కనకలక్ష్మి అనే అమ్మాయికి పెళ్ళయింది. నిర్భాగ్యురాలయిన ఓ పిల్ల ఇవ్వాళ భర్త

ఇంటికి వెళ్ళింది. వచ్చే నెల జీతం వచ్చాక ఆ అమ్మాయికి ఏదైనా బహుమతి కొని పంపుదామనుకొంటున్నా. పంపనా నాన్నా ?"

*　　　*　　　*

తండ్రి జవాబు రావటానికి ఆలస్యమయింది. దానిక్కారణం ఆయన తుమకూరు వదిలే హడావుడిలో ఉన్నాడు. బెళగాంకి వెళ్ళగానే రాశారు.

ఇప్పుడు తుంగమ్మ సంగతి ఆయనొక్కడే దాచుకొన్న రహస్యం కాదు- పెద్దకూతురికీ చెప్పారా సంగతి. అల్లుడిక్కూడా. చిన్నతమ్ముడు కొంత ఊహించాడు అతనికి తెలిసింది—ఏదో జరగరానిది జరిగిందని. అల్లుడు కాస్త చీదరించుకున్నాడు. కానీ ఎవరూ తుంగమ్మని నిందించలేదు. హీనంగా మాట్లాడలేదు. వాళ్ళ మనసులో తుంగమ్మమీదున్న ప్రేమ వాత్సల్యాలు మిగతావాటి నన్నిటినీ తుడిచి వేశాయి. ఇంత సులువుగా ఇలా జరగటాని క్కారణం తుంగమ్మ అప్పుడున్న పరిస్థితి కావచ్చు.

దగ్గర కూర్చుని తల నిమురుతూ మాట్లాడుతున్నట్టుగానే అవన్నీ రాశా రాయన.

"....నాకు తెలుసమ్మా! ఇంకెవరయినా అయితే ఏం జరిగేదో. ఏదో జరగరానిది జరిగిపోయింది. ఇక ఆ సంగతి ఆలోచించనే వద్దు. తుమకూరితో మన ఋణం తీరిపోయినట్టే. బాబును ఇక్కడే హైస్కూల్లో జాయిన్ చేస్తాను. నీ సంగతి తెలిసి చాలా సంతోషమైంది. శ్రీమతి సరసమ్మగారిని ఎంత పొగిడినా చాలదు. ఆమె మన పాలిట దైవం. ఆమెను దొడ్డమ్మగానే భావించి అడకువతో నడుచుకో."

తుంగమ్మ ఆ ఉత్తరాన్ని ఎన్నోసార్లు చదివింది

"మా నాన్న ఉత్తరం రాశారు, చూడండి దొడ్డమ్మా!" అని ఉత్తరాన్ని దొడ్డమ్మకు చూపించింది.

తలవంచుకుని ఏదో చూస్తున్న సరసమ్మ, కనుబొమలు పైకెత్తి, అద్దాల్లోంచి తుంగమ్మను చూసి, మళ్ళీ తలెత్తి నిటారుగా కూర్చుంటూ అన్నారు-

"నీ ఉత్తరం నేనెందుకమ్మా చదవటం?"

నవ్వులాటకి అన్న ఆమెకు నవ్వులాటగానే జవాబు చెప్పింది తుంగమ్మ.

"ఓ, ఇదివరకు చదవనట్టు, కొత్తగా అంటారేం?"

"ఆ రోజులు వేరు. ఈ రోజులు వేరు."

"తెలుసుగానీ, చదవండి దొడ్డమ్మా! ఊఁ....ఊఁ...."

తుంగమ్మను మంచంమీద కూర్చోమని చెప్పి సరసమ్మ ఉత్తరం చదివారు. ఆమె తండ్రినుండి ఆమె ఎపుడూ అలాటి ఉత్తరాన్ని అందుకోలేదు. బాల్యంలో ఎవరూ ఆమెకు అంత ప్రేమతో ఉత్తరం రాసుండలేదు. రిటైర్డ్ ఉపాధ్యాయుని చేతివ్రాత. అక్షరాలన్నీ ఒకేలా ఉన్నాయి. కానీ అందంగా లేవు. కానీ అందమంతా రాసిన విషయంలో ఉంది.

ఆ ఉత్తరాన్ని చదువుతున్న సరసమ్మ హృదయం చలించి, కళ్ళలో నీరు తిరిగి, అక్షరాలు కనిపించకుండా పోయాయి కళ్ళద్దాల మీద ఎవరో నీరు చిలకరించినట్టుగా అయింది.

చదవటం పూర్తిచేశాక ఆమె మాట్లాడలేదు. మాతృవాత్సల్యంతో తుంగమ్మవేపు చూసి నవ్వారు.

తుంగమ్మకూడా ఉత్తరం ఎలా ఉందని అడుగలేదు. అది తన విలువైన సంపద అన్నట్టు మడచి మృదువుగా చేతితో పట్టుకుని లేచింది.

అవ్వాళ మధ్యాహ్నం సరసమ్మగారికి కార్యదర్శినినుండి అర్జంటుగా పిలుపొచ్చింది.

"వీలయినంత తొందరగా రావాలట" అన్నాడు కబురుతెచ్చిన మనిషి.

ఏదో విశేషముంటుంది అనుకున్నారు సరసమ్మ. తుంగమ్మతో కూడా అలాగే చెప్పారు.

త్వరగా భోజనం ముగించి, అభయధామపు బాధ్యతను తుంగమ్మకు అప్పచెప్పి, బయటికి వెళ్ళారామె.

....ఆమె తిరిగి వచ్చేసరికి సాయంకాలం నాలుగ్గంటలయింది.

సంగీతపాఠం జరుగుతూంది. తలుపుతీసి, వేళాక సరసమ్మతోబాటు తుంగమ్మా ఆఫీసుగదిలో కొచ్చింది.

"ఓ సంగతి చెబుతాను. రహస్యంగా ఉంచాలి తుంగా!"

"అలాగే దొడ్డమ్మా!"

"జలజ, లలిత–ఎవరికీ చెప్పకూడదు."

ఆర్ద్రమైన కంఠం.... స్నేహితులతో కూడా చెప్పకూడదనిది! తనవల్ల సాధ్యమా ఇది?....కాని దొడ్డమ్మ అడుగుతున్నారు. అలా చెయ్యాలంటే....

"అలాగే దొడ్డమ్మా!"

"ఓ గర్భిణీ అమ్మాయి ఇవ్వాళ రాత్రి ఇక్కడికొస్తుంది. ఆమె ఎవరు, ఏమిటన్నది ఎవ్వరికీ తెలియకూడదు. ఆమెను పలకరించి ఇబ్బంది పెట్టకూడదు."

తుంగమ్మ గుండె వేగంగా కొట్టుకుంది–ఓ క్షణం.

"ఊఁ...."

"పెద్దింటిపిల్ల. ఏదో జరిగింది. ఇంతవరకూ ఎక్కడో ఉంచి, ఇవ్వాళ ఇక్కడికి తీసుకొస్తున్నారు."

"ఏ వూరు?"

ఆ ప్రశ్న అడగటం సరికాదేమో అనిపించింది తుంగమ్మకు. కాని, నిజానికి సరసమ్మగారికే ఆ సంగతి తెలియదు.

"నాకూ తెలియదమ్మా! వాళ్ళు చెప్పలేదు. నేనూ అడుగలేదు."

"గది ఖాళీ చేయించనా?"

"ఆహా! తంబురా, తబలా ఇంకా ఏవో సామాన్లున్నాయి, అన్నీ తీయించేయి. ఇక్కడ పెట్టించు."

"అలాగే దొడ్డమ్మా! పురుడు ఇక్కడేనా?"

"అంతేమరి. ఆస్పత్రికి వెళ్ళేమాటే లేదుకదా!"

"పడక...."

"తరువాత చూద్దాం. బహుశా వాళ్ళే తెచ్చుకుంటారనుకుంటా."

తుంగమ్మ కుతూహలం అధికమయింది. తనలాగే దురదృష్ట

వంతురాలైన, కానీ-శ్రీమంతురాలైన, ఆ పిల్లని చూడాలని ఆత్ర పడసాగింది.

గది ఖాళీ చేస్తూండగా జలజ అడిగింది—

"ఎందుకక్కా?"

"ఇంకోసారి పాయసం. అంతే!"

"ఉండటానికి వస్తున్నారా, లేక...."

"ఏమిటో తెలియదు మరి."

తుంగమ్మమాట నిజమని నమ్మటానికి జలజ మనసు ఒప్పుకో లేదు. తుంగమ్మ తననుండి ఏదైనా దాస్తుందని అనుకోవటానికీ సిద్ధంగా లేదామె.

"నాకు తెలుసక్కా! చెప్పనా?" జలజకు సూక్ష్మంగా గ్రహించే నేర్పుంది. తుంగమ్మ ఆశ్చర్యంతో—

"ఏమిటి?" అంది.

"గది పూర్తిగా ఖాళీ చేస్తున్నారు. తుంగక్కకూ చెయ్యని హడావిడి. అంటే శ్రీమంతులన్నమాట. బాగా ధనవంతులయ్యుం డొచ్చు. ఇక్కడెన్ని రోజులుంటుంది అన్న సంగతి- చూశాక చెబు తాను. వాళ్ళ డబ్బూ, హోదా ఎంతుందో చూద్దాం...."

"ఊరుకో జలజా, ఏమిటది?"

"పోక్కా, నీకేం తెలియదు" అని వూరుకుంది జలజ.

తుంగమ్మ మనసులో కలవరంతోనే కాలం గడిపింది.

చీకటిపడ్డాక, రావల్సినవారికోసం సరసమ్మకూడా ఎదురుచూడ సాగారు.

ఎనిమిదింటికి దెయ్యంలాంటి పెద్దకారు అభయ ధామం ఎదుట నిలిచింది. మొదట కార్యదర్శిని దిగారు.

"జాగ్రత్త! నెమ్మదిగా దిగండి" అంటూ గర్భిణీగా ఉన్న అమ్మాయిని చెయ్యి పట్టుకుని దిగటానికి సాయం చేశారు.

ఆమె వెనుక వయస్సుమళ్ళిన స్త్రీ ఒకరు, ఎదుటి సీటులో నుండి రంగు రంగుల బుష్‌కోటు తొడుక్కున్న ఎత్తుగా ఉన్న యువ కుడూ దిగారు. అందరూ లోపలికి వచ్చారు. డ్రైవర్ కొత్త పడక

చుట్టా, పెద్ద సూట్‌కేసూ మోసుకువచ్చాడు. ఆ స్త్రీ ఆ పిల్ల తల్లని తెలుస్తూనే ఉంది. ఆ యువకుడు ఆమె అన్నయ్య. ఆ అమ్మాయిది తాకితే కందిపోతుందేమో అన్నట్టుగా వున్న గులాబిరంగు ఒళ్లు. పూల పాన్పుమీదే పెరిగినట్టున్న సుకుమారమైన దేహం.

వాళ్ళంతా ఏదో రహస్యమయిన పనిని చేస్తున్నట్టుగా తొందర పడుతున్నారు.

ఆ పిల్లను, తల్లి, అన్నయ్యలతో ఆ గదిలో వదిలిపెట్టి కార్య దర్శిని అఫీసుగదిలోకి వచ్చారు,

"పేరు ఏం రాసుకుందాం?" అన్నారు సరసమ్మ.

"ఏదో ఒకటి రాసుకోండి బాబూ! ఇదో గొడవ. సంఘసేవ పేరుతో అభయ ధామాన్నొక అద్దెకొంప చేసేస్తున్నారు."

వచ్చినవారితో ఎంతో వినయంగా వర్తిస్తున్న సెక్రటరీ వాళ్ళ వెనుక విసుక్కుంటూ చెమట తుడుచుకున్నారు.

సరసమ్మకూ ఇవన్నీ తెలుసు. కాని ఇలాటివారి అవసరాలకి ఒప్పుకోక చెయ్యగలిగిందీ లేదు. సంఘంలో పేరు ప్రతిష్ఠలున్నవారి సాయంతోనే నిలబడింది అభయ ధామం. ఎక్కడైనా కాస్త అగౌరవం జరిగెనా, నిర్వాహక సమితి అస్తిత్వానికే గొడ్డలిపెట్టు.

ఆ యువకుడు వచ్చి అడిగాడు—

"ఇక వెళ్ళొచ్చునా అనడుగుతున్నారు, మమ్మీ!"

....గదిలో తల్లి ఒడిలో మొహందాచుకు ఏడ్చిందా అమ్మాయి.

"మమ్మీ ... మమ్మీ ...."

"ఏడవకు తల్లీ ....వీలయినంత తొందరగా ఇంటికి వచ్చేద్దు గానీ—"

"భయంగా ఉంది మమ్మీ ...."

"ఇక్కడున్నవారికి చెబుతాను. నీ కేలోటులేకుండా చూస్తారు."

ఆ పిల్ల కళ్ళు తుడుచుకుంది.

డ్రైవర్, సెక్రటరి, ఆ యువకుడూ బయటికి వెళ్ళగానే ఆ పిల్ల తల్లి సరసమ్మగారి దగ్గరకొచ్చారు.

"ఏం కావాలండి?"

ఆమె తన హ్యాండ్‌బాగ్‌లోనుండి వంద రూపాయల నోటు తీసి, సరసమ్మగారికి ఇవ్వటాని కొచ్చారు.

"అభయ ధామానికి విరాళమా? సెక్రటరీగారిచేతికే ఇవ్వండి."

"కాదు....ఇది మీకు!"

సరసమ్మ "ఇది ఆస్పత్రి కాదండి. మే మెవరం ఎప్పుడూ ఏమీ తీసుకోం" అన్నారు.

"అది కాదండి. నా బహుమతిగా మీరు...."

"అభయ ధామానికి కానుక ఆఖర్లో తీసుకుంటాం. సెక్రటరీ గారు అంతా చెప్పారు. మీ అమ్మాయిని గురించి బెంగపెట్టుకోకండి. బాగా చూసుకుంటాం."

విధిలేక మళ్ళీ నోటును బ్యాగ్‌లో పడేసుకున్నా రామె. కారు వెళ్ళిపోయింది.

పిల్ల లెవరూ గదివేపు వెళ్లలేదు. ఆ అమ్మాయి తలుపు ముందుకు జేరవేసింది.

కాసేపటికి సరసమ్మ పేరు రాసుకునే పుస్తకంతో గదిలోకి ప్రవేశించారు. ఆ అమ్మాయి శూన్యమనస్కురాలయి, పక్కమీద కూర్చుని తను తెచ్చుకున్న విసనకర్రతో విసురుకుంటూ కూర్చుంది.

సెక్రటరీగారి పొరపాటువల్ల, అభయ ధామపు ముఖ్యురా లెవరో ఆ పిల్లకు తెలియలేదు. కనుకనే కంగారుగా ఆవిడవేపు చూస్తూ—

"వార్డెన్‌గారిని పిలుస్తారా కాస్త?"

"ఇక్కడ వార్డెన్ అంటూ ఎవరూ లేరు. మేట్రన్ అంటూ వున్నారు."

"నాకు తెలియదు. ఎక్కడున్నా రామె?"

"నేనే...."

"ఓ! సో సారీ! నమస్తే!"

ఎంతోకాలంగా సంపాదించిన అనుభవంవల్ల రక్తగతమైన మృదుత్వంతో సానునయంగా సరసమ్మ అన్నారు-

"నమస్తే. కొత్తవారు ఎవరైనా వచ్చినప్పుడు వాళ్ల పేరు రాసుకోటం పద్ధతి. మీ పేరేం రాసుకోను?"

ఆ అమ్మాయి తడబడింది.

"మమ్మీ అన్నారూ...."

"మీరు చెప్పితీరాలని కాదు. కాని ఇక్కడ ఏదైనా ఓ పేరు రాసుకుంటాను. ప్రభావతి అని రాసుకోనా?"

"ఊఁ.. .ప్రభ అని రాసుకోండి."

"అలాగే ప్రభా....నేనుండేది పక్కగదిలోనే ఏమైనా కావాలంటే వచ్చి అడగండి. నీళ్లగది చూపించనా? ఇంకేమైనా కావాలా?"

"వద్దండి."

"త్రాగటానికి నీళ్లు పంపిస్తాను."

"పంపండి."

ప్రభ లేచింది. బయటికివస్తూ సరసమ్మ అన్నారు.

"ఇప్పుడు ఉక్క మరీ ఎక్కువగా ఉంది. ఇంకో నాలుగు రోజుల్లో వర్షాలొస్తాయి. తరువాత చల్లగా ఉంటుంది."

.... .... .... ....

ప్రభ అభయ ధామానికి వచ్చిన వారం రోజుల్లోనే జోరుగా వర్షం మొదలయింది. బయట పడుకోలేక పిల్లలంతా హాల్లోకి చేరారు.

ఓరోజు రాత్రి అలాటి వర్షం వచ్చాక, ఉదయం జలజ తుంగమ్మను లేపి, కిటికీలోనుండి బయటికి చూపించింది.

"చూశావా అక్కా, అవాళ చెప్పలేదూ నేను? సముద్రంలా లేదూ?"

అవునని తుంగమ్మ తలవూపింది. చుట్టూ ఉన్న పొలాలన్నీ చాలాదూరంవరకూ నీళ్లు ఆక్రమించుకుని ఉన్నాయి. అభయ ధామం నాల్గువేపులనుండీ కప్పల బెక బెకలు వినిపిస్తున్నాయి.

"నువ్వు చిన్నప్పుడు వానాకాలంలో ఏం చేసేదానివి తుంగక్కా?"

"తలమీద చెయ్యి పెట్టుకుని, పరికిణీ కుచ్చిళ్లు ఎత్తిపట్టుకుని

ఎగిరేదాన్ని. కాగితపు పడవచేసి రోడ్డుపక్కన ఉన్న కాలవలో పడేసి దాంతోబాటు పరిగెత్తేదాన్ని.''

''నేనూ అలాగే చెయ్యాలని ఉబలాటపడేదాన్ని. కాని నేనున్న ఆ పెద్దింటివారు 'జలుబు చేస్తుంది, జ్వరం వస్తుంది' అని బయటకు రానిచ్చేవారు కారు.''

''వాళ్లు వదిలాక?''

''అప్పుడిక ఆడాలన్న ధ్యాసే పోయింది.''

ప్రకృతిని చూసి తన్మయురాలైన జలజ మనసు గతాన్ని గురించి చింతించసాగింది.

ఆ జ్ఞాపకాలతో జలజ బాధపడటానికి అవకాశం ఇవ్వకుండానే తుంగ అంది-

''రా, వెడదాం. ప్రభని లేపుదాం.''

''అక్కర్లేదులే. ఇష్టం వచ్చినప్పుడు లేవనీ.''

''లేదు జలజా! ఇప్పుడా గర్వం అదీ ఏం లేదు. రా.''

స్నేహితురాళ్ళిద్దరూ ప్రభ గదివేపు నడిచారు.

.... .... .... .... ....

ప్రభ తను వచ్చిన మరుసటిరోజు ఉదయం లేవగానే కొత్త వాతావరణంలో ఇముడలేక అవస్థపడసాగింది.

తుంగమ్మ గదిముందు వెడుతూండగా చూసి పిలిచింది-

''ఏ పిల్లా....ఇలారా ''

బాగానే ఉందే అనుకుంటూ తుంగమ్మ వినయంగా వెళ్ళి నుంచుంది.

''ఏం కావాలండి?''

''నీ పేరేమిటి?''

''తుంగ అంటారు.''

''నన్ను కాస్త నీళ్ళగదికి తీసుకెడతావా?''

''రాత్రి చూడలేమా?''

''చూశాను. కాని త్రోవ మర్చిపోయాను. ఒక్కర్తినీ వెళ్ళలేను. మొహం కడుక్కోవాలి.''

"సరే, పదండి."

ప్రభ సూట్‌కేస్ తెరచి, బ్రష్‌మీద పేస్ట్ వేసుకుంది. సబ్బు పెట్టె, టవల్, తుంగమ్మ చేతికిచ్చింది.

"కాస్త పట్టుకో."

తుంగమ్మ కాదనలేదు.

కాని వాళ్ళిద్దరూ నడచి వెడుతూండగా సరసమ్మ చూశారు. పిల్లలూ చూశారు. కొంతమంది నవ్వారు.

ప్రభకి ఇదేం అర్థం కాలేదు.

ఇంకోసారి ఇలాటిది జరక్కూడదన్న ఉద్దేశంతో కాఫీ అయ్యాక సరసమ్మ ప్రభ దగ్గర కెళ్లారు.

"కాఫీతో మీరేం తీసుకొంటారు ప్రభా?"

"బ్రెడ్-బటర్. బిస్కెట్స్ ఉన్నాయి."

"సరే, ఇంకేమన్నా కావాలంటే నా అసిస్టెంట్ ఉన్నారు. ఆవిడ నడగండి."

"అలాగే. కాని వారెవరో తెలియదే."

"తుంగమ్మా, ఇలా రండి" అని పిలిచారు సరసమ్మ. ఈ బహువచన సంబోధనకు కారణాన్ని తుంగమ్మ సులభంగానే గ్రహించింది. వచ్చి నుంచుంది.

ఓ క్షణం నోట మాట రాలేదు ప్రభకి.

"ఈమే నా అసిస్టెంట్."

"నాకు తెలియక మీతో మొరటుగా ప్రవర్తించాను. దయచేసి క్షమించండి. ఐ అమ్ రియల్లీ సారీ!"

"మనమంతా ఒకటే ప్రభాదేవీ! ఇక్కడ ఒకర్ని ఒకరం నీచంగా చూచుకోనే చూచుకోం."

ప్రభను ప్రభాదేవిగా చేసి తెలివిగా, వినయంగా తుంగమ్మ బదులు చెప్పటం చూసి సరసమ్మ సంతోషించారు.

అది ఆమె అభయ ధామంలో నేర్చుకున్న మొదటి పాఠం. ప్రభా మారింది. నిజమే. కాని అభయ ధామపు పిల్లల్లో ఒకతి కాలేక పోయింది. పాయసపు భోజనానికి ముందు 'పిల్లల్లారా' అని సంబో

ధించి ఉపన్యాసం ఇవ్వలేదు. ప్రభ అందరి పిల్లలతోబాటు భోజనానికి కూర్చోలేదు. తన గదిలోనే భోజనం చేసింది. అందరి దృష్టిలోనూ అతిథి మాత్రమే అయింది. మంచి నెయ్యి, ఊరగాయ, ఇంకా కావాల్సినవన్నీ బయటినుంచి వచ్చాయామెకు. చాకలి వారానికోసారి గుడ్డ లుతికి తెస్తున్నాడు.

ఒకర్ని ప్రత్యేకంగా చూడటం సరసమ్మ కిష్టం లేకపోయినా, సమితిలోని ముఖ్యులమాటను ఎదిరించలేక పోయారు.

ఊళ్లోని పెద్ద డాక్టరు రెండురోజుల కోసారి వచ్చి ప్రభని చూసి వెడుతున్నారు.

కుల వ్యత్యాసంవల్ల ప్రభ దూరంగా ఉండటం లేదు. అలాటి తేడాలు అక్కడ క్షణికమే.

కాని ప్రభ వర్గవ్యత్యాసంవల్ల వేరయింది. ఆమె పుట్టి పెరిగిన వాతావరణం, చదువూ, సంస్కారం-అన్నీ ఈ పిల్లల్నుండి పూర్తిగా భిన్నమయినవే.

మొదట ఏకాంతాన్నే కోరుకుంది ప్రభ. కాని క్రమేపి అదీ విసుగనిపించి ఒక రిద్దరు పిల్లలతో చనువుగా ఉండసాగింది.

.... .... .... ....

వాన వచ్చి వెలిసిన ఆ ఉదయం తుంగమ్మ—జలజ వచ్చి ప్రభ గది తలుపులు తట్టారు. గడియ వెయ్యలేదు కనుక, తలుపు తెరుచుకుంది. ప్రభకూడా కిటికీలోనుండి బయట కనిపిస్తున్న జలసాగరాన్ని చూస్తూ నిల్చుంది.

"చూట్టానికి బాగుంది కదండి?" అంది తుంగమ్మ.

"అవును."

వర్షాన్నిగురించి మాట్లాడుకోవటంలో ఇబ్బందేం లేదు. కానీ వేరే రకమయిన మాట వచ్చినప్పుడు....

ఓసారి ప్రభ అడిగింది.

"మీరేం చదువుకున్నారు తుంగమ్మా?"

"ఎక్కువ చదువుకో లేదండి. హైస్కూల్ చదువుకూడా పూర్తవలా."

"మీరు గ్రాడ్యుయేట్ అనుకున్నా."

"లేదండి. ఇంగ్లీషు మాట్లాడలేను నేను."

"మేట్రన్ ఎంతవరకూ చదువుకున్నారు?"

ఆ ప్రభ ఒక్కసారికూడా 'దొడ్డమ్మ' అనలేదు. ఆమెవరకూ సరసమ్మ మేట్రన్ మాత్రమే. ఆ ప్రశ్న వెనుక ఉన్న ప్రవృత్తి నచ్చ లేదు తుంగమ్మకు. అందుకే అబద్ధాలు చెప్పింది.

"దొడ్డమ్మ ఎం. ఎ. బి. టి. అనుకుంటా. నాకూ సరిగ్గా తెలియదు "

"ఐ. సీ."

"మీ రెంతవరకూ చదువుకున్నారు మిస్ ప్రభా?"

"ఈ సంవత్సరం బి. ఎస్సి. డిగ్రీ పరీక్ష రాయాల్సింది. కుదర లేదు."

ఇంకోసారి మరో మాట వచ్చింది.

"తుంగమ్మా, మీ రిక్కడ ఎలా చేరారు ఉద్యోగానికి?"

"మూడు నెలల క్రిందట ఓ రాత్రి మీలాగే నేనూ వచ్చాను మిస్ ప్రభా!"

ఆమాట ప్రభమీద ప్రభావం చూపించక పోలేదు.

"ఓ! తరువాత వెనక్కి వెళ్ళనే లేదా?"

"లేదు."

తుంగమ్మ కార్లో రాలేదు. రాళ్ళూ, రప్పలూ, తొక్కుకుంటూ ప్రయాసతో వచ్చి, తలుపు తట్టి కళ్ళు తిరిగి పడిపోయింది. ఈ వివ రాలు చెప్పలేదు తుంగమ్మ. అక్కర్లే దనుకుంది. మిగతా పిల్లల గురించి కూడా ఏమీ చెప్పలేదు.

* * *

ఎవరితోనూ కలవకుండా ప్రభ విడిగా ఉండి బాధ పడుతూం దని సరసమ్మ ఇదయేవారు. కాని ఎక్కువ రోజులు అలా విచారిం చాల్సిన అవసరం లేకపోయింది.

ప్రభకు నెలలు నిండాయి. నొప్పులు రాసాగాయి. వాళ్ళ ఊరి

నుండి ఆమె అన్నయ్య వచ్చాడు. ప్రత్యేకంగా ఒక లేడీ డాక్టరు వచ్చారు.

కానుపు సులువుగానే అయింది. మగపిల్లాడు. బొద్దుగా, ముద్దుగా ఉన్నాడు.

కాసేపటికి తేరుకున్న ప్రభ బాబువేపు చూసి ఒక్కసారి చిరునవ్వు నవ్వినా, వెంటనే వెక్కివెక్కి ఏడవసాగింది-తన కలా జరిగినందుకు.

'చిత్రమయిన పిల్ల' అనుకుంది తుంగమ్మ.

కొద్దిరోజుల్లోనే లేచి తిరగసాగింది ప్రభ. వెనుక వచ్చిన కారు మళ్ళీ వచ్చి ఆమెను తీసికెళ్ళిపోయింది. ఇక్కడే ఉండిపోయాడు పిల్లాడు.

బిడ్డను పోగొట్టుకుని అక్కడే ఉన్న ఓ తల్లి, ఆ పిల్లాడిని ఎత్తుకుని పాలివ్వటానికి ప్రయత్నించింది.

మరునటిరోజు అనాథాశ్రమంవారు టాక్సీలో వచ్చి పిల్లాడిని తీసికెళ్ళిపోయారు. బిడ్డను పెంచటానికి డబ్బు దొరికింది వారికి.

అభయ ధామం మొహమైనా చూడని ఒక వ్యక్తి-ప్రభ తండ్రి-అభయ ధామం అభివృద్ధికోసం ఐదువేల రూపాయలకి చెక్కు పంపించారు.

ఈ సంగతి సెక్రటరీ గారినుండి తెలుసుకున్న సరసమ్మ తుంగమ్మతో చెప్పారు.

"చూశావా తుంగా, ఇదీ ప్రపంచం!"

"అవును దొడ్డమ్మా!"

"ఈ డబ్బు మనకు ఎంతో అవసరం. గవర్నమెంటు ఇచ్చే కొత్త గ్రాంటుతోనే అభయ ధామపు ఖర్చులన్నీ వెళ్ళవు."

ఎటాని, ప్రభ...."

"ఇప్పుడు చెబుతాను విను. కుర్రాళ్ళతో తిరగటం సరదా అట ఆమెకి. ఏమీ కాకుండా జాగ్రత్తలు తీసుకొనేదట. అయినా ఇలా జరిగింది. ఫలానా అతనే అని చెప్పేధైర్యం కూడా లేకపోయిందట.

ఇక ఈ పిల్లాడికి అనాథాశ్రమమే గతి. తల్లి లేదు. తండ్రి లేడు. ఇక ఆ పిల్ల చూశావా? కొంచెమైనా పశ్చాత్తాపం ఉందా పిల్లలో."

ఆ మాటా నిజమే.

ప్రభ తనలాగా మోసపోలేదన్నమాట!

"డబ్బున్నవాళ్ళ పిల్లలంతా ఇలాగే ఉంటారా దొడ్డమ్మా?"

"ఛ! ఛ! లేదమ్మా. ఎక్కడో కొంతమంది ఇలా ఉంటారంతే. వీళ్ళ ప్రతికే తీరు అలాంటిది. ఇంతకు ముందు సులోచన అన్న అమ్మాయి ఉండేది కదా ధనవంతు లమ్మాయి........కాని ఇక్కడున్నంతకాలం ఎలా ఉండేదని!....అందరితో అన్యోన్యంగా కలిసి మెలిసి ఉండేది. ఇవ్వాళ ప్రభ వెళ్ళిపోతే మన పిల్లలకు చీమ కుట్టినట్టు కూడా లేదు కదా! సులోచన వెళ్ళినప్పుడలా కాదు. ఆమే అంతే. తన కొడుకును వదిలి పెట్టటానికి ఒప్పుకోనే లేదు. కాని, పరువు ప్రతిష్ఠల ప్రశ్న—బలవంతంగా తీసికెళ్ళారు."

"అవును దొడ్డమ్మా? మనుషులన్నాక మంచివారూ ఉంటారు, చెడ్డవారూ ఉంటారు."

"నిజమే. కాని చెడ్డవాళ్లు మంచివాళ్లు కావటానికి ప్రయత్నించాలి. మంచివాళ్లు చెడ్డవాళ్లు కాకుండా చూసుకోవాలి. కదూ....?"

"అవును. నిజమే."

రాత్రి పడుకోబోయేముందు తుంగమ్మ ప్రభ వచ్చి వెళ్ళిన విషయాలను తండ్రికి రాసిన ఉత్తరంలో వివరించింది. రాశాక అంతా చదివింది. మనసుకు తృప్తి కలుగలేదు. దీన్ని తండ్రి కెందుకు రాయాలనిపించింది. ఉత్తరం చించి ముక్కలు చేసింది. ఉదయం నీళ్ళ గదిలో పొయ్యిలో వేద్దామని ముక్కలన్నీ చేర్చి చాపక్రింద పెట్టింది.

మనసుకు విసుగు కలిగించే ఆలోచనలను దూరం చెయ్యటానికి ప్రయత్నిస్తూ, దుప్పటీ కప్పుకుని తుంగమ్మ నిద్రాదేవిని ఆహ్వానించింది. ఒకటి, రెండు, మూడు, అంటూ వంద దాకా లెక్కపెడదామనుకుంది. అరవయిదాకా లెక్కపెట్టేసరికి నిద్ర వచ్చేసింది.

* * *

ఆ ఆదివారం సరసమ్మ అభయధామంలో లేరు. జలజ-సావిత్రులతో సరుకులు తేవటానికి బజారుకు వెళ్ళారు. తుంగమ్మ ఒక్కతే కిటికీనుండి బయటికి చూస్తూ కూర్చుంది.

ఆకాశం శుభ్రంగా లేదు. నల్లటి మబ్బులు కమ్ముకున్నాయి. వాటిని చెదరిపోయేలా చేసే గాలికూడా లేదు. వర్షం వచ్చే సూచనలు.

'ఇవ్వాళ వీళ్ళంతా తడిసి వస్తారేమో!' అనుకుంది తుంగమ్మ.

దూరంగా ఎవరో అభయధామం వేపు వస్తున్నట్టు కనిపించింది. దగ్గరవుతున్నకొద్దీ మనిషిలా కనిపించాడు.

'మహాబలుడు!' తుంగమ్మ ఆశ్చర్యంతో అనుకుంది. లోపలే కూర్చుని విసుగ్గా ఉన్న ఆమెకు బయటనుండి మాట్లాట్టానికి ఓ వ్యక్తి రావటం ఆనందాన్నే ఇచ్చింది. వస్తున్నతను మరెవరో కాదు- ఇంటి అల్లుడు! తుంగమ్మ గబగబా లేచి తలుపు తీసింది.

అతనూ వేగంగా నడుస్తూ తలుపు దగ్గర కొచ్చాడు.

అయ్యో! ఏమిటీ ఈ అవతారం? చింపిరి జుట్టు....మాసిన గుడ్డలు....వివర్ణమైన మొహం.... 'కనక ఎలా ఉంది?' అని అడుగబోయిన తుంగమ్మ తెరచిన నోరు అలాగే ఉండిపోయింది.

అతడు వణుకుతున్న గొంతుతో గట్టిగానే అన్నాడు-

"నా పెళ్ళాం ఇక్కడికొచ్చిందా?"

ఆ ప్రశ్నతో తుంగమ్మ తెల్లబోయింది.

"లోపలికి రండి" అంది యాంత్రికంగా.

అతడిని లోపలికి రానిచ్చి, ఎప్పటిలా తలుపుకు తాళం వేసింది తుంగమ్మ.

"కనకలక్ష్మి ఇక్కడికొచ్చిం దేంటండి?"

"లేదే?"

"తమాషా కాదు. నిజం చెప్పండి."

"లేదండీ బాబూ!"

"అయ్యో దేవుడా, నాకేం గతిరా బాబోయ్!" అంటూ మహాబలుడు బెంచీమీద కూలబడ్డాడు.

మగ గొంతు విని అమ్మాయిలు అటు వచ్చారు. మహాబలు డిని చూసి తలుపుదగ్గిరే గుమి గూడారు.

"అమ్మగారు ఏరి?"

"బయటికి వెళ్లారు."

"అయ్యో! భగవంతుడా, నా గతేంటండో?!"

లలిత ఒక్కత్తి గుంపులోంచి లోపలి కొచ్చింది.

"ఏమిటండి అది? ఏమిటీ గోల?"

"నా పెళ్లాం లేచిపోయింది బాబోయ్, లేచిపోయింది."

అమ్మాయిల్లో నలుగు రైదుగురు ఫక్కుమని నవ్వారు. మిగతా వాళ్ళ మొహాలు నల్లబడ్డాయి. కనకలక్ష్మి లేచి పోవటమంటే అభయ ధామానికే అవమానం....

లలిత గద్దిస్తున్నట్టుగా అడిగింది.

"తనే పారిపోయిందా? మీరు తరిమేశారా?"

"అయ్యో! ఓ గొలుసు చేయించాను. ఓ జత గాజులు. పట్టు చీరె....అన్నీ ఎత్తుకుని పోయిందిరా దేవుడోయ్!"

"చా లూరుకోండి."

లలిత గద్దింపు విని మహామహాబలుడు గొల్లుమన్నాడు. మధ్యలో ఏడుపు ఆపి-

"అయితే, ఇక్కడికి రానే లేదా?" అన్నాడు.

"లేదు. ఇక్కడికి రాలేదు."

"నాకేం గతిరా దేవుడోయ్!" మళ్ళీ ఏడుపు.

"ఆడవాళ్ళలాగా ఆ ఏడు పేమిటండీ?"

తన జాతిని కొంచెె పర్చాలన్న ఉద్దేశంతో కాకపోయినా వాడు కలో ఉన్నమాట లలిత నోటివెంట వచ్చేసింది. కాని అలాటి మాట లకు సిగ్గుపడే మనిషి కాదు మహాబలుడు.

"మీరు కనకాన్ని కొట్టి తిట్టి ఏమైనా చేశారా?"

"లేదమ్మో లేదు. దేవతలా చూసుకున్నాను."

అతడు అబద్ధాలు చెప్పటం లేదు. అతని మాటలు నిజమేనని అతని మొహమే చెబుతూంది. తుంగమ్మ, లలిత బాధపడ్డారు. కనక

తుంగమ్మ పెట్టవలసిన విందు భోజనం పెట్టడం జరిగినా ఎవరూ ఎక్కువగా సంతోషించలేదు.

ఆ సందర్భంలో సరసమ్మ మాట్లాడారు. కాని అది ఎప్పటి ఉపన్యాసం కాదు. మనసులోని బాధంతా మాటల రూపంలో, బహు ప్రయాసతో బయటికి వచ్చింది.

"పిల్లల్లారా....ఏం చెప్పాలో తెలియటం లేదు. కనకలక్ష్మి ఇలా చేస్తుందని ఎవరనుకున్నారు? మొత్తంమీద మనమందరం తలలు వంచుకోవాల్సిన పరిస్థితి వచ్చింది. మంచిగా భర్తతో కాపురం చేసుకోవాలన్న కోరిక మీ కెవరికీ లేదూ? ఇక వరుళ్ళని వెతకటం ఎంత కష్టమో తెలుసా?...."

తుంగమ్మను అభినందిస్తూ మాట్లాడాల్సిన సరసమ్మ కనకలక్ష్మి ప్రవర్తనవల్ల అభయ ధామపు పేరుకు సోకిన కళంకం గురించే మాట్లాడారు. మాట్లాడుతూ తమ పొరపాటు అర్థం చేసుకున్నారు.

"అసలు ఈ విందు భోజనం గురించి మాట్లాడాలి నేను. ఏదో చెప్పటానికి మరేదో చెబుతున్నాను. మన తుంగమ్మ—"

తుంగమ్మను గురించి పొగడ్తగా చెబుతూ, అంతమంది పిల్లల ముందు ఒక్క తుంగమ్మను పొగడటం సరికా దనిపించిం దామెకు.

"తుంగమ్మను పొగుడుతున్నానంటే మిమ్మల్నందర్నీ పొగుడుతున్నా నన్నమాటే. మనుషు లెవరూ ఉన్నట్టే ఉండిపోరు. మారుతూనే ఉంటారు. కొందరు మారి చెడ్డవాళ్ళవుతారు. కొందరు మారి మరీ మంచివాళ్ళవుతారు. మనం రోజురోజుకీ ఎక్కువ మంచితనాన్ని అలవర్చుకోవాలి కదూ!"

'అవును' అనలే దెవరూ. కానీ ఆ మౌనంలో వున్న అర్థం అదేనని అందరికీ తెలుసు.

విందు ముగిసింది. తుంగమ్మ అందరికన్నా దుఃఖంలో మునిగి పోయింది. టోపీ, మేజోళ్ళ కోసం వూలుకొని అవాళ కనకలక్ష్మికి పంపుదామనుకుంది తుంగమ్మ. కాని కనకలక్ష్మి....

....అవ్వాళ తన మొదటి జీతం తీసుకున్న రోజున తుంగమ్మ తండ్రికి ఉత్తరం రాయటానికి కూర్చుంది. కానీ, కలం కదల్లేదు.

కడుపు తరుక్కు పోతోంది. కనకలక్ష్మి సంగతంతా రాసి తన మనస్సులోని ఆవేదన వెళ్ళగ్రక్కాలనుకుంది. మరుక్షణమే 'అభయ ధామం అంటే ఇంతేనా?' అని అనుకోవచ్చు తండ్రి. 'ఊహుం. ఆ సంగతేం రాయకూడ'దని తీర్మానించుకుంది. లేని సంతోషం తెచ్చుకుని తండ్రికి మామూలు ఉత్తరం రాసింది.

ఆ వారంలోనే మహాబలుడు మరోసారి వచ్చాడు. ఆ కొద్ది వ్యవధిలోనే పదేళ్ళు పెద్దవాడయినట్టు కనిపించాడతడు. కళ్లు లోతుకుపోయాయి. సరసమ్మ-తుంగమ్మల ముందు జరిగిందంతా చెప్పాడు.

.... .... .... ....

కనకలక్ష్మి లేచిపోయిన మరుసటి రోజే మహాబలుడు సెలవు పెట్టాడు. కాలు నొప్పెడుతున్నా కుంటుతూనే పిచ్చివాడిలా వీధి వీధి తిరిగాడు. 'అక్కయ్య ఇల్లు' అన్నమాట అబద్ధమయినా ఆ తొందర్లో శేషాద్రిపురం అన్నమాటను నిజంగానే చెప్పిందేమోనన్న ఆశతో శేషాద్రిపురం వీధుల్లో సాయంత్రాలు వెతక సాగాడు.

ఇక కనిపించదని నిరాశతో వస్తూండగా పక్కసందులో గబగబా అడుగులు వేస్తూ పోతున్న ఆమె కనిపించింది. తలమీద కొంగు కప్పుకుంది. మహాబలుడు పరిగెత్తుకుని వెళ్ళి ఆమెను కలుసుకున్నాడు. ఆమె గొడవ చెయ్యలేదు (గొడవచేస్తే పోలీసు లొస్తారని, భర్తతో పంపిస్తారని ఆమెకు తెలుసు.)

వేడికోలు కంఠంతో మహాబలుడు—

"కనకం, ఎందుకే ఇట్టా జేశావ్? దా. ఇంటికి పోదాం."

"ఊఁ—హుం."

"నువ్వు చేసిందంతా మర్చిపోతా-భయపడమాక."

"భయమా!?"

"ఎందుకే నవ్వుతావ్? దా....ఓటెల్లో కాపీ తాగుదాం"

"మీ రెళ్ళిపొండి, నే రాను"

"ఎందుకూ?"

కనకలక్ష్మి బదులు చెప్పలేదు. ఆమెను అక్కడేవున్న పిల్లలు ఆడుకునే ప్రదేశంవేపు తీసికెడుతూ-

"అట్టా అనకే. ఇంటికి రాయే" అన్నాడు.

ఆమె ఒప్పుకోలేదు.

"ఎక్కడికెళతావ్? నేనూ వస్తా నీతో."

"వద్దు. మీరక్కడికి రాకూడదు."

"ఇట్టా సెయ్యాల్నా నువ్వు?"

కనకలక్ష్మి ఓ క్షణం ఊరుకుని. "మీరు మంచివారు. నేను తప్పు చేశాను. నన్ను క్షమించండి. వేరే పెళ్ళి చేసుకోండి"

మహాబలుడు నిస్సహాయుడయ్యాడు. నోట్లో మాట రాలేదు. కోగొట్టుకున్న కనక మళ్ళీ కనిపించింది. కాని అతనికి అందనంత దూరంగా ఉంది.

ఆఖరికి ఓ ఉపాయం కనిపించింది మహాబలుడికి.

"కనకం! దొడ్డమ్మ దగ్గరికెళతాం రా."

"ఎందుకూ?"

"ఆమె నిన్ను తీసుకు రమ్మన్నారు."

"వద్దు బాబూ, నాకు భయం."

"అలా అనొద్దా? దొడ్డమ్మ మంచోరు కదూ!" మహాబలుడు బుజ్జగించటానికి ప్రయత్నించాడు.

"ఇక చాలు. పోతున్నా."

ఆమె వెళ్ళిపోతుందని స్పష్టమయిందతనికి. నిరాశా ప్రవాహంలో కొట్టుకపోతున్నాడతడు బ్రతుకు, జీవితం, భవిష్యత్తు, అతని ముందు భీకరంగా నృత్యం చేశాయి. మహాబలుడు కనకలక్ష్మి వేపు చూశాడు, మెడలో గొలుసు లేదు. చేతులకి గాజులు లేవు. చీరె కూడా పేరేం.

"గొలుసూ గాజులూ ఏం జేశావ్?"

పెదాలు తడుపుకుంటూ. తడబడుతూ—

"ఎక్కడో పారేసుకున్నా" అందామె.

"అబద్ధాలు! అబద్ధాలు!"

అది అబద్ధమన్న విషయంలో ఎలాటి సందేహమూ లేదు మహాబలుడికి. తన ఇంటికి వచ్చాక ఆమె, అభయ ధామంలోలాగే,

ఉదయమే లేవటం, ఇల్లు అలికి ముగ్గులు పెట్టటం, నీళ్లు కాచి తనను లేపటం, రాత్రి ఆమె యౌవన దేహపు స్పర్శ సుఖం- అన్నిటిని ఆ క్షణంలో మహాబలుడు మర్చిపోయాడు. అతని కర్థమయిం దొకటే- ఆమె అబద్ధాలకోరు—దొంగ.

'చీరె ఏది?' అని అడిగే అవకాశమున్నా అభిమానంతో మహాబలుడు అడుగలేదు. కాని, ఆ చీరె కట్టుకుని మరో మగాడితో ఆమె గడుపుతుందన్న భావనతో అతని గుండెల్లో మంట రేగింది. తన బాధను తట్టుకుంటూ పళ్ళు కొరికాడు. 'ఛూ' అని ఉమ్మేసి—

"పో! వెళ్ళిపో! వెళ్ళిపో!" అని అరిచాడు.

ఆమె చప్పున అక్కడినుండి మాయమయి పోయింది. ఆమె వెనక వెళ్ళి కాళ్లు పట్టుకుని బ్రతిమాలుకోవా లనిపించిం దతనికి. కాని అడుగులు ముందుకు కదల్లేదు. అక్కడే కుప్ప కూలిపోయి బావురు మని ఏడ్చాడు.

.... .... .... ....

ఇది జరిగింది ఆ ముందురోజు. ఆనాడు ఈ సంగతి వివరిస్తు న్నప్పుడు అతడు శాంతంగానే ఉన్నాడు. ఆఖరికి అన్నాడు:

"కనకం వెళ్ళిపోయిందని కాదు. గొలుసు-గాజులు పారేసు కున్నానని అబద్ధాలు చెప్పింది."

కూతురు చేసిన తప్పిదానికి తల్లి బాధ్యురాలైనట్టుగా వుంది సరసమ్మ పరిస్థితి. అయినా ఓదార్పుగా ఆమె—

"పోనివ్వండి. కనకం ఇలా చేస్తుం దనుకోలేదు. మన దుర దృష్టం" అన్నారు.

కనకం తప్పు చేసిందని సరసమ్మ ఒప్పుకోవటం అతని కెంతో ఓదార్పు నిచ్చింది. తనమీద చూపిన జాలి హాయిగా ఉంది.

మహాబలుడికోసం కాఫీ తెప్పిద్దా మనుకున్నారు సరసమ్మ.

"కాఫీ తెప్పించనా?"

"వద్దమ్మా. వద్దు."

ఆ కాఫీ ప్రసంగం, కనకలక్ష్మి తెచ్చి ఇచ్చిన కాఫీని గుర్తు చేసి అతన్ని బాధ పెట్టింది.

మహాబలుడు లేచి బయల్దేరినపుడు సరసమ్మ అతన్ని పంపించ టానికి తలుపు దాకా వెళ్ళారు.

అక్కడ అతను గబుక్కున వంగి ఆమె పాదాలు పట్టు కున్నాడు.

"ఛ! ఛ! లేవండి...."

"అమ్మా, నేను నాశనమైపోయాను. నన్ను మీరే ఉద్ధరించాలి."

"నేనేం చెయ్యగలను?"

"అమ్మా, నా కింకో పిల్ల నిప్పించండి."

"ఆఁ!" ఆశ్చర్యంతో అవిశ తెరిచిన నోరు తెరిచినట్టే ఉండి పోయింది.

తుంగమ్మ స్థాణువై ఆశ్చర్యంతో నిలబడి పోయింది,

"లే, చెబుతాను" అన్నారు సరసమ్మ. బహువచన సంబోధన ఇంక అనవసర మనిపించింది.

అతడు లేచి నుంచున్నాడు. సరసమ్మ అతడితో రెండడుగులు ముందుకు వేశారు. అక్కడ నుంచుని నిదానంగా స్పష్టంగా చెప్పారు:

"నేను చెప్పేది విను మహాబలయ్యా! ఈ అభయ ధామపు పిల్లలు మంచివాళ్లు కాదు. వీళ్ళ ఆలోచన వదులుకుని మీ పల్లెకు వెళ్ళి మంచిపిల్లను తెచ్చుకుని పెళ్ళి చేసుకో."

నిరాశతో వెళ్ళిపోయాడు మహాబలయ్య.

"చూశారా అతడి ధైర్యం! ఇంకో పిల్ల కావాలిట!" అంది తుంగమ్మ నవ్వు దాచుకుంటూ.

మనసులో ముల్లు గుచ్చుకుంటున్నా, సరసమ్మకూడా నవ్వారు. నవ్వుతూ ఉండగానే ఆమె మొహం వాడి పోయింది.

'ఎందు కిలా జరిగింది? ఎందుకు? మహాబలుడు మంచివాడే కావచ్చు. కాని మహా మూర్ఖుడు. అదీకాక, కనకలక్ష్మి కూడా పరమ సాధ్వి కాదుగా. పాతస్నేహితుని ఆకర్షణకు బలై ఉంటుంది మళ్ళీ ఆ జీవితంలోకి ... ఎంత అన్యాయం! ఇన్ని రోజులూ అభయధామం ఆమె కిచ్చిన శిక్షణంతా వ్యర్థమేనా!

'—లేక అభయ ధామంలోని ఈ జీవితం ఏమీ నేర్పదా? దీని ప్రయోజన మింతేనా?'

సరసమ్మ మెదడు మొద్దుబారి నట్లనిపించింది. నిరాశా పూరిత మైన ఈ ఆలోచనలను తుంగమ్మకు కూడా చెప్పకుండా మనసులోనే దాచుకున్నారామె.

* * *

రోజులూ, నెలలూ గడిచిపోయాయి.

మంచు క్రమ్ముకున్న ఓ ప్రభాత కాలం.

రాత్రి పడుకున్నప్పుడు సరసమ్మ కిటికీ మూశారు. గాలి-వాన వల్ల వర్షపు నీరు లోపలికి రాకుండా వుండటంకోసం. గది తలుపులు తెరిచే ఉన్నాయి. ఉషఃకాలంలో మేలుకున్న ఆమెకు తలుపు వేపు నుండి చల్లటిగాలి వేస్తున్న అనుభవ మయింది. కప్పుకున్న కంబళీని మరింత దగ్గరికి లాక్కున్నారు. కాని నిద్ర పారిపోయింది. తెల్లవారిం దేమో అనిపించిం దామెకు. బాగా కళ్లు విప్పి బయటికి చూశారు. ఏమీ కనిపించలేదు. మళ్ళీ నిద్రపోవటానికి విఫల ప్రయత్నం చేశారు. లేచి కూర్చుని మంచం దిగి, లైటువేసి గడియారంవేపు చూశారు. ఐదు న్నర! కిటికీ తెరిచారు. ఏమీ కనిపించటంలేదు. బయట మసక వెలురు కూడా లేదే! ఇది ఆశ్చర్యమే! ఏదో తోచి, ఆమె దీపం ఆర్పి కిటికీదగ్గర నుంచున్నారు. ఆఁ-ఆమె ఊహ రైటే!

తప్పటడుగులతో వెలుగు భూమ్మీదికి దిగి వస్తూంది. పల్చటి వెండి చీరె కట్టుకుని మంచు తన శీతలమైన కౌగిలి నుండి ఎవరూ తప్పించుకోలేరన్నట్టు ఇళ్ళూ వాకిళ్ళనూ పూలనూ చెట్లనూ ముద్దెట్టు కుంటూంది.

ప్రకృతి రామణీయకంలో కరగి పోతున్నట్టుగా తన్మయు లయ్యారు-నిర్మలమైన మనస్సుతో సరసమ్మ. తామూ కరగి మంచులో లీనమవుతూన్న అనుభూతి చెందా రామె.

ఎంతసేపు అలాగే నుంచుండి పోయారో!

గంట కొట్టి పిల్లల్ని నిద్రలేపాలి. కాని ప్రపంచమే మైమరచి నిద్రపోతున్నప్పుడు ఈ పిల్లల్ని మాత్రం లేపటం న్యాయమా? అభయ

ధామపు కఠిన నియమాలు ఈ క్షణంలో కాస్త సడలిస్తేనేం?

సరసమ్మ బయటికి వచ్చి, తుంగమ్మ పడుకున్న చోటికి వెళ్ళి "తుంగా!" అని మెల్లిగా పిలిచారు. "లేచి రా" అని సైగ చేశారు. చీకటి వెలుగుల సంగమంగా ఉన్న తమ గదికి తీసుకొచ్చి కిటికీ దగ్గర నుంచున్నారు.

"చూడు, మంచు ఎలా క్రమ్ముకుంటూందో!"

"నిజమే! అబ్బా, ఎంత బాగుందో!"

"వర్షాకాలం అయిపోయింది. ఇక చలికాలం."

"అవును."

తెల్లవారుతూంది. అక్కడక్కడా చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. ప్రకృతి మేలుకుంటూంది.

తన్మయావస్థలో మాటలే కరువయ్యాయి.

ఆరయిందని తెలిసి సరసమ్మ నెమ్మదిగా-

"గంట కొడతావా తుంగా?" అన్నారు.

"ఊఁ...."

ఘంటానాదం తెరలు తెరలుగా ప్రాతఃకాలపు నిశ్శబ్దంలో దూరదూరానికి తేలిపోయింది.

పిల్లలొక్కొక్కరే లేవసాగారు.

"ఘన శ్యామసుందరా, శ్రీకరా........"

మధుర కంఠంతో పాడుతూంది పార్వతి- ఎవ్వరూ పాడమని బలవంత పెట్టకుండానే.

"ఆనందకందా...."

ప్రకృతిశోభకు మానవ నిర్మిత సౌందర్యలేపనం జరిగినట్టుంది వాతావరణం.

"ఇలాటి క్షణాల్లో ప్రపంచమంతా అందంగా వున్నట్టే అన్పిస్తుంది కదూ తుంగా?"

"అవును దొడ్డమ్మా! ఈ అందం ఇలాగే ఉండిపోనీ అని కూడా అనిపిస్తూంది."

ఆ తర్వాత సందడి.

రోజువారీ కాలకృత్యాలు. జీవిత చక్రం తిరగటం ప్రారంభించింది.

నవరాత్రి వెళ్ళిపోయింది. చిన్నచిన్న పండుగ లెన్నో గడిచిపోయాయి.

కాని అభయ ధామం ఎదురుచూసిన పెద్దపండుగ వేరు. అది అభయ ధామం వార్షికోత్సవం.

డిసెంబరు పంతొమ్మిదికి ఉత్సవకార్యాలు హడావిడిగా జరుగుతున్నాయి. లోపల గోడలకంతా పిల్లలు తామే వెల్లవేశారు. బయటి గోడలను డబ్బులిచ్చి తెల్లచేయించారు. కిటికీలు, తలుపులు శుభ్రం చేశారు. పూలచెట్లకు బోదులుచేసి చెత్తా, చెదారం ఏరి పారేశారు. సరసమ్మ ఇద్దరు పిల్లలతో, తుంగమ్మ, జలజ మరో పిల్లతో, లలిత, సావిత్రి ఇంకోపిల్లతో ఇలా మూడు గుంపులుగా, తయారుచేసిన జాబితాల ప్రకారం వూళ్ళోని పెద్ద దుకాణాలకు వెళ్ళి, అభయ ధామపు పిల్లలకోసం గుడ్డలు అడిగి తెచ్చారు. సమితికి చందా ఇవ్వని కొంతమంది శ్రీమంతుల ఇళ్లకు వెళ్ళి డబ్బు వసూలు చేసి తెచ్చారు. సరసమ్మ అభయ ధామపు సెక్రటరీగారితో వెళ్ళి, మేయరుగారిని అధ్యక్షత వహించవలసినదిగా కోరి, ఒప్పించి వచ్చారు. అభయ ధామంలోనే కొన్ని చిన్న చిన్న ఆటల పోటీలు జరిగాయి. కొంతమంది బహుమతులు గెలుచుకున్నారు.

ఉత్సవం రోజున ఉదయం పైన టాపున్న లారీలో, సుంద్రాతో సహా అందర్నీ కూర్చోబెట్టుకుని, సరసమ్మ వాళ్ళని వూళ్ళో నాలుగు వీథుల్లోను తిప్పుకొచ్చారు.

ఆహ్వాన పత్రికలు ముద్రించ లేదు. కాని వారికి సాయంచేసిన వారందరినీ నోటితోనే పిలవడం జరిగింది.

సాయంత్రం ఆరింటికి కొంతమంది వచ్చారు. సరసమ్మ ఆఫీసు గదిలోని టేబుల్, బెంచీ, కుర్చీ సావిట్లోకి స్థానభ్రంశం పొంది, పక్కపక్క ఇళ్ళల్లోనుండి తెచ్చిన కుర్చీలతోబాటు వచ్చిన వారిని ఆహ్వానించాయి.

పది నిముషాలు ఆలస్యంగా విచ్చేసిన మేయర్‌గారు అయిదు నిమిషాల్లోనే అభయ ధామ పరిస్థితులను పరిశీలించారు.

సరసమ్మగారివేపు తిరిగి మేయర్ అడిగారు:

"ప్రెస్‌వారు కనిపించటంలేదేం?"

"ప్రెస్‌వారా!"

"పత్రికలవాళ్ళండీ?"

"ఓ....మాకు మామూలుగా పిలిచే అలవాటు లేదు."

"అలా అనుకోకూడదు. పిలవాల్సింది. అభయ ధామం సంగతి పత్రికల్లో రావటం మీకెంతో మంచిది."

"నిజమే. తోచలేదు మాకు."

"ఫరవాలేదు. ఈ కార్యక్రమం గురించి నేను పత్రికల్లో పడేలా చూస్తాను."

"అలా చేస్తే చాలా ఉపకారం చేసిన వారవుతారు, మీరు."

సేకరించి తెచ్చిన చీరలను కట్టుకుని ముస్తాబయ్యారు పిల్లలు. గుడ్డి సుంద్రా, పార్వతి దేవతా ప్రార్థన చేశారు. సరసమ్మగారి స్థానే తుంగమ్మ స్వాగతోపన్యాసం చదివింది.

నిరాభరణ సుందరి. ఎడం భుజంమీదినుండి వెనుకభాగంలోకి వదిలిన కొంగుని నడుంవద్ద బిగించింది. ఎత్తుగా. ఠీవిగా ఉందామె. కంపనంలేని ఉచ్చస్వరంతో, స్పష్టమైన పదోచ్చారణతో స్వాగతోపన్యాసం చదివిందామె.

తమ వెనుకగా నిలబడ్డ సరసమ్మగారితో మేయర్—

"ఆమె ఎవరు?" అనడిగారు.

"నా అసిస్టెంట్. పేరు తుంగమ్మ."

"ఐ సీ!"

"మొదట అభయ ధామానికి అందరు పిల్లల్లాగానే వచ్చారామె."

"ఓ!"

మేయర్ ఆశ్చర్యం వ్యక్తపరచటంతో సంతోషం కలిగిందామెకు. కాస్త గర్వంగానే అధ్యక్షులకు ఇరుపేపులా కూర్చున్నవారి వేపు చూశారామె. తమవేపే చూస్తున్న ఆ యువకుడు.... రాము అన్న మాటల్ని అతను విన్నాడా? ఏమో మొహం అందంగా ఉంది. పెదవులమీద చిరునవ్వు. ఎవరితను? అతని పక్కనే సుందరమ్మ. ఆనంతరామయ్య కూర్చున్నారు. ఆమె నిర్వాహక సమితి ముఖ్య సభ్యురాలు. వాళ్ళతో వచ్చాడా? ఈ ఆలోచనతో తుంగమ్మ ఉపన్యాసాన్నే వినటం మానేశారామె. నిద్రలోంచి మేల్కొన్న వారిలా ఆమె తుంగమ్మ చదువుతున్నదాన్ని విననారంభించారు.

"ఈ సంవత్సరం మా సోదరి కనకలక్ష్మికి పెళ్ళి జరిగిందని తెలుపటానికి సంతోషిస్తున్నాం."

కూర్చున్న పిల్లల పెదవులు బిగుసుకున్నా కళ్లు నవ్వాయి. సరసమ్మ ఒక్క క్షణం ఊపిరి పీల్చటం మానేశారు. తరువాత కనకలక్ష్మికి ఏం జరిగిందన్న సంగతి అందులో వ్రాయలేదు. మేయర్ మరోసారి పక్కకు తిరిగారు. ఆయనకు కనకలక్ష్మి సంగతి తెలుసేమోనని భయపడ్డారామె. కాని ఆయన అడిగిన సంగతి వేరు.

"నివేదిక, స్వాగతోపన్యాసం రెండూ కలిపేశారన్నమాట. మంచిపని చేశారు."

'బ్రతికాను' అనుకున్నారు సరసమ్మ.

స్వాగతోపన్యాసం వినిపిస్తూనే ఉంది.

"చేస్తున్న ధన సాహాయ్యాన్ని ఎక్కువ చెయ్యాలని నిర్వాహక సమితివారు గవర్నమెంటుకు ఈ సంవత్సరంకూడా మనవి చేసుకున్నారు. మంత్రిగారు పరిశీలించ గలమని ఈ సంవత్సరం కూడా హామీ ఇచ్చారు...."

ఆ యువకుడు కిసుక్కున నవ్వాడు. తుంగమ్మ అరక్షణం చదవటం ఆపి కంగారుగా చుట్టూ చూసింది. మేయర్‌గారూ చిన్నగా నవ్వాడు. తాము వ్రాసినదాంట్లో ఏదో లోపం ఉందేమోనని సరసమ్మ ఆలోచించారు.... ఈ సంవత్సరకూడా హామీ ఇవ్వటం.... ఓ.... అదో

రకమయిన వ్యంగ్యం. తమకు తెలియకుండానే చేసిన తప్పు! ఎంత పొరబాటు జరిగింది!!

తరువాతి భాగాన్ని కాస్త తొందరగానే చదివి పూర్తిచేసింది తుంగమ్మ.

"పురపాలక సభవారు చేస్తున్న అల్ప సహాయాన్ని ఎక్కువ చెయ్యాలని కోరుకోవడం జరిగింది. ఈ రోజు మేయరుగారే మన వార్షికోత్సవానికి అధ్యక్షత వహించడం మన అదృష్టం. అందరికీ హృదయపూర్వక స్వాగతం...."

తుంగమ్మ ఉపన్యాసం పూర్తిచేసి చేతులు జోడించి నమస్కరించింది. ఆమె ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది.

చప్పట్లు మారుమోగాయి. తుంగమ్మ మొహం ఎర్రబడింది. ఆమె వచ్చి సరసమ్మ వెనక నిలబడింది.

ఆ తరువాత కార్యదర్శిని కమలమ్మ మాట్లాడారు.

ఆ తరువాత అధ్యక్షత వహించిన మేయర్ తమ పక్కనున్న యువకునితో "మీరు మాట్లాడతారా మిస్టర్ సోమశేఖర్!" అన్నారు.

"వద్దండీ. పిల్లల్ని హాయిగా కొట్టుకు మెందుకూ. పాపం!"

సుందరమ్మ నెమ్మదిగా "మాట్లాడరా సోమూ!" అన్నారు.

"వద్దక్కా!"

అక్క—అయితే ఆ యువకుడు సుందరమ్మ తమ్ముడయి ఉండాలి అనుకున్నారు సరసమ్మ.

బహుమతి ప్రదానం జరిగాక మేయర్‌గారు మాట్లాడారు.

తరువాత సరసమ్మగారిచే హృదయపూర్వక వందన సమర్పణ జరిగింది.

పార్వతి జనగణమన పాడించింది.

వచ్చిన వారికి వీడ్కోలు చెప్పటానికి సరసమ్మ, తుంగమ్మ, జలజ, లలిత, సావిత్రి గుమ్మం బయటికివచ్చి నుంచున్నారు. ఒక్కొక్కటిగా కార్లు బయలుదేరుతున్నాయి. ఆఖర్లో ఉన్న కార్లో ఎక్కేముందు యువకుడు సోమశేఖర్ సరసమ్మ నుంచున్నచోటికి వచ్చాడు.

"అమ్మా, ఈ అభయధామ కార్యకలాపాల పరిచయం లేని

వాడిని. అక్క బలవంతంగా తీసుకు వచ్చింది. ఇవాళ సాయంత్ర
నాకు కలిగిన అనుభవం అపూర్వం. ఈ ఏర్పాట్లకు—ముఖ్యంగా
శ్రమకు నా ధన్యవాదాలు."

అతని మొహం నిర్మలంగా వుంది. ఆ మాటలు విన్న స
సమ్మకు తమ శ్రమ సార్థక మయినట్లు అనిపించింది.

ఆ యువకుడు గబుక్కున తుంగమ్మ వేపు తిరిగాడు.

"మీ స్వాగతోపన్యాసం బాగుంది. ధన్యవాదాలు!"

తుంగమ్మ నోట మాట రాలేదు. మొహం మాత్రం చెవులదా
ఎర్రగా కందిపోయింది. ఇలా చెప్పి సోమశేఖర్ మిగతా అమ్మాయి
వేపొకసారి చూసి, తన అక్క కూర్చున్న కారువైపు గంభీరం
నడిచి వెళ్ళిపోయాడు.

సరసమ్మ ఆశ్చర్యంతో తుంగమ్మ వేపు చూశారు. ఆ
మొహంలో చిరునవ్వు వెలిగింది.

కారు బయలుదేరుతుండగా సరసమ్మ సుందరమ్మగారికి న
స్కరించారు. ఎడంచేతితో క్రాపు సర్దుకుంటూ, నవ్వుతూ అక్కతో
తనూ నమస్కరించాడు సోమశేఖర్.

అందరూ వెళ్ళిపోయాక కూడా సరసమ్మ ఆ పిల్లలతోబాటు
ఐదు నిమిషాలు అక్కడే నుంచున్నారు.

దీప దీపాలు వెలుగుతున్నాయి. దగ్గరున్న ఇళ్ళల్లోంచి మన
షులు కుతూహలంగా అభయధామంవేపు చూస్తున్నారు.

రాత్రి భోజనా లయ్యాయి. వార్షికోత్సవపు విందు భోజనం.

భోజనానికి కూర్చున్నప్పుడు సరసమ్మ ప్రక్కనే కూర్చుంది
తుంగమ్మ. తుంగమ్మ ప్రక్కన జలజ.

తుంగమ్మ కంచంవేపు చూస్తూ సరసమ్మ అన్నారు-

"ఎలా అయ్యిందో చూడు నీ కంచం. ఇంకోటి కొనాలమ్మా!"

"కొందాం లెండి."

"ఏమిటి అంటున్నారు దొడ్డమ్మా?" వంగి అడిగింది జలజ.

"తుంగమ్మ కంచం మరీ పాతదయిందిగా—అందుకన్నాను."

"కానీ దొడ్డమ్మా, మాప్పటం కుదరదే। అదే కంచమో చూశారా కాస్త?"

"ఏమిటే నువ్వంటున్నది?"

"అదే దొడ్డమ్మా, అదృష్టపు కంచం గురించి"

ఆ కంచం గురించి పిల్లలు సరదాగా చెప్పుకునే కథలు గుర్తొచ్చి నవ్వారామె.

"అదేమిటే జలజా, అందరూ కలిసి తుంగని పంపేద్దామను కుంటున్నారా యేం?"

"మే మెందుకు పంపుతాం దొడ్డమ్మా? కానీ రాజకుమారుడు వచ్చినప్పుడు, మనం వద్దంటే ఊరుకుంటాడా ఏం?"

అంతలో ఓ పిల్ల జిలేబీ వడ్డిస్తూ వచ్చింది. తుంగమ్మ "జలజా, నీ నోరు తెరు. జిలేబీ కూరుతాను. అలాగైనా నోరు మూసుకుంటా వేమో చూదాం."

కానీ తుంగమ్మ మొహం జిలేబీకన్నా ఎర్రగా అయిపోయింది. ఆత్మీయంగా తుంగమ్మ మొహాన్నే తదేకంగా చూస్తూ జలజ అంది:

"నీ మొహమే జిలేబీలా వుంది కదక్కా! నువ్వేం గొడవ చెయ్యనంటే దాన్నే తినాలనుంది నాకు."

"చాల్లే ఇక ఆపు" అన్నారు నరసమ్మ. "పిచ్చిమాటలు. ఎంత సేపూ...."

అలా అనేసి మౌనం వహించారు నరసమ్మ. కానీ అవ్యక్తమయిన భయం ఆమెను ఊపివేసింది. 'నేను ఒంటరివాన్ని అవుతానా' అన్న భావన తలెత్తింది. 'సరే...ఏదో మాటకు ఏదో ఆలోచన' అను కుని తమను తామే సమాధానపరచుకుని నిశ్చింతగా భోజనం చేశారు.

.... .... .... ....

దీపం ఆర్పి పిల్లలందరూ పడుకున్నాక జలజ చేయి చాపి తుంగమ్మ చేతివేళ్ళతో ఆడుకుంటూ "అక్కా! ఆయన ఎంత బాగు న్నారో కదా చూట్టానికి!" అంది.

ఎవరని తెలిసినా-తుంగమ్మ అడిగింది-

"ఎవరే?"

"వాళ్లే. తెలియనట్టు! ఇంకెవరు?—రాజకుమారుడు. వచ్చి నిన్ను మెచ్చుకుని ఏదేదో వాగిడారే. ఆయన."

"చాలూరుకో."

"రాజకుమారుడు—"

"నోరు మూస్తావా, లేదా?"

"పార్వతికి చెబుతాను. రేపు 'మేరే దిల్ టూట్ గయా' అని పాడుతుంది."

"అలా చేశావంటే చూడు, చెబుతాను నీ పని."

జలజ నవ్వి ఊరుకుంది. కాని తుంగమ్మ మనసు ఊరుకో లేదు. చాలాసేపు నిద్రపట్టలేదామెకు.

* * *

పుష్టిగా ఉండే లలితకు జబ్బు చేస్తుందని ఎవరూ అనుకోలేదు. విషజ్వరంతో పడ కేసింది లలిత. ఏడవ రోజు రూపాయి ఫీజు తీసుకునే డాక్టర్ వచ్చి చూశాడు.

సామాన్లగదిలో జ్వరంతో ఉన్న లలితను పడుకోబెట్టారు. ఆ గదిలోంచి సరసమ్మగారితో బయటికి వచ్చిన డాక్టరు రహస్యంగా చెప్పారు.

"ఇది టైఫాయిడ్. ఆలస్యం చేయడం మంచిదికాదు. ఇక్కడెలాగూ సరైన ట్రీట్‌మెంట్ జరగదు. ఆస్పత్రిలో చేర్పించండి."

అలా చెప్పి ఎప్పటిలా ఫీజు తీసుకోకుండానే వెళ్ళిపోయాడు డాక్టరు. సరసమ్మ ఆలస్యం చేయలేదు. కార్యదర్శిని ఇంటికి వెళ్ళి వచ్చారు. విక్టోరియా ఆస్పత్రికి వెళ్ళి జనరల్ వార్డులో ఓ బెడ్ సంపాయించారు. కానీ సమయానికి అంబులెన్స్ దొరకలేదు. జ్వర తీవ్రతలో ఏదేదో కలవరిస్తున్న లలితను జట్కాబండిలో ఆస్పత్రికి తీసి కెళ్ళారు. సరసమ్మ, తుంగమ్మ, జలజ ముగ్గురూ వెళ్ళారు ఆస్పత్రి దాకా. అభయ ధామపు పేషెంటు కదూ? బాగా డబ్బు ఖర్చుపెట్టే వారికే బెడ్ దొరకటం కష్టం. అలాటిది ఈ పిల్లకు బెడ్ మొత్తం మీద దొరికింది. మంచంమీదా, క్రింద నేలమీదా రోగులు పడుకున్న

ఇరుగ్గా ఉన్న ఓ వార్డులో పది మంచాల మధ్యలో ఓ మంచం దొరికింది లలితకు.

అక్కడ ఒక్కొక్క రోగిప్రక్కనా ఆ రోగి ఇంటివారుకూడా నివసిస్తున్నట్టుంది.

"దొడ్డమ్మా! ఎంత గొడవ ఇక్కడ! లలితను కాస్త బాగుండే స్థలంలో పడుకోబెట్టటం కుదరదా?"

"ఎలాగమ్మా? స్పెషల్ వార్డుకయితే చాలా డబ్బు కావాలి?"

తుంగమ్మ నిరుత్తరురాలయింది. తమ దగ్గర డబ్బు లేదు. తాము బీదవారు.

"దొడ్డమ్మా! ఏమీ అనుకోకపోతే, నా జీతం...."

సరసమ్మ కంఠం గద్గదమయింది. "అలా కాదు తుంగా! ఇలా ఓసారి చేశామంటే, ప్రతిసారీ చెయ్యాల్సి ఉంటుంది."

'తప్పేమిటి?' అనాలనిపించింది తుంగమ్మకు. కానీ దొడ్డమ్మ మాటకు ఎదురు చెప్పాలని లేక వూరుకుంది.

"ఇక్కడున్నా ఫరవాలేదు కదూ దొడ్డమ్మా?"

"ఇంతమంది లేరూ? భగవంతుడి దయవల్ల మన లలితకు తొందరగానే నయమవుతుంది. మంచి ఆరోగ్యం తనది. తొందరగా నయమవుతుంది."

లలితను పడుకోబెట్టి బయట అరుగుమీద నుంచుని బజారులోని జనం సందడివైపు చూస్తున్న జలజ "రాత్రి కెవరయినా ఇక్కడుండాలా దొడ్డమ్మా?" అంది.

"డాక్టర్ని అడిగి చూసాను. చూద్దాం.... ఇంతకు మునుపు రెండుమార్లు ఎవరూ ఉండక్కర్లేదన్నారు."

"వాళ్ళలాగే అంటారు. కాని మనం...." బెంగగా అంది జలజ.

అక్కడెవరూ వుండక్కర్లేదనే అన్నారు డాక్టర్.

"ఇక్కడ స్టాఫ్ వున్న దెందుకు? నర్సులున్న దెందుకు? మేమంతా వున్నదెందుకూ? ఏమీ తెలియని వారిలా మాట్లాడతారేమమ్మా?"

డాక్టరు దొడ్డమ్మతో అలా మాట్లాడ్డం విని తుంగమ్మ, జల నొచ్చుకున్నారు.

"లేదు డాక్టర్, ఎవరైనా ఇక్కడుంటామని మేమే అన్నాం."

"ఓ" అన్నారు వయసు మళ్ళిన డాక్టరమ్మ. "పేషెంట్ మీ స్నేహితురాలా?"

"అవును."

"భయపడకండి. మీ స్నేహితురాలిని మేము బాగా చూసుకుంటాం."

ఆ కంఠంలో ఉన్న అభయం వాళ్ళకెంతో నెమ్మది కలిగించింది.... తరువాత ముగ్గురూ అభయ ధామానికి తిరిగి వెళ్ళారు.

మరుసటి రోజు ఉదయం జల ఆస్పత్రికి వెళ్ళివచ్చింది. సాయంత్రం తుంగమ్మ.

ఆ మరునటి రోజు ఉదయం సరసమ్మ వెళ్ళారు. సాయంత్రం తుంగమ్మ.

ఆమె ఆస్పత్రికి వెళ్ళేసరికి ఐదుంబావయింది. లోపలికి వదలటానికి ఇంకా పావుగంట వ్యవధి వుంది. మెట్ల దగ్గర తలుపు వేసి వార్డు బోయ్ నుంచున్నాడు. తుంగమ్మ వెనుకగా స్తంభాన్ని ఆనుకుని నుంచుంది.

పూలు సూటు వేసుకుని ఎత్తుగా, ఎర్రగా వున్న ఆ యువకుని కళ్ళు ఎవరికోసమో వెతుకుతున్నాయి. పరధ్యానంగా చూస్తున్న తుంగమ్మ దృష్టి ముందుకు వెళ్ళినవళ్ళా చప్పున వెనక్కి మళ్ళింది. అతడిని మర్చిపోలేదామె. కాని అతను ఇక్కడ ... ఈ ఆస్పత్రిలో ఏం చేస్తూంటాడు? ఇతని తరపు వాళ్ళెవరైనా ఇక్కడున్నారా? ఈ వార్డులో ఎలా వుంటారు ధనవంతులు?

అక్కడున్న అందరిలోనూ వెతుకుతున్నాడతడు—ఎవరికోసమో? తనకోసం కాదు కదా! ఛ! ఏమిటీ ఆలోచన? ఆ యువకుడెక్కడ! అభయధామపు దీన యువతైన తానెక్కడ?

లోపలికి వదిలే గంట కొట్టారు. మెట్లమీదినుంచి వెళ్ళేవారిని చూస్తున్నాడతను. అతనికి కనపడక పోవటమే మంచిదనుకుంది

తుంగమ్మ. కాస్త లావుగా వున్న ఒకామె పక్కగా నడుస్తూ మెట్లు ఎక్కసాగింది. అప్పుడు వినిపించింది.

"ఏమండోయ్... ఆగండి!"

ఉపన్యాసం బాగుంది అన్న కంఠమే అది! కానీ పేరుపెట్టి పిలవలేదు. తనను కాదనుకొని వెళ్ళిపోవచ్చు.

తుంగమ్మ అక్కడే గోడ కానుకుని నుంచుని తిరిగి చూసింది. అతని మొహం నవ్వుతో వెలిగి పోతోంది. తుంగమ్మ సన్నగా నవ్వింది.

ఏం చెయ్యాలో తోచక నిలబడి పోయిన తుంగమ్మ సమస్య పరిష్కరించేలా అతనూ మెట్లెక్కాడు. ఇద్దరూ నడవసాగారు.

"నేను సోమశేఖర్‌ని. గుర్తున్నానా?"

మౌనంగా, సిగ్గుతో ఎర్రబడిన మొహాన్ని వంచుకుని తుంగమ్మ "ఊఁ" అంది.

"మిమ్మల్నే వెతుక్కుంటూ వచ్చాను. మిమ్మల్ని గుర్తుపట్టలో లేనో నని భయపడ్డాను. ఆ రోజు ఇంకో చీరె కట్టుకున్నారు కదూ! కానీ మీరే చీరె కట్టుకున్నా ఒక్కలానే కనిపిస్తారు...."

మాటకారి....తనను ఎందుకు వెతుక్కుంటూ వచ్చినట్టు!!

మేడ ఎక్కాక వరండాలో నుంచున్నారు ఇద్దరూ.

"నే నెందుకు మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చానో అడగలేదేం?

"అవును. ఎందుకూ?"

"అబ్బ, ఇప్పటికయినా అడిగారు కదా! నిన్న మీ సెక్రటరీ గారింటికి మా అక్కయ్య వెళ్ళినప్పుడు ఏవో మాటల్లో అభయ ధామప్రమ్మాయికి టైఫాయిడ్, ఆస్పత్రిలో ఉందని అన్నారట. అక్కయ్య ఇంటి కొచ్చి ఆ మాట చెప్పినప్పుడు ఆ అమ్మాయి పేరేమిటని అడిగాను. తనకు గుర్తులేదు. 'తుంగమ్మా?' అనడిగాను. 'అవు'నంది తరువాత 'అయ్యుండొచ్చు' అంది. సరె, చూద్దామని ఇవ్వాళ అభయ ధామానికి వెళ్ళాను. అక్కడేం జరిగిందో తెలుసా?" అని నవ్వసాగా డతను.

"ఏం జరిగింది?"

"మీ అసిస్టెంటుగా రేరీ?" అనడిగాను సరసమ్మగారిని. ఆస్పత్రిలో ఉన్నా రన్నారు. ఇప్పు డెలా వుందామెకి అన్నా."

"ఓ.... !"

"ఎందుకూ అన్నారు. అదే....తుంగమ్మగారికి జ్వరం.... అన్నా. ఆమె కేమయిందని ఆశ్చర్యపడ్డాను. తరువాత సంగతి తెలిసిందనుకోండి."

మొత్తంమీద తమాషా జరిగింది. కాని అతను తనను వెతుక్కుంటూ రావటం నిజమన్నమాట. కాదని తను అనుకున్నది అబద్ధమయింది.

అతని సరళమయిన ప్రవర్తనతో ఆమె సంకోచం మెల్లిగా సడలసాగింది. తనను చూశాడు ఇక వెళ్ళిపోతాదేమో! లలితను చూడ్డానికి రాకూడదూ?....తుంగమ్మ వార్డువేపు చూపింది.

ఇది గమనించి అత నన్నాడు-"ండి. లోపలికి వెడదాం."

లలితకు జ్వరం ఇంకా తగ్గలేదు. మేలుకునే ఉందామె. మంచం దగ్గర నుంచున్న తుంగమ్మ చేతిని పట్టుకుని మూలుగుతోంది. ప్రక్కన నుంచున్న మనిషిని గమనించేటంత స్పృహ లేదామెకు.

సోమశేఖర్ వార్డునంతా కలయ చూశాడు. చాలా ఏళ్ళుగా అతను ఆస్పత్రిలో జనరల్ వార్డులను చూడలేదు. ఆ రోగులూ-వాళ్ళను చూడ్డాని కొచ్చిన మనుషులూ! ఒకటి రెండు మంచాల దగ్గిరయితే పదిమందికి పైగా చుట్టుముట్టారు.

ఆ గొడవలో అభయ ధామపు రోగి- తుంగమ్మ స్నేహితురాలికి నయం కావాలి!

"ఇక్కడే ఉండండి. ఇప్పుడే వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు సోమశేఖర్. లలిత వెళ్ళినతనివేపే చూస్తూంది. కాని అత డెవరని అడగలేదు. తుంగమ్మ తనకు తానయి చెప్పనూ లేదు.

నిమిషాలు మెల్లిగా ముందుకు జరిగాయి.

కాస్సేపట్లో సోమశేఖర్, ఓ లేడీ డాక్టర్ని, ఓ డాక్టర్ని తీసుకుని వచ్చాడు.

దగ్గరగా వస్తూ లేడీ డాక్టర్ అడిగారు-

"ఏది మీ పేషెంట్, మిస్టర్ సోమశేఖర్?"

అలా అడిగినప్పుడు ఆమె పెదవుల మీద కొంచెం నవ్వొకటి తొంగి చూసినట్టు అనిపించింది తుంగమ్మకు. ఎందుకో ఆమె కది నచ్చలేదు.

సోమశేఖర్ లలిత వేపు చూపించాడు. మగ డాక్టర్ వేపు తిరిగి- "అది కాదోయ్! ఇలాంటి ఇరుకు చోటులోనూ రోగులకు నయమవుతుందా నాగరాజ్?" అన్నాడు.

"అవన్నీ అడక్కు. రేపు ఎలక్షన్లలో నిలబడి గెల్చి, శాసన సభకు వెళ్ళి, ఆస్పత్రికి కొత్త భవనాలు కావాలి. ఎక్కువ బెడ్స్ కావాలి- అని గొడవ చెయ్యి. ఇప్పుడు...."

అతన్ని ఆపి లేడీ డాక్టర్ అన్నారు-

"చూడండి, ఆ ఆఖరి పేషెంటు రేపు డిస్చార్జ్ అవుతుంది."

ఆఖరి బెడ్డు అది కాస్త బాగుంది కిటికీ దగ్గర. కాస్త గాలీ, వెలుతురూ ఉన్న చోటు.

"అయితే, రేపు ఈమెని అక్కడకన్నా మార్పిస్తారా? ప్లీజ్..."

డాక్టర్ నాగరాజు అన్నారు-

"అలాగే, నువ్వడిగాక ఆ మాత్రంకూడా చెయ్యకపోతే ఎలాగయ్యా!"

వచ్చిన డాక్టర్లిద్దరూ లలిత తలవేపు మంచానికి తగిలించిన 'ఛార్ట్' పరిశీలించారు. ఒక్కొక్కరు ఒక్కోలా తుంగమ్మ వేపు చూశారు.

లేడీ డాక్టర్ అదే నవ్వుతో అంది: "మీరేం బెంగ పెట్టుకోకండి మిస్టర్ సోమశేఖర్! మీ పేషెంటుని మేం బాగా చూసుకుంటాం."

"ఆ మాత్రం సహాయం చెయ్యండి బాబూ!"

మగ్గురూ వెనుదిరిగారు. డాక్టర్లిద్దరినీ వార్డు బయట వదిలిపెట్టి సోమశేఖర్ ఒక్కడే లోపలి కొచ్చాడు.

ఇదంతా కల కాదు కదా అనుకుంది తుంగమ్మ.

సోమశేఖర్ అన్నాడు: "రేపు ఆ ఆఖరి బెడ్డుకు మారుస్తారు. అక్కడ కాస్త బాగుంది."

తుంగమ్మ కళ్ళల్లో కృతజ్ఞత వెల్లివిరిసింది. కానీ పెదవి మెదపలేదు.

"టైఫాయిడ్ ఇప్పుడు పెద్ద జబ్బేమీ కాదు. ట్రీట్‌మెంటు బాగుండా లంతే."

"అవును."

గంటకొట్టగానే వాళ్ళిద్దరూ వార్డునుండి బయటి కొచ్చారు.

"స్పెషల్ వార్డులో ఉంచాల్సింది."

"వీలు పడలేదు."

"ఇక్కడ పరవాలేదు లెండి. ఇక ఆ డాక్టరు కూడా బాగా చూసుకుంటాడు."

"ఆయన మీ స్నేహితులా?" తుంగమ్మ నోరు విప్పింది అప్పటికి.

"నాగరాజా? అవును."

"ఆ లేడీ డాక్టరు?"

సోమశేఖర్ తుంగమ్మ మొహంలోకి చూశాడు. కానీ అక్కడేం కనిపించలేదు. ఆ చూపుల వెనుక ఏదైనా?....

"మా నాగరాజు స్నేహితురాలు."

ఆ జవాబుతో తృప్తి పడ్డట్టుగా వూరుకుంది తుంగమ్మ.

"నేనూ మెడిసన్ వెలగబెట్టాను లెండి, కొద్దిరోజులు."

"ఓ.....!"

"ఈ పాటికి నేనూ ఈ నాగరాజులా ఇక్కడ హౌస్ సర్జన్‌గా ఉండాల్సిన వాడిని. కాని ఏదో అంటారే—ప్రాప్తం లేదని."

తుంగమ్మ సోమశేఖర్‌ని డాక్టర్‌గా ఊహించుకుంది. జబ్బులన్నీ మాయంచేసే మంచి డాక్టరు. సదా అతని మొహాన్ని వెలిగించే మోహకమయిన నవ్వొక్కటి చాలు- రోగుల్ని ప్రసన్నంగా ఉంచటానికి.

"మెడికల్ కాలేజీ వదిలేశారా?"

"అవునండి. ప్రీ-మెడికల్‌లో పాసయ్యాను. ఫస్ట్ ఇయర్ అయ్యేసరికి విసుగెత్తిపోయింది నాకు-శవాలను కోసి. కోసీ."

ప్రీ మెడికల్ అంటే ఏమిటో తుంగమ్మకు తెలియదు. అలాగని అడిగి తన అజ్ఞానాన్ని ప్రదర్శించటాని కామె సిద్ధంగా లేదు. కానీ శవాలనుకోసే సంగతి విని ఆమె ఒళ్ళు జలదరించింది.

"ఆ తరువాత కాలేజీ మానేశారా?" విషాదపు ఛాయ కనిపించింది ప్రశ్నలో.

"ఊఁ... ఆ తరువాత సులువుగా బి.ఏ. పాసయ్యాను. ప్లీడరవటం మంచిదనిపించింది. పూనాకు వెళ్ళి ఎల్.ఎల్.బి. కట్టాను. అలాగే ఎం.ఏ. పూర్తి చేశాను"

అయితే సోమశేఖర్ ప్లీడరన్నమాట—నల్లకోటు తొడుక్కుని కోర్టులో వాదించే చిత్రం.... తుమకూర్లో ఏదో సినిమాలో చూసినట్లు.

ఆస్పత్రి పెద్ద గేటువద్ద సోమశేఖర్ అడిగాడు-

"మీరు బస్సులో వెడతారా?"

"ఊఁ....మీరు?"

ఆ చిన్నకారు అక్కడెక్కడయినా ఉందేమోనని చూసింది తుంగమ్మ. కనిపించలేదు.

"సైకిల్ ఉంది. వచ్చేస్తా నుండండి."

తన కొత్త సైకిల్ తోసుకుంటూ వచ్చాడు సోమశేఖర్. అప్పుడు తుంగమ్మ మనసులో ఏముందో ఊహించటం అతనికి కష్టమేం కాలేదు.

"ఆ కీలుగుర్రం కారు మా బావగారిది. అందులో వెళ్ళేకన్నా నడిచి వెళ్ళటం నయం."

కారులాంటి విలువగల వస్తువులను గురించి సోమశేఖర్ తేలిగ్గా మాట్లాడ్డం తుంగమ్మకు సంతోషాన్ని కలిగించింది.

'నమస్తే' చెప్పి ఆమె బస్సులో కూర్చుంది.

బస్సు పరుగెడుతుంటే 'ఝుంయ్' మని వీస్తున్న చల్లటిగాలి తుంగమ్మ మొహానికి తగుల్తోంది. ఆహ్లాదకరంగా ఉంది.

హృదయ వనంలో కోయిల 'కుహూ' అంటుంది.

'ఛ' అని తనని తానే నిందించుకుంది తుంగమ్మ.

ఆ నారాయణమూర్తి .ఇంత అనుభవం కలిగాక కూడా ఇంకా మగవాడి కర్తవ్యాన్నే మరలుగొంటున్నాడే...ఛూ! ..ఛూ!...

కానీ సోమశేఖర్ మంచివాడు. ఆ మొహంలో కపటం లేదు.

అయితేనేం? తను అతనిగురించి ఆలోచించటం తప్పు.

బస్సు దిగి అభయ ధామాన్ని సమీపించింది. తలుపు కొడుతూ తుంగమ్మ అనుకొంది- 'ఈ లలితకు జబ్బు చెయ్యకుండా వుండాల్సింది. ఛ! ఇక ఈ పాడు ఆలోచనలు!'

తను అభయ ధామానికి వెళ్లొచ్చానని కడూ అతను చెబుతా! అయితే సరసమ్మ అడక్కముందే తను చెప్పేయాలి....

"దొడ్డమ్మా. ఇవ్వాళ ఇక్కడికెవరో వచ్చారటగా? ఆస్పత్రి క్కూడా వచ్చారు——" ఎవరో తనకు పరిచయంలేని వ్యక్తిలాగా అంది.

"ఎవరూ? సోమశేఖర్ కదూ? సుందరమ్మగారి తమ్ముడు."

"అవుననుకుంటా. ఆయనే."

"ఏమన్నారు?"

"వార్డులో ఆఖర్న కిటికీదగ్గర బెడ్ ఇప్పించారు లలితకు. రేపు మారుస్తారు."

"మంచివారు పాపం!"

ఆ రాత్రి త్వరగా నిద్ర పట్టలేదు తుంగమ్మకు.

దొడ్డమ్మ అలా పొగడాల్సింది కాదతడిని.

కళ్లముందే కనిపిస్తోం దతని నవ్వు.

హఠాత్తుగా తుంగమ్మకు భయం వేసింది. ఏమిటి, తన ఆలోచనలు ఇలా సాగుతున్నాయి!

తుంగమ్మ అనుకుంది- రేపు ఏమైనాసరే ఆస్పత్రికి వెళ్లకూడదని.

ఉదయం లేవగానే సరసమ్మ కాసేపు పక్కమీద కూర్చునే ఆలోచించారు. రాత్రి చాలాసేపు ఆలోచించారు గాని. సమస్య పరిష్కారం కాలేదు.

ఉదయం మళ్ళీ అదే ఆలోచన.

సుందరమ్మ నిర్వాహక సమితి సభ్యురాలు. బాల విహారం ఆలోచనకు ఆమె ప్రోత్సాహం చాలా వుంది. వారిది మామూలు మధ్య తరగతి కుటుంబం. పెద్దగా ఆస్తిపాస్తులేం లేవు. కానీ, పేరుమోసిన ఇంజనీరుగా ఆమె భర్త బాగా సంపాయిస్తున్నారు. విధవ అయిన ఆవిడ తల్లి కూతురి దగ్గరే ఉంటున్నారు. ఒక్కడే కొడుకు, సోమ శేఖర్. తండ్రి మిగిల్చిన కొద్దిపాటి ఆస్తినీ తన చదువుకు ఉపయో గించుకున్నాడు. అతడు పూనానుంచి వచ్చి ప్రాక్టీసు ప్రారంభించింది ఈ సంవత్సరమే.

ఇవన్నీ కార్యదర్శినిగా రింట్లో ఏదో సందర్భంలో ఆమె తెలుసుకున్న విషయాలు.

అతడేమైనా తుంగమ్మను ప్రేమిస్తున్నాడా? చదువుకున్న ఈ కాలపు అమ్మాయిలు, శ్రీమంతులు, అతని కులంవారు ఎంతో మంది దొరికేటప్పుడు అతను పనిగట్టుకుని తుంగమ్మని ఎంచుకు వరిస్తాడు?

లేదా దురుద్దేశంతో ఆమె వెంటపడుతున్నాడా? ఎలాటివాడో!

'ఇక్కడికి రావద్దని' నేరుగా సోమశేఖర్‌తో చెప్పలేదు. ముందు సుందరమ్మతో చెప్పాలి. ఎందుకూ అని అడిగితే బాగుం డదు. ఎలా?

ఉభయ సంకటం వచ్చి పడింపనుకున్నారు. అలా కాకుండా నిజంగానే సోమశేఖర్ తుంగమ్మని ప్రేమిస్తూ ఉంటే? అది ఇంకో సమస్య. దాన్నిగురించి ఆలోచించటానికి సరసమ్మ ఇష్టపడలేదు. తుంగమ్మ పెళ్ళి చేసుకొని తమను, అభయ ధామాన్ని వదిలిపెడుతుం దన్న విషయాన్ని ఆలోచించటానిక్కూడా ఇష్టపడలేదు ఆమె.

ఆమె లేచారు. కానీ మొహం ముడుచుకునే ఉంది.

ఆ తరువాత సరిగ్గా తుడవలేదని పిల్లల్ని కోప్పడ్డారు.

తుంగమ్మా, జలజా, మిగతా కొంతమంది పిల్లలూ సరసమ్మ అలా ఉండటం చూసి నొచ్చుకున్నారు. ఎవరం తప్పు చేశామా అని ప్రతి ఒక్కరూ అనుకోసాగారు.

జలజ అడిగింది- "అక్కా! దొడ్డమ్మ ఎందు కలా ఉన్నారు!"

తుంగమ్మకు కారణం తెలుసు. సోమశేఖర్ వచ్చి వెళ్ళటమే దానికి కారణమయ్యుండాలి. తనదే తప్పు. కానీ ఏమని చెబుతుంది!

"నాకూ తెలియదు" అంది.

జలజ ఉదయం ఆస్పత్రికి వెళ్లివచ్చింది. "లలితకు జ్వరం తగ్గింది దొడ్డమ్మా—! టికీ దగ్గర పడుకోబెట్టారు" అంది.

మళ్లీ, కిటికీ దగ్గర పడుకోబెట్టటానికి కారణమయినవారి జ్ఞాపకం.

సాయంత్రం తుంగమ్మతో తామూ బయల్దేరుదా మనుకున్నారు వరసమ్మ. సోమశేఖర్ రావచ్చు. తెలిసికూడా అలక్ష్యం చేయటం మంచిది కాదు. కానీ తుంగమ్మ అంది-

"ఇవాళ సాయంత్రం నేను ఆస్పత్రికి రాను. విసుగ్గా ఉంది."

'అయ్యో అనేశానే, దొడ్డమ్మ సరే అంటే!' అని మనసు విలవిల్లాడింది.

"ఏం? నేనూ వస్తాను. పద పోదాం."

ఇది బాగానే ఉంది. తను వెళ్ళటం, తనకు దొడ్డమ్మ రక్ష కవచం. ఇక నేం, మంచిదే అనుకుంది తుంగమ్మ.

.... .... .... ....

చిత్రమయిన కుర్రాడు సోమశేఖర్. ఎంతో మంది అమ్మాయిల్ని కళ్ళతో చూశాడు. పూనాలో చదువుకునేప్పుడు ప్రణయ కలాపం కూడా కొంత సాగించాడు. కానీ అతడు చెడ్డవాడు కాదు. మోసగాడు కాదు.

అభయ ధామ వార్షికోత్సవపు వాతావరణం అతనికి కొత్త అనుభవం. తుంగమ్మను మొదటిసారి చూచినపుడు అతని హృదయాన్నెవరో గట్టిగా పట్టి కదిలించిన ట్లనిపించింది. అక్క నడిగి ఆ పిల్ల వివరాలన్నీ తెలుసుకున్నాడు—అన్ని వివరాలూను!

అన్నీ విన్నాక కూడా అతని మనసు తుంగమ్మను వదిలిపెట్ట టానికి ఒప్పుకోలేదు. ఎందుకీ ఆపేక్ష? ఏమిటి కారణం? సానుభూతా? ప్రేమా? ఏదీ పూర్తిగా అర్థం కాలే దతనికి. కాని ఒక్కటి

మాత్రం నిజం. తుంగమ్మ గుర్తుకొచ్చినప్పుడల్లా ఆమెను తన కన్నా తక్కువగా అనుకోటం అతనికి చేతకాలేదు.

.... .... ..... ....

ఆ సాయంత్రం కూడా వచ్చాడు సోమశేఖర్. టెరెలిన్ సూటు వేసుకోలేదు. తుంగమ్మతో ఉన్నప్పుడు ఆమెకన్నా ప్రత్యేకంగా కని పించటం ఇష్టంలేక మామూలు ప్యాంటు, చొక్కా తొడుక్కున్నాడు.

అతని నమస్కారాన్ని అందుకుంటూ సరసమ్మ సూక్ష్మంగా అతని మొహాన్ని పరిశీలించారు. అది నిష్కపటంగా కనిపించిం దామెకు.

అతనితో, లేదా సుందరమ్మగారితో మాట్లాడాలన్న ఆలోచనే వదిలిపెట్టారు సరసమ్మ.

... .... ... ....

లలిత నెమ్మదిగా కోలుకుంటోంది. తుంగమ్మ ప్రతి సాయంత్రం వస్తోంది.

సోమశేఖర్ రాకపోతే ఆమె కదోలా ఉంటుంది.

లలిత నవ్వుతూ అడిగేది-

"రాలేదా?"

"ఎవరూ?"

"నీ వారు."

"ఛ! అలా అనకమ్మాయ్!"

"క్షమించు."

తుంగమ్మ 'అలా అనరాదు' అనటానికి కారణం అలా జరగ దేమో ననే భయం.

ఆలస్యమయినరోజున సోమశేఖర్ క్షమించమన్నట్లు నవ్వుతూ వచ్చేవాడు. ఆపిల్, బత్తాయిపళ్ళు పట్టుకొచ్చేవాడు.

'నా తుంగక్కవల్ల ఇవన్నీ!' అనుకునేది లలిత.

* * *

ఉదయం పదింటికే మెలకువ వచ్చింది తుంగమ్మకు. కానీ

లేవా లనిపించలేదు. బలంగా తనను ఆవరించుకున్న పాత–కొత్త ఆలోచనల ముసుగు తియ్యలేక బాధపడుతూంది.

విన్న సాయంత్రం ఎన్నోరోజులుగా ఆమె ఎదురు చూస్తున్న 'క్షణం' వచ్చేసింది.

.... .... .... ....

సోమశేఖర్ రోజూ సాయంత్రం ఆస్పత్రికి వస్తున్నప్పుడు, అతని సామీప్యంలో తుంగమ్మ చాలా జాగ్రత్తగా ప్రవర్తించేది. అతను లేనపుడున్న ఆరాటం అతను రాగానే మాయమయ్యేది. అతని ముందు తన మనసులోని భావాలను బయట పెట్టేది కాదు. సోమశేఖర్ కూడా అంతే. తుంగమ్మకన్నా కాస్త ఎక్కువగానే గాంభీర్యాన్ని కనబరచేవాడు పైకి.

ఒక వారానికి ముందే బీద బాలిక లలిత ఆస్పత్రినుండి వెళ్ళిపోవాల్సింది. కాని సోమశేఖర్ డాక్టర్‌తో చెప్పి ఇంకా ఓ వారం ఆమె అక్కడుండేలా చూశాడు. పాపం! అభయ ధామంలో మంచి పోషణ ఎలా జరుగుతుంది? రోగిని ఇంకో వారం ఆస్పత్రిలోనే ఉండనిమ్మని సోమశేఖర్ అడిగినప్పుడు పెద్దడాక్టర్ నవ్వి 'అలాగే' అన్నాడు. కాని హౌస్‌సర్జన్ నాగరాజు నవ్వి గేలిచేశాడు.

"ఇదెక్కడి రొమాన్సురా బాబూ, ఎలా పట్టుకుంచిరా నిన్ను?" అంటూ.

సోమశేఖర్ దానికి బదులు చెప్పలేదు.

ఇంకా ఓ వారం ఉండా లన్నప్పుడు లలిత కూడా నవ్వింది.

"తుంగక్కా! వీళ్ళంతా ఏమనుకుంటున్నారో తెలుసా?"

"ఏమిటి?"

"సోమశేఖర్ నన్ను ప్రేమిస్తున్నారని."

ఆ మాట విని తుంగమ్మ మనసు కలత జెందింది. లోని భావాలను దాచటం కోసం నవ్వుతూ-

"ఎవ రన్నారలా?" అంది.

"ఆ క్రిస్టియన్ నర్సు లేదూ, కొత్త నర్సు–తెల్లగా పొట్టిగా!"

"అలా అన్నదా?"

"ఊఁ....డాక్టర్ నాగరాజూ, ఎవరో ఆయనా అలా అనుకుంటున్నారట."

"నువ్వే మన్నావ్ ?"

ఆపుకోలేక ఆ మాట అడిగేసింది తుంగమ్మ. మరుక్షణమే జవాబు వచ్చినా, మధ్య ఓ యుగం గడిచిన ట్లనిపించింది ఆమెకు.

"నే నన్నాను—'ఆ అదృష్టం నాది కాదు' అని."

తుంగమ్మ మాట్లాడలేదు. గొంతు తగ్గించి మెల్లగా అడిగింది లలిత-"ఆయనేమన్నా చెప్పారా అక్కా ?"

పెదవి కదపకుండానే లేదని తలాడించింది తుంగమ్మ.

లలిత వెళ్ళేరోజు వచ్చింది. ఆ ముందురోజు సాయంత్రం ఆస్పత్రి కొచ్చాడు సోమశేఖర్. ఆ రోజు మిగతా రోజులకన్నా వేరుగా ఉంది అతని ప్రవర్తన.

లలిత అంది-"చాలా సాయం చేశారు మీరు. రేపు వెళ్ళిపోతాను. ఇక మిమ్మల్ని చూస్తానో లేదో!"

పెంకి పిల్ల! నిరాశ ధ్వని అంతా నటన. కళ్ళల్లో కొంటెతనం మెరుస్తూంది.

కానీ సోమశేఖర్ పరధ్యాసగా ఉన్నాడు. అతనికేం అర్థం కాలేదు.

"ఏం ? అభయ ధామాని కొచ్చినప్పుడు మిమ్మల్ని చూస్తాగా ?"

"ఓ! అభయ ధామానికి వస్తూనే ఉంటారా అయితే ?"

ఆ ప్రశ్నతోబాటు వినిపించిన కొంటె నవ్వుతో సోమశేఖరం పరధ్యానంనుండి బయటపడ్డాడు. అతని మొహం ఎర్రగా కంది పోయింది.

ఆ సంభాషణ మధురంగా వినిపించింది తుంగమ్మకు.

ఆ సాయంత్రం అతడు సైకిల్ తేలేదు. ఆస్పత్రి పెద్ద గేటు దాటుతూ-

"నడుద్దామా ?" అన్నాడు.

ఆమె కాదనలేదు. ఇద్దరూ నడవసాగారు. తుంగమ్మ గుండె వేగంగా కొట్టుకుంది. ఎవరైనా తెలిసిన వారిప్పుడు తమను చూస్తే!

మావళ్ళ ఇంటివారు, లేదా తుమకూరు వాళ్ళెవరైనా....

దీపాలు వెలిగి, చీకటి పడిందని హెచ్చరించాయి.

సోమశేఖర్ నడుస్తూ, తుంగ పాదాలవైపు చూసి-

"మీ రెందుకండీ, చెప్పులు వేసుకోరు?" అన్నాడు.

"అభయ ధామంలో దొడ్డమ్మ తప్ప ఎవరూ వేసుకోరు."

"సహాయకురాలూ వేసుకోకూడదని నియమం ఉందా?"

"లేదు. నేను ఏం కావాలన్నా కొనుక్కోవచ్చని చెప్పార దొడ్డమ్మ. నేనే అక్కర్లేదని ఊరుకున్నాను."

అది పిసినిగొట్టుతనం కాదని సోమశేఖరునికి అర్థం అయింది.

"చెప్పులు కుట్టేవారిని తీసికెళ్ళి అందరికీ ఒక్కోజత చెప్పుల కుట్టించేద్దాం. ఏమంటారు?

"ఓ ... మీలాంటి ధర్మాత్ములు చేస్తామంటే కాదంటామా?"

చుట్టు దారిగుండా నడుస్తున్నారు వారు. సందడిలేని రోడ్డులోకి కావాలనే, మాట్లాడ్డానికి వీలుగా ఉంటుందని, నడిపించాడు సోమశేఖర్ కానీ మాట బయటకు రాకుండా దాక్కుంటోంది.

ఈ మౌనం అసహనీయంగా ఉంది ఇద్దరికీ.

'ఛ! నేనింత చాతకాని వాణ్ణని నాకే తెలియదింతవరకూ' అని తనను తాను నిందించుకున్నాడు. వెంటనే "తుంగా! చాలా రోజులుగా నీకో సంగతి చెప్పాలనుకుంటున్నాను" అనేశాడు.

తుంగమ్మ తల పైకెత్తలేదు. గుండె మరింత వేగంగా కొట్టుకోసాగింది. చనువుగా పిలవటం....మధుర మయిన కంఠం....

"ఒంటరిగా బ్రతకటమే మంచిదని చాలారోజులు అనుకున్నాను. కానీ మీ అభయ ధామం వార్షికోత్సవం రోజునుండి నా అభిప్రాయం మారింది. అక్కడొకర్ని చూశాక పెళ్ళి చేసుకుందామన్న తీర్మానాని కొచ్చాను. ఆమె ఎవరో తెలుసా తుంగా?"

చాలా రోజుల తర్వాత తుంగమ్మ కళ్ళు చెమర్చాయి. వెన వెంటనే కన్నీరు చెంపలమీదికి జారి ప్రవహించ సాగింది.

"చెప్పు, తెలుసా నీకు?"

ఆవేదనతో ఆమె పెదవులు వణికాయి. ఏదో చెప్పాలనుకుంది. కానీ కంఠం పెగల్లేదు.

"తుంగా, ఇటు చూడు!"

తుంగమ్మ తలెత్తి అరక్షణం సోమశేఖరుని వేపు చూసింది. రెండు బుగ్గలమీదా కన్నీరు ధారగా ప్రవహిస్తోంది. సోమశేఖర్ వేపు చూసి మళ్ళీ తల దించుకుంది తుంగమ్మ.

సోమశేఖర్ ఆమె దగ్గరగా నడుస్తున్నాడు. అతని చెయ్యి ఆమె అరచేతిని గట్టిగా పట్టుకుని మృదువుగా అదిమింది.

ఎదురుగా వస్తున్న ఓ. టి. సి. బస్సు వెలుగు తమమీద పడి నప్పుడు మాత్రమే ఆమె చేతిని వదిలిపెట్టాడు సోమశేఖర్. అప్పుడు ఏదో ఆధారం కోల్పోయినట్లు అనిపించింది తుంగమ్మకు.

ఆ క్షణంలో తుంగమ్మ ఏమీ ఆలోచించటం లేదు. ప్రశాంత తతోకూడిన మధుర మయిన శూన్యం ఆమెను ఆవరించింది.

కానీ అదెంతసేపు?.... మొదడు నిద్రపోవటం లేదు. ఆలోచ నలు మళ్ళీ....

ఇది న్యాయమా? అతడి చేతిని పట్టుకునే అర్హత ఉందా తనకు? తన గతం తెలియదా ఆతనికి? ఇప్పుడిలా అనుకుని అంతా తెలిశాక అవమానం పొందటమా!

నడుస్తూ అభయ ధామం దగ్గర కొచ్చారు వారు.

సోమశేఖర్ నుంచున్నాడు. తుంగమ్మా ఆగింది.

"తుంగా! నువ్వేం చెప్పనే లేదు."

"ఏం చెప్పను?"

"నన్ను పెళ్ళి చేసుకోటం నీ కిష్టమేనా?"

ఆమె మనసులోని మాట ఆఖరికి బయట పడింది.

"నా సంగతి పూర్తిగా తెలుసా మీకు?"

"తెలుసు. అంతా తెలుసు. దాన్ని పూర్తిగా మర్చిపో."

తుంగమ్మకు దుఃఖం మళ్ళీ ఉప్పెనలా పొంగి వచ్చింది.

"తుంగా! ఇలా నిన్ను నువ్వు హింసించుకోటం తప్పు. మాట్లాడు."

"ఏం చెప్పమంటారు?"

"దొడ్డమ్మతో మాట్లాడనా?"

"ఊఁ...."

సోమశేఖర్ మరోసారి తుంగమ్మ చేతిని అదిమి వదిలాడు.

.... .... .... ....

తలుపు తీసి, తుంగమ్మను లోనికి రానిచ్చి, సరసమ్మ అడిగారు.

"బస్సు దొరకలేదా?"

"లేదు, దొడ్డమ్మా!"

ప్రేమ వ్యవహారాలలో ఇలాంటి అబద్ధా లాడటం సహజం.

"నడిచే వచ్చావా?"

"ఊఁ...."

"ఒక్కదానివీ...."

అప్పుడు తుంగమ్మ అబద్ధాలు చెప్పలేదు.

"సుందరమ్మ తమ్ముడు వచ్చారు ఇంతదూరం."

అతడి పేరు చెబితే తన మొహం ఎక్కడ ఎర్రపడి పోతుందో నన్నభయంతో 'సుందరమ్మ తమ్ముడు' అంది తుంగమ్మ.

కాసేపాగి సరసమ్మ అడిగారు:

"రేపు లలితని ఎప్పుడు డిశ్చార్జి చేస్తారుట?"

"ఉదయం."

"నేనే వెళ్ళి తీసుకొస్తాను."

....అవి ముందురోజు సాయంత్రం జరిగిన విషయాలు.

.... .... .... ....

తెల్లవారుతూంది. తుంగమ్మ పూర్తిగా కళ్ళు తెరచి చుట్టూ చూసింది. పిల్లలు ఒక్కొక్కరే లేస్తున్నారు. దొడ్డమ్మ స్వయంగా వచ్చి గంట మ్రోగించారు. తుంగమ్మవేపు చూసి "లేచావా తుంగా?" అన్నారు.

లేస్తూ అంది తుంగమ్మ- "లేచాను దొడ్డమ్మా!"

ఉదయం జరగాల్సిన కార్యక్రమాలు ప్రారంభం అయ్యాయి.

సరసమ్మ జలజతో కలిసి ఆస్పత్రికి బయలుదేరారు. క్లాసులో పాఠాలు ప్రారంభం అయ్యాయి.

తుంగమ్మ సరిగ్గా పాఠాలు చెప్పలేకపోయిందారోజు. పురుగు దొల్చినట్లు ఒక్కటే విషయం ఆమెను బాధిస్తూంది. తను ఒప్పు కోటం పొరబాటు. వీల్లేదని చెప్పెయ్యాలి సోమశేఖర్‌తో. వీళ్ళందర్నీ వదిలి, ఈ అభయ ధామాన్ని వదిలి వెళ్ళట మెలా? అలా మనసును రాయిని చేసుకున్నాక తుంగమ్మ కాస్త తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

చిక్కి, చక్కనమ్మగా తయారయి వచ్చిన లలితను అందరూ ఆనందంగా ఆహ్వానించారు.

"ప్లీడరుగారు రాలేదూ?" అంది జలజతో లలిత - తుంగమ్మ వైపు చూస్తూ.

"ఎవరూ? రాజకుమారులా?" అంది ఏమీ తెలియని జలజ సరదాగా.

కానీ తుంగమ్మ నవ్వలేదు. ఆమె మొహంలోని గాంభీర్యాన్ని చూసి వాళ్ళిద్దరూ మౌనం వహించారు.

తుంగమ్మ ఎప్పటిలా లేకపోవటాన్ని సరసమ్మ గమనించారు. ఏదో జరిగుండాలి అనుకున్నారు. తుంగమ్మ తననుండి ఏమీ దాచదన్న నమ్మకం ఆమెకు. సోమశేఖర్ తుంగమ్మను ప్రేమించటమే నిజ మయితే, తన కత్యంత ప్రియమయిన వ్యక్తి అభయ ధామాన్ని వదిలి పోతుందన్న బాధ; లేక ఏదైనా పొరబాటు జరిగితే తమ శిక్షణంతా వ్యర్థమయిందే మోనన్న వ్యథ.

మొత్తంమీద ఆమె మనసుకు నెమ్మది లేకుండా పోయింది....

తరువాత విశేషం—అభయ ధామానికి కొత్త అమ్మాయి రావటం. వృత్తిలో వున్న పిల్ల. వయసు పద్దెనిమిదే అయినా మేహ రోగంతో బాధ పడుతోంది. ఆమె జబ్బును గుర్తించి కాస్త ఎక్కువ జాగ్రత్తలు తీసుకోవటం జరిగింది. ఎవరూ ఉపయోగించని, తనే శుభ్రం చేసుకునే కంచం, గుడ్డలు- వీటితో ఓ మూలగా ఉండసాగిం దాపిల్ల.

.... .... .... ....

రెండు వారాలు గడిచినా సోమశేఖర్ రాలేదు. సుందరమ్మగారి సంగతే తెలియదు.

ఏదీ జరగనే లేదన్నట్టు తుంగమ్మ నవ్వుతూ వుండటానికి ప్రయత్నించింది. కానీ దీపం ఆర్పేశాక, చీకట్లో ఆమె ఒక్కతే ఉన్నప్పుడు ఆమె మనసు పిచ్చిగా ఆలోచించేది. కలత చెందిన మనస్సుతో నిద్రపట్టక పక్కమీద దొర్లుతూ ఉండేది.

అభయ ధామ నిర్వాహక సమితి సభ జరిగిన ఓ సాయంత్రం, కార్యదర్శిని కమలమ్మ, సభ్యురాలు సుందరమ్మ ఇద్దరే మిగిలారు. అభయ ధామానికి బయలుదేరుతున్న సరసమ్మని పిలిచారు.

"కాసేపు కూర్చోండి, వెడుదురుగాని" అన్నారు.

సరసమ్మ ఇక సోమశేఖరుని గురించిన విషయం ప్రస్తావిస్తారేమో అనుకుంటూ కూర్చున్నారు. కానీ వారిమాట విన్నాక ఆమె ఆశ్చర్యానికి అంతులేదు.

"మన అభయ ధామం నుండి ఏమీ ప్రయోజనమే లేదని దుష్ప్రచారం చేస్తున్నా రెవరో" అన్నారు కమలమ్మ.

"ఎక్కడా? ఎవరూ?"

"ఎవరైతేనేం? ఓ 'ఎక్స్' అనుకుందాం. అతని వాదన మేరకు సంఘంలో స్త్రీ పురుషులకు సంబంధించిన అవినీతి ఎంతో ఉంది. దానిని ఇలాటి అభయ ధామాలు పరిష్కరిస్తున్నాయా? మేము ఎంతో వాదించాం. అతనికి సరైన జవాబు చెప్పలేక పోయాం. మీరైనా చెప్పగలరేమో చూడండి!"

"పరిష్కారమంటే ఎలా? మనకున్న అవధుల మేరకు శ్రమిస్తున్నాం."

"ఆ మాత్రం అందరూ చేస్తారు. ఈ సమాధానం చాలదు. ఇప్పుడు రాత్రి ఎవరైనా మామూలు పోలీసులు అమ్మాయిల్ని తరిమి తీసుకొచ్చి అభయ ధామంలో పడేస్తారు కదా?"

సంభాషణ స్వారస్యంగా ఉంది. సుందరమ్మ ఉత్సాహంగా ఉన్నారు. ఆ ఉత్సాహం అంటు జాడ్యంలా సరసమ్మకూ వ్యాపించింది.

"అవును. వాళ్ళని మంచి వాళ్ళుగా తయారు చేయడానికి ప్రయత్నిస్తాము."

"అది కాదండి. ఆ పోలీసులు 'చిక్కపేట,' దొడ్డపేట లాటి చోట పెద్దపెద్ద హోటెల్స్‌లో అద్దెకు దొరికే అమ్మాయిలను ఎందుకు పట్టుకోరూ?" అని."

సరసమ్మ నవ్వేశారు. ఈ సంగతి ఆమెకూ తెలుసు. ఊళ్ళోని 'ప్రముఖులు' కొందరు ఇలాటి ఏర్పాటుల వెనక ఉన్నారని, పెద్ద పెద్ద పోలీసు అధికారులే చూసీ చూడనట్లు ఉంటున్నారని ఆమెకు తెలుసు.

"అది మన చేతుల్లో లేదు."

"సరే! అది మన చేతుల్లో లేదు. వేశ్యా గృహాలు లేకుండా చెయ్యటం కూడా మన చేతుల్లో లేదు. వ్యభిచారానికి దారితీసే విషమ దాంపత్యాల పరిష్కారం మన చేతుల్లో లేదు. మన సంఘంలో అమ్మాయిలు తప్పుదారి పట్టటానికి అధికంగా సామాజిక కారణాలు ఉన్నాయి. జీవితపు విలువలను బోధించలేని విద్యాభ్యాస పద్ధతి, నైతికంగా మరింతగా దిగజారటానికి కారణమవుతున్న సినిమాలూ, మనసు మీద విపరీత ప్రభావం కనబరిచే చెత్తపుస్తకాలూ....ఇలా గమ్యం, ధ్యేయం లేని బ్రతుకు ఛిద్ర మవక తప్పదు. ఏమంటారు?

"నిజమే."

"అయితే యీ మూల కారణాలను ముందు దిద్దమంటాడతను."

"అది మన చేతుల్లో లేదు. ఆ పని ప్రభుత్వానిది. ప్రజలది. సంఘాన్ని పునర్నిర్మించాలంటే చాలా పెద్ద విషయ మది."

"అయితే ఎక్కడో దొరికిన ఓ పిల్లను తెచ్చి బాగుచేస్తే ఏమయినట్టు?"

"మనకు చేత నయినంత వరకూ మనం చేస్తాం."

"మళ్ళీ మొదటికే వచ్చాం."

ఎవరో వచ్చారని సుందరమ్మ సంభాషణ ఆపారు.

లేత నీలిరంగు ప్యాంటు మీద, మెరుస్తున్న తెల్లని లినెన్ బుష్ షర్టు వేసుకున్న సోమశేఖర్ లోపలికి వచ్చాడు.

రాగానే "ఓ! ఇంకా మీ సభ కాలేదూ?" అన్నాడు.

వెళ్ళిపోతున్న అతడిని కమలమ్మ పిలిచారు-

"ఇలా రండి. మిస్టర్ సోమశేఖర్—ఒక నిమిషం!"

సోమశేఖర్ వచ్చాడు. దొడ్డమ్మకు నమస్కరించి అక్క పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.

సుందరమ్మ మామూలుగా అన్నారు- "నేను ఇంతసేపు చెప్పలా, ఆ 'ఎక్స్' మహాశయుడు ఇతనే."

సరసమ్మ బిత్తరపోయి చూశారు. తన పెళ్లి సంగతులేమైన ప్రస్తావించారేమోనని సోమశేఖర్ మొహం ఎఱ్ఱబడింది.

"ఏమిటక్కా! ఈ ఎక్స్, వై, జడ్డూ?"

"అభయ ధామంవల్ల ఏమీ ప్రయోజనం లేదని నువ్వన్నావు చూడూ, దానిగురించే మాట్లాడుతున్నాం."

"ఓ, అదా?"

చూట్టానికి అది అక్కా తమ్ముళ్ళ మధ్య సరదాగా అనుకుంటున్నదైనా, అతని వాదనలో చాలాభాగం నిజం ఉంది. సరసమ్మ తెలివైన ఆ యువకుని అందమైన మొహాన్ని చూస్తూ, తుంగమ్మను తల్చుకుంటూ ఉండగానే వినిపించిన మాట ఆమెను ఆలోచనలోంచి బయట పడేసింది.

"ఇవ్వాళ మీకు చెబుదామనే అనుకున్నాం సరసమ్మా! అందుకే వచ్చాడిప్పుడు. తనను అల్లుడిగా చేసుకోవాలని మిమ్మల్ని అడుగుతున్నాడు సోమశేఖర్!"

నిరీక్షించని ఈ తుపానుకు సరసమ్మ ఖంగారు పడిపోయారు.

"సరదాగా అంటున్నారా?"

"లేదు సరసమ్మా! ఇతడినే అడగండి కావాలంటే. చెప్పరా సోమూ!"

"సంఘం-ప్రభుత్వం-పునర్నిర్మాణం అంటూ ఏవేవో వాదిస్తారే, ఈ మాత్రం చెప్పలేరూ?"

సుందరమ్మ నవ్వుతూ, "పోన్లెండి. మా తమ్ముడికి సిగ్గెక్కువ. నేనే అడుగుతా. నా తమ్ముడిని అల్లుడిగా స్వీకరించాలి మీరు."

"దాని కెవరైనా అదృష్టం చేసుకు నుండాలి సుందరమ్మా!"

"ఆ అదృష్టం మీది. ఇన్నేళ్ళుగా పెళ్ళి వద్దన్నవాడు ఇప్పుడు పెళ్ళి చేసుకుంటే మీ అమ్మాయినే అంటున్నాడు. వాళ్ళమ్మనూ ఒప్పించాడు."

"ఏ పిల్లని గురించి ఆయన అడుగుతున్నది?"

"ఆ మాత్రం ఊహించుకో లేరూ? మీ అసిస్టెంటుమీదనే అతని కళ్ళు. తుంగమ్మను మీ దగ్గరనుండి లాక్కుంటే ఇక అభయ ధామం ఎలా నడుస్తుందో చూద్దామని అతడి పట్టుదల! ఎలాగూ అభయ ధామం నుండి ప్రయోజనం లేదు కదా!" సుందరమ్మ బిగ్గరగా నవ్వి అన్నారు.

దుఃఖ సంతోషాల సమ్మేళనాన్ని దాచుకుంటూ సరసమ్మ నవ్వారు. సోమశేఖర్ కూడా నవ్వాడు. సరసమ్మ కార్యదర్శిని వేపు తిరిగి "ఇదంతా తమాషా కాదని నమ్మమంటారా?" అన్నారు.

"ఇంకా నయం. ఉగాది నాటికి ముహూర్తం పెట్టుకుందా మను కుంటున్నారు. అమ్మాయిని ఒప్పించండి. ఆమె తండ్రిని పిలిపించండి."

తుంగమ్మ తమని వదిలి వెళ్ళిపోతోందన్న విషయాన్ని రూఢి చేసుకున్నారు సరసమ్మ. బరువైన హృదయంతో లేచి నించున్నారు.

"అలాగే, ఇవ్వాళే తుంగతో మాట్లాడుతాను. రేపు ఉదయం వాళ్ళ నాన్నకు రాస్తాను."

"సరే, ఇక ఎలాగూ కాబోయే వియ్యాలవారయ్యారు. లేవండి, మా కార్లో దింపుతాం" అన్నారు సుందరమ్మ నవ్వుతూ.

బావగారి కారును కీలుగుర్రం కారు అని తుంగమ్మతో అనటం గుర్తొచ్చి సోమశేఖర్ తనలో తను నవ్వుకున్నాడు.

* * *

జలజకు తెలిసింది. సావిత్రికీ తెలిసింది. కానీ ఇంకా రహస్యంగానే ఉంది ఈ విషయం.

దొడ్డమ్మ తుంగమ్మను తీసుకుని, సుందరమ్మ ఇంటికి వెళ్ళి, సోమశేఖర్ ముసలి తల్లిని చూసి వచ్చారు. ఆమెకు మనసులో అనం

తృప్తిగానే ఉంది. అయినా కొడుకు పట్టుదలతో ఒప్పుకోక తప్పలేదు.

తుంగమ్మ తండ్రి వచ్చారు. ఆయనకు సంతోషం కన్నా ఆశ్చర్యమే ఎక్కువగా ఉంది. వస్తూ, ఇందులో ఏదైనా మోసం వుండొచ్చని కూడా అనుమానించారు.

కానీ ఇక్కడ మోసానికి తావే లేదు.

సుందరమ్మా—అనంతరామయ్యా దంపతుల అతిథిగా ఉన్నారాయన. ఇలాటి భర్తను పొందటానికి తుంగమ్మ జీవితం ఇలా అవాల్సి ఉందేమో అనుకున్నారు. విధి వైచిత్ర్యం-అని నిట్టూర్చారు, ఆనందంతో.

అభయ ధామానికి వచ్చి ఆఫీసు గదిలో సరసమ్మగారి గదిలో కూర్చున్నప్పుడు, కంఠం గద్గదమై ఆయన నోట మాట రాలేదు.

"నాకేం అర్థం కావటం లేదు సరసమ్మగారూ! ఇదంతా నిజమేనా అని భయంగా ఉంది. మొత్తంమీద చనిపోయేముందు మనశ్శాంతి వుండేలా చేశారు మీరు. మీ ఉపకారం ఈ జన్మలో మర్చిపోలేం."

ఆయన ఆమాత్రమయినా మాట్లాడగలిగారు. కానీ, సరసమ్మ మాటాడే స్థితిలోనే లేరు. ఆమె శూన్యదృష్టితో కిటికీనుండి బయటకు చూస్తూ కూర్చున్నారు.

తుంగమ్మ తండ్రి వచ్చి వెళ్ళాక పెళ్ళిసంగతి అందరికీ తెలిసిపోయింది. చాలామంది సంతోషించారు. కొంతమందికి అసూయ కలిగింది కూడా.

గుడ్డిపిల్ల సుంద్రా అడిగింది జలజను-

"ఆయన ఎలా ఉన్నారే చూట్టానికి?"

"ఎవరూ?"

"తుంగక్క ఆయన."

"ఎలా ఉన్నారని చెప్పనూ?"

—ఆ తరువాత సుంద్రా ప్రశ్నకు సమాధానంగా జలజ తన మనసులో ఊహించుకున్న రాజకుమారుడిని వర్ణించింది.

.... .... .... ....

ఉగాది దాకా ఆగలేదు పెళ్ళి.

బెళగావికి వెళ్ళిన తుంగమ్మ తండ్రి, పెద్దకూతురూ, అల్లుడితో వచ్చారు. పరీక్షలు దగ్గరి కొచ్చాయన్న కారణంతో తమ్ముడు రాలేదు. కానీ అక్కకో మంచి ఉత్తరం రాశాడు. పెళ్ళి ఎక్కడ జరగాలన్న ప్రశ్నకు కాస్త గొడవే అయింది. తుంగమ్మ "ఆయన ఎలా చెబితే అలా" అంది.

'ఆయన' "రిజిస్ట్రార్ ముందు సంతకాలతో పెళ్లి జరగా" లన్నారు. అభయ ధామంలో భారీగా విందు భోజనం జరిగింది. వధూవరులు ఆ సమయంలో అభయ ధామంలోని ఒక్కొక్కరికీ ఒక్కో మంచి చీరె, జాకెట్టు గుడ్డ, తమకు కావలసిన ఒక్కో చెప్పుల జత కోసం ఐదు రూపాయలూ ఇచ్చారు.

అమ్మాయిలు తాము తయారు చేసిన చాపలూ, చీరె, శాలువా ఇలాంటివి చదివించారు—వధూవరులకు.

కానీ, జలజ, లలిత, సావిత్రి ఏమీ ఇవ్వలేదు- అది వాళ్ళక్కయ్య పెళ్ళి గనుక.

వధువు భర్త ఇంటికి వెళ్ళే సమయం.

సోమశేఖర్ తుంగమ్మతో గదిలోకి వచ్చాడు. అతని కోరిక ప్రకారం తుంగమ్మ కొత్త షిఫాన్ చీరె కట్టుకుంది. కొత్తరకం జాకెట్టు వేసుకుంది. చెవులకు దుద్దులూ, మెడలో గొలుసు, చేతికి గాజులు — మొహంలో వెల్లివిరుస్తున్న ఆనందం—లావణ్యవతి తుంగమ్మ అనుకున్నారు సరసమ్మ. సుమారు సంవత్సరం క్రితం ఆశ్రయం కోసం వచ్చిన వాడిన పూవు కాదు ఇప్పుడు- విచ్చుకుంటున్న పుష్పం.

"వెళ్లొస్తా"నని చెప్పటానికి వచ్చింది తుంగమ్మ అనుకున్నారామె.

"ఏమ్మా తుంగా, వెడుతున్నావా?"

"ఇవ్వాళ వెడతాను, రేపే వచ్చేస్తాను దొడ్డమ్మా!"

సరసమ్మకు అర్థం కాలేదు. ఆశ్చర్యం కలిగింది.

"అంటే?"

"అమ్మా, మీ రేమనుకున్నారు? తుంగమ్మ మిమ్మల్ని వదిలి వెళ్ళిపోతుందని కదూ?" సోమశేఖర్ అడిగాడు. బదులు రాకపోవటం చూసి మళ్ళీ అతడే అన్నాడు-

"మేమింకా ఇల్లు చూసుకోవటం ఆలస్యం అవుతుంది. ఆ తరువాత జతగా ఉంటాం. కానీ ఇక్కడ అసిస్టెంట్ పని మీరు వద్దనేదాకా చేస్తుంది తుంగ. ఏం తుంగా?"

"అవును."

సరసమ్మ తమ చెవులను తామే నమ్మలేక పోయారు, ఈ కొద్ది రోజులలోనూ నిజమయిన సంతోషాన్ని అనుభవించింది ఈ క్షణమే.

"ఇంతకన్నా అభయ ధామానికి మీరు చేయగల సహాయం వేరే లేదు సోమశేఖర్." అన్నారు మనస్ఫూర్తిగా.

అంతలో జలజ, లలిత వచ్చారు. లలిత జబ్బుపడి లేచాక కాస్త ఒళ్ళు చేసింది. జలజ లోపలికి వచ్చింది. కొంటె నవ్వు తొంగి చూస్తూందామె పెదవులమీద.

"దొడ్డమ్మా, నే నోమాట చెప్పచ్చా?"

ఇదేదో తమాషా సంగతి అయి ఉంటుందని గదిలోని ముగ్గురూ గ్రహించారు.

"చెప్పు. దానికేం?" అన్నారు సరసమ్మ, నవ్వటానికి సిద్ధపడుతూ.

"భర్త యింటికి వెళ్ళాక పిల్లకి వేరే పేరు పెడతారు కదా?"

"అవును."

"ఇప్పుడు మా బావగారు భార్యకు మంచి పేరు పెట్టాలని..."

సోమశేఖర్ నవ్వాడు.

"ఏం పేరు పెట్టమంటారు?" జలజా లలితల వేపు చూస్తూ అన్నాడతడు.

"ప్రేమలతో, పుష్పలతో...."

తుంగమ్మ "ఛ-పో" అంది. సంవత్సరం క్రిందటి సంగతి గుర్తుకొచ్చిందామెకు. వచ్చిన కొత్తలో జలజ అంది- మీ పేరు ప్రేమలతో, పుష్పలతో అనుకున్నా అని.

"కానీ నా కేమో 'తుంగా' అన్నపేరు చాలా ఇష్టం" అన్నాడు సోమశేఖర్. తుంగమ్మ మొహం సిగ్గుతో కంది పోయింది.

.... .... .... ....

సాయంత్రం అయ్యాక తుంగమ్మ ఒక్కరోజు వుండటానికి భర్త ఇంటికి బయలుదేరింది. కీలుగుర్రానికి మారుగా మంచిగుర్రాన్ని కట్టిన బండి వచ్చింది.

అమ్మాయిలంతా ఆఫీసుగది కిటికీవద్దా, తలుపుదగ్గరా నుంచుని వీడ్కోలు ఇచ్చారు.

సరసమ్మ, జలజ, లలిత, సావిత్రి వీధిదాకా వచ్చారు.

బండి ఎక్కబోతున్న తుంగమ్మను ఆపి, జలజ అడిగింది:

"అక్కా, నాదో కోరిక. కాదనకు."

"ఏమిటది?"

"అక్కా, నీ కంచాన్ని నా కిమ్మని చెప్పు దొడ్డమ్మతో!"

అందరికీ వినిపించిం దామాట. అర్థంకాని సోమశేఖర్‌ని తప్పించి అందరూ నవ్వారు.

తుంగమ్మ మొహం కుంకుమ పులిమిన ట్లయింది.

"ఏమిటది?" అన్నాడు సోమశేఖర్ అర్థంకాక.

"పదండి. తరువాత చెబుతాను," అంటూ బండి ఎక్కింది తుంగమ్మ.

బండి బయలుదేరింది. తననే చూస్తూ నుంచున్న దొడ్డమ్మనీ, స్నేహితురాళ్ళనీ తిరిగి తిరిగి చూపింది తుంగమ్మ.

—ంంంంం—

# 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక




సరిగ్గా సంవత్సరానికి, సొంతానికి, సంసారపక్షమైన ఒక చిన్న గ్రంథాలయం కూర్చుకోడానికి ఘనమైన ఉపాయం హెచ్. ఎల్. పి. —అదే ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక :

## ఏమిచేయాలి ? ఏమేమి వస్తాయి ?

మీరు చేయవలసిందల్లా ఒక్కటే: నెల నెలా రూ. 7-50 చొప్పున వరసాగ్గా 12 నెలలు కట్టండి. అంతే. ఇక చూచుకోండి దాని ఫలితం:

1. మీరు కట్టే ఆ మొత్తం రూ. 90కు రూ. 136ల ఫలితం ముడతుంది. ఫక్తు రూ 100 లకు—దేశంలో పెద్దపెద్ద సంస్థలన్నీ ప్రచురించిన సుమారు 3,500 ఉత్తమ తెలుగు పుస్తకాల, 400కు పైబడి ఇంగ్లీషు పుస్తకాల (Jaico & Orient paperbacks) జాబితాలనుండి - మీ అంతట మీరుగా ఏరి కోరుకునే మంచి పుస్తకాలు వస్తాయి.

2. రూ. 20లకు పైగా విలువ చేసే పది పుస్తకాలు—మా ఉచిత పుస్తకాల పెద్ద జాబితానుండి మీ అంతట మీరుగా ఎన్నుకునేవి- అదనంగా, ఉచితంగా వస్తాయి.

3. రూ. 6 లు ఖరీదుచేసే మా మాసపత్రిక 'పుస్తక ప్రపంచం' సంచికలు ఆ 12 నెలలూ మీకూ మా ఖర్చుతో వస్తాయి.

4. వీటన్నిటికీ ప్యాకింగ్ రవాణాలకు దాదాపు రూ. 8-50 దాకా అయ్యే ఖర్చులు మేమే భరిస్తాము.

5. రూ. 1-50 ఖరీదు చేసే మా పెద్ద క్యాటలాగు వేరే ఉచితంగా వస్తుంది.

అంటే - ఈ రూపేణా మీరు కట్టే మొత్తానికి పైన అందులో సగానికి సగం అదనంగా వస్తుంది. దీన్నే గనక లెక్కగడితే మీకు సగానికి సగం (50%) లాభ మన్నమాట.

## ఇక ఇవి అందే విధానం :

మొదటి నెల చందా రూ. 7-50 కట్టగానే—

1. మీరు ఏరి కోరుకునే 4 ఉచిత పుస్తకాలూ, 2. ఆ నెల 'పుస్తక ప్రపంచం' పత్రికా, 3. 3,500 తెలుగువీ - 400 పైగా ఇంగ్లీషువీ పుస్తకాల జాబితా ఉన్న కేటలాగులూ, 4. మీ ఖాతా వివరాలు మీకై మీరు వ్రాసిపెట్టుకోవడానికి రికార్డు పుస్తకమూ వెంటనే అంది తీరుతాయి.

## 6 నెలలు చందా కట్టేసరికి?

మా తెలుగు, ఇంగ్లీషు పుస్తకాల కేటలాగుల్లోనుంచి మీరు ఏరి కోరుకునే రూ. 45 ల పుస్తకాలూ, మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి.

## 12 నెలలు పూర్తికాగానే?

మరో రూ. 55 ల పుస్తకాలూ, మరో 3 ఉచిత పుస్తకాలూ అందుతాయి. ఈ 12 నెలలూ - నెలనెలా - మీకు 'పుస్తకప్రపంచం' పత్రిక వస్తుంది.

పైవాటి కయ్యే పోస్టేజీ, రవాణా ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

## గడువు పూర్తయ్యాక మాటేమిటి?

12 నెలలూ పూర్తి చేస్తే మీకు కొన్ని యావజ్జీవిత సదుపాయాలు కలుగుతాయి.

1. యావజ్జీవితమూ మా పంపిణీ పుస్తకాలన్నిటిపైనా 10% కమిషన్; రూ. 20 లకు పైబడ్డ ఆర్డర్లకు అదనంగా రవాణా ప్యాకింగ్‌లు ఉచితం.

2. అవసరమైనప్పుడు రూ 50 లు మించకుండా పుస్తకాలు నెలలోగా డబ్బు చెల్లించే అరువు పద్ధతిమీద మా వద్ద తీసుకోవచ్చు.

3. 'పుస్తక ప్రపంచం' చందాకూడా 10% తగ్గించబడుతుంది.

4. ఉత్తరోత్తరా వచ్చే పెద్దా, చిన్నా క్యాటలాగులన్నీ ఉచితం.

5. "ఇంటింటా స్వంత గ్రంథాలయాలు" ఇంటగల వారి పేర్లు ఛాయాచిత్రాలతో సహా, పలువురికి ఉపయోగించగల విధంగా తీర్చి దిద్దిన సువర్ణగ్రంథంలో మీ పేరూ, ఫోటోకూడా చేర్చబడతాయి!

